# వైద్యక పరిభాష

వైద్య విద్యార్థులకు,
పండితులకు, సాహితీవేత్తలకు
వుపయోగపడే విధంగా పండిత
శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు
రూపొందించిన
వైద్య నిఘంటువు.

పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

సోల్ డిస్ట్రిబ్యూటర్స్

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, అబిడ్స్, హైదరాబాదు–500 001.

Vaidyaka Paribhasha - By Sreepāda Subrahmanya Sastri

మొదటి ముద్రణ : 1948

మా తొలి ముద్రణ : ఫిబ్రవరి, 2000

**Warning**

No part of this publication may be reproduced, stored in a retrieval system or transmitted, in any form or by any means, electronic, mechanical, photocopying, recording or otherwise, without the prior permission of the publisher & Copyright holder.

© ఎస్పార్.

వెల: రూ.60-00

ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
అబిడ్స్, హైదరాబాద్ – 500 001

విశాలాంధ్ర బుక్ హౌస్,
అబిడ్స్/సుల్తాన్ బజార్, హైదరాబాదు,
విజయవాడ, విశాఖపట్టణం,
కాకినాడ, గుంటూరు, అనంతపురం,
హన్మకొండ, తిరుపతి.

ముద్రణ: శ్రీ కళాంజలీ గ్రాఫిక్స్, హైదరాబాదు–29. ఫోన్: 3229831

# విన్నపం*

చాలాకాలంగా ప్రకటించాలనుకుంటున్న గ్రంథాలలో ఇదొకటి.

క్షుడితస్ఫురణ లేనప్పుడు పండితులకున్నూ దీని ఆవశ్యకం యేర్పడుతుంది. కాని ముఖ్యంగా ఇది విద్యార్థులకోసం రాశాను.

ఇది సమగ్రం కాదు. ఒక మహాశాస్త్రానికి దిగ్దర్శిని యిది. ఇలాంటివి ఎప్పుడూ సమగ్రాలుకావు. ఇందులో చేరవలసినవే ఎక్కువ. అవి సేకరిస్తూ వుంటాను.

శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామి నాయుడుగారి దయవల్ల ఇది ప్రకటన అయింది.

ఇట్లు

రాజమహేంద్రవరం. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

* శ్రీపాదవారు మొదటి ముద్రణకు రాసింది.

# వైద్యక పరిభాష

## అ

**అంగగౌరవం** – ఆమం, కఫం, కొవ్వు ఇత్యాదులు పెరిగి శరీరం బరువుగావుండటం. దీనికి గురుత్వం అనికూడా పేరు.

**అంగగ్రహం** – శరీరం ఎక్కడికక్కడ పట్టుకున్నట్టుండడం. శరీరపీడ.

**అంగగ్లాని** – శరీరం వాడిపోడం.

**అంగతాపం** – శరీరం లోపలిస్థితిని బట్టి అయినా, పై వాతావారణాదులను బట్టి అయినా ఉడుకుతో తపించిపోతూ వుండడం.

**అంగదరణం** – పిత్తం యెక్కువ కావడంవల్ల శరీరానికి కలిగే పీడ.

**అంగదాహం** – శరీరం అంతా మంటలుగా వుండటం.

**అంగమర్దం** – శరీరం అంతా నొప్పులుగా వుండడం.

**అంగమేజయత్వం** – శరీరం వొణకడం.

**అంగలాఘనం** – శరీరం తేలికగా వుండటం.

**అంగలేపం** – మంచిగంధం మొదలైన మెయి పూతలు.

**అంగశోషణం** – శరీరం శుష్కించడం.

**అంగసదనం** – శరీరం అంతటా పోట్లుపొడిచినట్టుండడం.

**అంగసుప్తి** – శరీరానికి స్పర్శజ్ఞానం లేనిస్థితి.

**అంగహర్షం**– శరీరం అంతటా పులకలు పేటెత్తడం.

**అంగాంగం** – కుంకుమపువ్వు, అంబరు, కస్తూరి, పచ్చకర్పూరం మొదలైన సుగంధద్రవ్యాలు కలిసిన మంచి గంధం. అంగలేపనం.

**అంగారధానిక** – కుంపటి.

**అంగారధూపం** – నిప్పుమీద ఇంగువ, సాంబ్రాణి మొదలైనవి చల్లి వేసే ధూపం.

**అంగారపరిపాచితం** – ఇనపతీగ, కాడ, పుల్ల మొదలైన వాటికి గుచ్చి కణ కణ లాడే నిప్పు బొగ్గులమీద కాల్చిన మాంసం.

**అంగారశకటి** – పొయ్యి లేక కుంపటి.

**అంగులితోరణం** – మంచిగంధం, కుంకుమ మొదలైనవాటితో నుదుటవుంచే అర్ధచంద్ర చిహ్నం.

**అంగులిపంచకం** – చేతివేళ్ళు. 1 అంగుష్ఠం (బొటనవేలు), 2. తర్జని (చూపుడువేలు), 3. మధ్యమం, 4. అనామిక, 5 కనిష్ఠకం (చిటికనవేలు).

**అంగులిపర్వ** – వేలి కణుపు.

**అంగులిమానం** – అంగుళంతో యోజనదూరం వరకూ కొలిచే మాన విశేషం, ఎనిమిది యవలు ఒక అంగుళం. 24 అంగుళాలు ఒక హస్తం. 4 హస్తాలు ఒక దండం. 2000 దండాలు ఒక క్రోసు. 4 క్రోసులు ఒక యోజనం.

**అంగులిమోటనం** – చిటిక. చిటిక వెయ్యడం.

**అంజలి** – మానపరిభాష. రెండు ప్రసృతుల పరిమాణం. అంటే 32 తులాల యెత్తు.

**అంజనం** – అంజనం అంటే కళ్ళకు పెట్టుకునే కాటుక. పుణ్యస్త్రీలకు ఇదొక అలంకారం. వైద్యరీత్యా ఇది మిక్కిలీ గుణకరమున్నూ. సుర్మా అని దీని ఉర్దూపేరు. ఈ అంజనం – సౌవీరాంజనం, రసాంజనం, స్రోతోంజనం, పుష్పాంజనం, నీలాంజనం అని అయిదు విధాలు. వీటిలో సౌవీరాంజనం ధూమ్రవర్ణంగా వుండి రక్తపిత్తం హరిస్తుంది. రసాంజనం విషాలూ, ఎక్కిళ్ళూ, నేత్ర రోగాలమా పోగొడుతుంది. వ్రణాలున్నూ శోధించి మాన్పుతుంది. స్రోతోంజనం పచ్చగా వుంటుంది. పుష్పాంజనం తెల్లగా వుంటుంది. నీలాంజనం నలుపు.

*గ్రంథాంతరం:* సౌవీరాంజనం, ఖాంబలాంజనం, మయూరతుత్థాంజనం, శ్రీకరాం

జనం, దర్వీకాంజనం, మేఘనీలాంజనం అని ఆరు విధాలు. సౌవీరం పచ్చగానూ, జాంబలం రాయిగానూ, మయూరమూ శ్రీకరమూ రత్నంలాగా, మేఘనీలం తైజ సంగానూ వుంటాయి. నెయ్యి, ఆముదం, నూనె – వీటిలో – దీపం పెట్టి, అది గాలిలేని చోటవుంచి దానిమీద గరిటె బోర్లించి వుంచితే పొగ అంతా కొంతసేటికి గరిటెలో కొడిగడుతుంది. అది కళ్ళకు పెట్టుకుంటారు. ఇదే దర్వీకాంజనం.

ఇది యెక్కువగా కావలసినప్పుడు, గరిటెకు బదులు దీపంమీద రాగిపళ్ళెం బోర్లించి వుంచడమున్నూ వుంది.

నేత్రాలలో వుండే సకలదోషాలూ తగ్గించి నైర్మల్యమూ, తీక్ష్ణ దృష్టీ కలిగించడమే అంజనం ఉపయోగం.

మొత్తంమీద ఈ అంజనం, 1. రసం, 2. వటి, 3. చూర్ణం అని, మరో మూడువిధాలు. అవి రోపణం, లేఖనం, స్నేహనం అని మళ్ళీ మూడువిధాలు.

క్షారమూ, తీవ్రమూ, ఆమ్లమూ – ఈ రసాలతో వుండేది. లేఖనం ఇది కంటి రెప్పలు, శిరలు, చెవులు, శృంగాటకం – వీటిలో వుండే దోషాలు కరిగించి నోటి నుంచీ, ముక్కుల్లోనుంచీ, కళ్ళల్లోనుంచీ బైటికి వెడలించేస్తుంది. ఇది కోతకాటుక.

చమురులో కలిసి వగరుగానూ, చేదు గానూ వుండేది రోపణం. రోపణం అంటే వ్రణాలూ, గాయాలూ మాన్పేది. ఇది కళ్ళకు బలకరం.

చమురు రూపాన తియ్యగా వుండేది స్నేహనం. ఇది దృష్టి దోషాలన్నీ పోగొడు తుంది.

**అంజనత్రయం/అంజనత్రితయం** – స్రోతోం జనం, రసాంజనం, కాలాంజనం – ఇవి మూడున్నూ.

**మతాంతరం: అంజనత్రితయం** – కాలాం జనం, పుష్పాంజనం, రసాంజనమున్నూ.

**అంజనద్వయం/అంజనయుగ్మం** – స్రోతోం జనమూ, రసాంజనమున్నూ.

**అంజనాదిగణం** – రసాంజనం, ప్రేంకణాలు, జటామాంసి, తామరపువ్వు, నల్లకలువ, యష్టి మధుకం, నాగకేసరాలు – వీటి సమవాయం.

**అంతఃకరణం** – మనస్సు.

**అంతఃకంఠ శల్యావలోకిని** – కంఠంలోవుండే శల్యాలు చూడడానికి ఉపయోగపడే ఒకానొక యంత్రం.

**అంతఃపదవి** – సుషుమ్నానాడి.

**అంతఃపరిమార్జనం** – ప్రకారాంతర త్రివిధౌ షధాలలో ఇదొకటి. శరీరంలో ప్రవేశించి, ఆహారవ్యత్యయంవల్ల సంభవించే వ్యాధులను శమింపజేసి ఆరోగ్యం కలిగించేది.

**అంతరాపత్య** – గర్భవతి.

**అంతరిక్షజలం** – ఆకాశజలం.

**అంతర్ముఖం** – వ్రణాలు చిదిపే ఒకానొక యంత్రం.

**అంతర్జఠరం** – కోష్ఠం.

**అంతర్మహానాదం** – శంఖం.

**అంతర్వత్ని** – గర్భవతి.

**అంతశయ్య** – మరణం.

**అంతస్సత్వ** – గర్భిణీస్త్రీ.

**అంతావసాయి** – మంగలి.

**అంత్రం** – పెద్దపేగు. ఎవరిబారను బట్టి వారికి – పురుషులకిది మూడున్నరబారలు, స్త్రీలకు మూడు బారలు వుంటుంది.

**అంత్రకూజనం** – పేగులు అరవడం.

**అంధకం** – బొగ్గు.

**అంధకారం** – చీకటి.

**అంధిక** – పొయ్యి.

**అంధమూష** – ఔషధాలు వండడాని కుప యోగించే మూస. దీనికే వజ్రమూష అని మరోపేరు.

**అంబష్ఠుడు** – బ్రాహ్మడు వైశ్యకన్యను పెళ్ళిచే సుకుని ఆమె యందు కన్నవాడు. బ్రాహ్మలలో ఒకరకం.

**అంబష్ఠాదిగణం** – పాఠాదిగణంలో ఇదొ కటి. ఇందులో చెప్పబడ్డ మూలికలు – పాఠ, ఆరెపువ్వు, మంజిష్ఠ, కొడిశపట్ట, యష్టి మధుకం, మారేడుపట్ట, జటామాంసి, లొద్దుగు, తెల్లలొద్దుగు, మోదుగుపట్ట, నందిచెట్టు, పట్ట పద్మకేసరాలున్నూ.

**అంశూదకం** – శరదృతువులో పగలు సూర్య కిరణాలూ, రాత్రి చంద్రకిరణాలూ, తగులు తూవుండేటట్టు ప్రవహించే నదిలోని జలం.

ఇది ఆకాశజలంతో సమానమైనది. జలకరం. రసాయనం. శీతలం. లఘువు. శ్రమతగ్గిస్తుంది. పిత్తం, ఉష్ణం, మంటలు, విదాహం, విషాలు, మూర్ఛలు, రక్తపిత్తం, మదాత్యయం – ఈ వ్యాధులలో, మిక్కిలీ హితకరం. అరూక్షం. అనభిష్యంది. దీనికే హంసోదకం అనిన్నీ పేరు.

**అకాలజం** – అకాలంలో పండిన పంట. ఇది ధాన్యం, కాయలు, పళ్ళు ఇత్యాదులలో ఏదయినా మంచిదికాదు. విరసమైనది. గుణకారి కాదు. దుర్గుణాలు కలిగిస్తుంది.

**అకాలభోజనం** – ప్రతీవారికీ భోజన సమయం ఒకటి నియతంగా వుండాలి. ప్రతిదినమూ, రెండు పూటలా ఆ నియతకాలంలోనే భోజనం చేస్తూ వుండాలి. వేళకాకుండానూ, వేళదాటీ భోజనం చెయ్యగూడదు. అలా భుజిస్తే తలనొప్పి, అతిసారం, శరీరం శుష్కిం చడం – మొదలైన వ్యాధులు అంకురిస్తాయి. చివరికి మరణమున్నూ తటస్థిస్తుంది. ఇది ఎంతమాత్రమూ మంచిది కాదు.

**అకాలశయనం** – వేళ కాకుండానూ, వేళదాటీ నిద్రించడం. ఇది ఎన్నో జబ్బులకు కారణం అవుతుంది. ముఖ్యంగా దీనివల్ల శ్లేష్మం ప్రకోపిస్తుంది. పీనస, పడిశం, క్షయ, ఉబ్బు, తలనొప్పి, ఆకలి తగ్గిపోవడం – ఇలాంటి బాధలు కలుగుతాయి.

**అకృతాఖ్యయూషం** – ఉప్పు, కారం, చమురు – ఇవి లేకుండా తయారు చేసిన కంది కట్టు, పెసరకట్టు మొదలైనవి. ఇది మిక్కిలి లఘుపదార్థం. సులభంగా జీర్ణం అవుతుంది.

**అక్వథితక్షీరం** – అనగా పచ్చిపాలు – కాచనివి, పితుకుతూ పితుకుతూ ఉండగానే పుచ్చుకుంటే అది గుమ్మపాలు అనిపించుకుంటుంది. ఇది కాచకుండా నిలవవుండిన పచ్చిపాలు. ఇది గురుపదార్థం. శ్లేష్మం పెంచుతుంది.

**అగదంకారుడు** – వైద్యుడు. రోగాలు రాకుండా వుండేటట్టూ, వస్తే తగ్గిపోయేటట్టూ చేసి ఆరోగ్యం సరిగా కాపాడేవాడు.

**అగదతంత్రం** – ఆయుర్వేదవైద్యానికి ఎని మిది తంత్రాలున్నాయి. వాటిలో ఇదొకటి. ఇందులో విషనిదానమూ, విషచికిత్సా సవిస్తా రంగా వుంటాయి. తేళ్ళు, పాములు, ఎలుకలు – ఇత్యాది విషజంతువుల విషాలూ, స్థావర విశేషాలూ, తగ్గించేసే ప్రక్రియలు అన్నీ ఈ తంత్రంలో వుంటాయి.

**అగదనస్యం** – పాములు మొదలైన విషజం తువులు కరచినప్పుడు చేసే నస్యం.

**అగదాంజనం** – విషాలవల్ల మూర్ఛ వచ్చినప్పుడు తెలివి రావడానికి కళ్ళలో పెట్టేకాటుక. కలికం అనిన్నీ చెప్పవచ్చు.

**అగూఢగంధం** – గుప్పుమని వాసనకొట్టే వస్తువు. ఉల్లి, ఇంగువ, వెల్లుల్లి, కస్తూరి, పచ్చకర్పూరం మొదలైనవి.

**అగ్ని** – అంటే జఠరాగ్ని. మందం, తీక్ష్ణం, విషమం, సమం అని ఇది నాలుగు విధాలు. కఫం యెక్కువగా వుంటే జఠరాగ్ని మందగి స్తుంది. పిత్తం యెక్కువగా వుంటే తీక్ష్ణమూ, వాతం యెక్కువగా వుంటే విషమమూ అవుతుంది. త్రిదోషాలూ సమానస్థితిలో వుంటే సమం అయి తిన్నది చక్కగా జీర్ణింపజేసి, రక్తమాంసాలు పెంచి బలమూ, పుష్టి, వుల్లాసమూ, ఓజస్సూ కలిగిస్తుంది.

మందాగ్ని కఫవ్యాధులూ, తీక్ష్ణాగ్ని పిత్తవ్యా ధులూ, విషమాగ్ని వాతవ్యాధులూ వృద్ధి చేస్తుంది. మందాగ్ని కొద్దిగా తిన్నా జీర్ణింప చెయ్యలేదు. విషమాగ్ని ఒకప్పుడు చక్కగా జీర్ణింపచేస్తుంది. ఒకప్పుడు లేశమూ జీర్ణిం పచెయ్యలేదు. తీక్ష్ణాగ్ని తినవలసినంత తిన్నా ఎక్కువగా తిన్నా బాగా జీర్ణింపచేస్తుంది.

నాభికి కొంచెం యెడమదిక్కుగా సోమ మండలంవుంది. ఆ సోమమండలం మధ్య సూర్యమండలం వుంది. ఆ సూర్యమండలంలో వుంటుంది జఠరాగ్ని. జరాయు మాత్రంచేత కప్పబడివుండి, అది గాజు కుప్పెలో వున్న దీపంలాగ భాసిస్తూ వుంటుంది. ప్రాణి కోటి భుజించే సకల పదార్థాలూ అది తన జ్వాలలతో పచనంచేస్తూ వుంటుంది. అది పెద్ద పెద్ద శరీరాలు గల జీవకోటికి యవగిం జంత వుంటుంది. క్రిమికీటకాలూ, పక్షులూ మొదలైనవాటికి చాలా చిన్నదిగా వుంటుంది.

**అగ్ని కర్మ** – అంటే గ్రంథి మొదలైన రోగాలలో కాల్చిన సలాకతో చేసే దాహకర్మ. ఇది క్షారకర్మకంటే మంచిది. కాని గుణాలలో దానికంటే ఏమంత మంచిది కాదు. రోగాధిష్ఠాన భేదం వల్ల ఇది వలయం, బిందువు, విలేఖం, గుప్తం అని నాలుగువిధాలు. గ్రీష్మర్తువులోనూ, శరదృతువులోనూ తప్ప ఇది తక్కిన సమస్త రుతువులలోనూ చెయ్యవచ్చు. బాలురకూ, వృద్ధులకూ, దుర్బలులకూ, భయగ్రస్తులకూ ఇది చెయ్యగూడదు.

**అగ్ని చతుష్టయం** – సమాగ్ని, మందాగ్ని, తీక్ష్ణాగ్ని, విషమాగ్ని.

**అగ్నిప్రస్తరం** – నిప్పుపుట్టించే రాయి. దీనినే అగ్గిరాయి అంటారు.

**అగ్నిసాధ్యం** – అగ్నికర్మచేతనే తగ్గే వ్యాధి.

**అగ్నిసేవనం** – అంటే నిప్పుదగ్గిరా, మంట దగ్గిరా కూచుని కాచుకోవడం. దీనివల్ల చలి, వాతవికారాలు స్తంభం, కంపం, కఫవృద్ధి తగ్గి పోతాయి. ఆమం పక్వం అవుతుంది. కాని రక్తపిత్త వ్యాధి అంకురిస్తుంది.

**అగ్నిస్కంధం** – అగ్గిగుండం.

**అగ్రం** – మానపరిభాష; ఒక పలంయెత్తు.

**అగ్రమాంసం** – గుండెకాయ.

**అచింత్యాత్మ** – పరమాత్మ.

**అచికిత్స్యుడు** – చికిత్స చెయ్యడానికి సాధ్యం కాని స్థితిలో వుండిన రోగి.

**అచ్యుతావాసం** – రావిచెట్టు.

**అజంతుజగ్ధం** – పురుగుముట్టని బీజం, మూలిక – ఇత్యాది.

**అజనామకం** – తేనె.

**అజక్షీరనాశం** – టేకుచెట్టు.

**అజాతదంతుడు** – ఆరుమాసాలు దాటినా దంతాలు అంకురించని శిశువు.

**అజాపంచకం** – మేకమలం, మేకమూత్రం, మేకపాలు, మేకపెరుగు, మేకనెయ్యి.

**అజాపక్వం** – కాచిన నేతిలో ఒకరకం.

**అట్టం** – అన్నం.

**అట్టశాల** – పూటకూటియిల్లు. (హోటల్.)

**అట్టాలకం** – మేడ.

**అట్టాలిక** – రాజులు నివసించే సౌధం.

**అణుజ్యోతి** – చిన్నచూపు.

**అతిక్రాంతావేక్షణం** – వెనకచెప్పబడ్డది. వెన కచూపున్ను.

**అతిఘూర్ణత** – అతినిద్ర.

**అతితర్పణం** – మిక్కిలీ తృప్తి.

**అతిదాహం** – మిక్కిలీ తాపం.

**అతిపక్వమాంసం** – చిమడవుడికిన మాంసం.

**అతిపక్వక్షీరం** – ముద్దకట్టేటట్టు కాచినపాలు. ఇది మిక్కిలీ గురుపదార్థం.

**అతిభారగం** – కంచరగాడిద.

**అతిభోజనం** – ఎక్కువగా భుజించడం. దీనివల్ల గురుత్వమూ, అలస భావమూ, పోట్లూ, చిక్కిపోడమూ – ఈ బాధలు సంభవిస్తాయి.

**అతియవం** – యవకంటే చిన్నది. యవకంటే తక్కువ.

**అతియుక్తం** – తరుచుగానూ, ఎక్కువగానూ వాడినది.

**అతియోగం** – ఎక్కువగా వాడడం.

**అతియోగం** – శ్రోత్రాదులకూ, శబ్దాదులకూ అధిక సంబంధం.

**అతియోగం** – రోగకారణాలు మూడింటిలో ఇదొకటి. అతితీక్ష్ణాలైన కాంతి, ఎండ, అగ్ని మొదలయినవి చూడడం కళ్ళకూ; ఉరుమూ వాద్యాలు మొదలైన భీకరధ్వనులు అతిగా వినడం చెవులకూ; వల్ల జీలకర్ర, వస, కల్లు సారాయి మొదలైన మిక్కిలీ ఘాటుగల వస్తువులు ఎక్కువగా ఆఘ్రాణించడం ముక్కుకీ; మిక్కిలీ మధురమూ, కారమూ మొదలైన రసాలు ఎక్కువగా భుజించడం జిహ్వకూ; మిక్కిలీ చల్లనీ, వెచ్చనీ పదార్థాలు తాకడం అధిక వ్యాయామం చెయ్యడం – ఇత్యాదులు శరీరానికీ అతియోగం.

**అతిరూక్షం** – చమురులేనిది. జిడ్డులేనిది.

**అతిరోగం** – క్షయరోగం.

**అతిలంఘితం** – ఎక్కువగా లంఘనాలూ, ఉప వాసాలూ చెయ్యడం. దీనివల్ల దేహసంధుల్లో పోటూ, శరీరం అంతటా కూడా పోట్లూ, దగ్గూ, ముఖం శుష్కించడం, ఆకలి తగ్గి పోడం, అరుచి, దప్పిక, చూపు మందగించడం, చెవులకు గ్రహణశక్తి తగ్గిపోవడం, మనస్సుకి సంభ్రమం. తలనొప్పి, కళ్లు చిరతలు కమ్మడం, శరీరం కృశించిపోడం, జీర్ణశక్తి తగ్గిపోడం – ఇత్యాది బాధలు కలుగుతాయి.

**అతివ్యధ** – చికిత్సలో యంత్రా లెక్కువగా వాడడం.

**అతివ్యాయామం** – అంటే కసరత్తు ఎక్కువగా చెయ్యడం. ఇది మంచిదికాదు. దీనివల్ల దగ్గు, జ్వరం, ఛర్ది, శ్రమ, క్లమ, దప్పిక, క్షయ, ప్రతమకశ్వాస (ఉబ్బసం), రక్తపిత్తం – ఈ వ్యాధులు సంభవిస్తాయి.

**అతిశృతం** – చాలా అధికంగా కాచినది.

**అతిశృతక్షీరం** – గడ్డకట్టేటట్టు కాచినపాలు.

**అతిసేవనం** – ఏదయినా పదార్థం ఎక్కువగా తినడం, ఏపని అయినా ఎక్కువగా చెయ్యడం – ఇత్యాది.

**అత్యంతశోణితం** – రక్తం ఎక్కువగా వుండడం.

**అత్యంబుపానం** – మంచినీళ్ళు ఎక్కువగా తాగడం. ఇది చాలా చెడ్డపని. దీనివల్ల అజీర్తి సంభవిస్తుంది. మంచినీళ్ళు మిక్కిలి తక్కువగా పుచ్చుకున్నా యిదే జబ్బు. కనుక తరచుగా – కొంచెంకొంచెంగా తాగాలి. ఇలాచేస్తే జఠరాగ్ని వృద్ధి అవుతుంది.

**అత్యగ్ని** – అతి ఆకలి.

**అధఃపాతనం** – పాదరస సంస్కారాలలో ఇదొకటి.

**అద్యశ్విన/అద్యశ్వీన** – ఈనమోపైన ఆవు.

**అధిపతి** – శరీరంలో వుండే మర్మస్థానాలలో ఇదొకటి. ఇది శిరస్సున వుంటుంది. శిరలన్నీ అక్కడ కలుస్తాయి. పైగా సుడివుంటుంది.

**అధిరూఢ** – ప్రౌఢ స్త్రీ. 32 – 50 ఏళ్ళ మధ్యవయస్సు కలది.

**అధిరోహిణి** – వెదురుబొంగులతోనూ, మాను కమ్ములతోనూ తయారుచేసిన నిచ్చెన.

**అధిశ్రయణి** – పొయ్యి.

**అధిష్ఠానం** – స్థానం, నగరం, గ్రామం.

**అధిష్ఠానదేవతలు** – బుద్ధికి బ్రహ్మ, అహంకారానికీశ్వరుడు, మనస్సుకి చంద్రుడు, శ్రోత్రానికి దిక్కులు, త్వక్కుకు వాయువు, నేత్రాలకు సూర్యుడు, జిహ్వకు ఉదకం, ఘ్రాణానికి పృథివి, వాక్కునకు అగ్ని, హస్తాలకు ఇంద్రుడు, పాదాలకు విష్ణువు, గుదానికి మిత్రుడు, ఉపస్థకు (మేహనానికిన్నీ) ప్రజాపతి – అధిష్ఠానదేవతలు.

**అధోంశుకం** – కట్టుబట్ట.

**అధ్యశనం** – అజీర్తిగావుండగా – అంటే తిన్నది జీర్ణంకాకుండా మళ్ళీ భోజనం చెయ్యడం. ఇది చాలా అపాయం కలిగిస్తుంది. అయితే, విశేషవిధి ఒకటి ఉంది. ప్రతీమనిషీ దినానికి రెండుమార్లే భోజనం చెయ్యాలి. అంతకంటే యెక్కువ చెయ్యగూడదు. చేసిన కొంత సేపటికే మళ్ళీ భోజనం చెయ్యడం మరీ తప్పు. అయితే, పగలు తిన్నది జీర్ణంకాకపోయినా రాత్రి యథాకాలంలో మళ్ళీ భోజనం చెయ్యవచ్చు. రాత్రి తిన్నది జీర్ణం కాకుండా ప్రాతఃకాలం మళ్ళీ భుజించడం మాత్రం చాలా తప్పు. ఆ భోజనం విషం అవుతుంది.

సూర్యునివల్ల తామరపువ్వులాగ, పగటిపూట హృదయం చక్కగా వికసించివుంటుంది. దాని వల్ల స్రోతస్సులన్నీ స్ఫుటంగా వుంటాయి. వ్యాయామం చేసినా, దుఃఖించినా, చిత్త విక్షేపం కలిగినా, ధాతువులు క్లిన్నా అయిపోవు. పచ్చిపాలలో మళ్ళీ పాలు పోసి కలపడం దోషం కానట్టు, ప్రాతఃకాలం చేసిన భోజనం జీర్ణం కాకపోయినా రాత్రి మళ్ళీ భోజనం చెయ్యవచ్చు. తప్పులేదు.

రాత్రిపూట హృదయం ముడుచుకుపోయి వుంటుంది. స్రోతస్సులున్నా అన్నీ సంవృతాలయి వుంటాయి. కోష్ఠమున్నా ముడుచుకుపోతుంది. అంచేత ధాతువులన్నీ పరిక్లిన్నాలయివుంటాయి. కనక, కాగివుండిన పాలలో మళ్ళీ పచ్చిపాలు కలపడం యెలాగ దోషమో, అలాగ, రాత్రి తిన్నది జీర్ణం కాకుండా పగలు మళ్ళీ భోజనం చెయ్యడం దోషం అవుతుంది. ఇది మిక్కిలీ అపాయకరంగా పరిణమిస్తుంది.

**అధ్యక్షం** – మానవపరిభాష. అర్థకర్షం.

**అధ్యూఢ** – పెళ్ళిఅయిన యువతి.

**అధ్వనిషేవణం** – నడక.

**అధ్వశోష** – ఎక్కువగా నడవడంవల్ల యిది సంభవిస్తుంది. శరీరం అంతా కుళ్ళగొట్టినట్టయి రంగున్నా మారిపోతుంది. క్లోమమూ కంఠమూ ఆర్చుకుపోతాయి. జఠరాగ్ని మందగించి పోతుంది. దాంతో అనేక విధాలైన బాధలు ప్రారంభం అవుతాయి. అతిగా నడవడం మంచిదికాదు.

**అనశనం** – భోజనం చెయ్యకపోవడం. ఉపవాసం. లంఘనం.

**అనాగతార్తవ** – రజస్వల కాని పిల్ల.

**అనాగతావేక్షణం** – భవిష్యత్తును గురించిన ఆలోచన.

**అనామిక** – చేతివేళ్ళలో (బొటనవేలు మంచి) నాలుగోది.

**అనార్జవం** – ఆరోగ్యం చెడిపోయి వుండడం. వ్యాధి.

**అనార్తవం** – అకాలంలో పుట్టిన, కాయ, పండు, వాన, ఇత్యాది.

**అనార్తవజలం** – పౌషమాఘఫాల్గున మాసాలలో కురిసిన వాననీరు. ఇది మంచిది కాదు. త్రిదోషాలూ వృద్ధిచేస్తుంది.

**అనావంశం** – ఇదొక మర్మస్థానం.

**అనిత్యత** – మరణం.

**అనిలకారకం** – కాంజికాలలో ఇదొకటి.

**అనుకర్ణం** – చెవి సమీపం.

**అనుకర్షణం** – పానపాత్ర.

**అనుకల్పం** – అసత్యమైన ఒక వస్తువు అభావం అయితే, అలాంటి రసవీర్యవిపాకాలు గల మరొక వస్తువు గ్రహించడం.

**అనుగుడు** – పరిచారకుడు.

**అనుచ్ఛ్వాసం** – ఊపిరి బిగపట్టడం.

**అనుతక్రం** – మజ్జిగ అనుపానంగా ఔషధం పుచ్చుకోడం.

**అనుతర్షం** – మద్యపానం చేసే పాత్ర.

**అనుత్క్లేశం** – ఉత్క్లేశం లేకపోవడం.

**అనుపజం** – అనూపదేశంలో పుట్టినది.

**అనుపదీనం** – చెప్పులజోడు.

**అనుపశయం** – వ్యాధిని వృద్ధిచేసే ఆహారం, విహారం, ఔషధం మొదలైనవి.

**అనుపానం** – ఔషధం పుచ్చుకున్న తరవాత పుచ్చుకునే ద్రవద్రవ్యం. చూర్ణాలూ, అవలేహాలూ, గుటికలూ, కల్కమూ, వంట కజ్జరి ఔషధాలు పుచ్చుకొన్నప్పుడు వ్యాధి ననుసరించి అందుకు తగ్గ అనుపానమున్నూ పుచ్చుకోవాలి. ఇది ఔషధం పనిచెయ్యడానికి మిక్కిలి తోడ్పడుతుంది. దీనికిన్నీ వ్యాధివిర్యాలవ శక్తి వుంటుంది. వాతవ్యాధిలో స్నిగ్ధోష్ణంగా మూడు పలాలూ, పిత్తవ్యాధితో స్నిగ్ధంగా రెండు పలాలూ, కఫవ్యాధిలో రూక్షోష్ణంగా ఒక్కపలమూ దీని స్వరూప పరిమాణాలు. కషాయం ఏపూట కాపూట కాచుకోవాలి; గాని ఒక్కపూట అయినా నిలవ ఉన్నది పనికిరాదు. తైలానికీ ఘృతానికీ అనుపానం వేడినీళ్ళు. వ్యాధివిశేషాల ననుసరించి వీటికి వేడిపాలు మొదలైనవిన్నీ వాడవచ్చు.

**అనుబంధం** – ఆయువు.

**అనుమానం** – ప్రమాణచతుష్టయంలో ఇదొకటి. ఒక సాధన ఆధారం చేసుకుని ఒక నిర్ణయానికి రావడం అనుమానప్రమాణం. పర్వతం మీద నిప్పు ఉన్నది అని నిర్ధారణం. దీనికి సాధనం పొగ ఉండడం. పొగలేకపోతే నిప్పుండదు. ఊహవల్ల ఇది సాధించబడ్డది.

**అనులేపనం** – చందనం మొదలైన మెయి పూత. ఇది చాలా మంచిది. దీనివల్ల దప్పిక, మూర్ఛ, దేహదుర్గంధం, శ్రమ, వాతప్రకోపం – ఇవి తగ్గిపోతాయి. సౌభాగ్యమూ, తేజస్సూ, చర్మానికి నిగనిగా, ఓజస్సూ, బలమూ వృద్ధి అవుతాయి. ప్రీతిన్నీ కలుగుతుంది. ముఖ్యంగా మనోల్లాసం కలుగుతుంది.

**అనులోమనం** – మలాదులను యుక్తమార్గాన బయటికి వెడలించడం.

**అనులోమనౌషధం** – భుజించిన ఆహారం చక్కగా పక్వంచేసి కిట్టం అంతా మలాశయానికి చేర్చి, మలబంధం పోగొట్టి తుదకు అధోభాగానికి చేర్చేది అనులోమనం. కరక్కాయ మొదలైనవి ఈ పని చేస్తాయి.

**అనువాసం/అనువాసనం/అనువాసనకం** – అనువాసనవస్తి.

**అనువాసనవస్తి** – చమురులతోనూ – స్నేహ క్వాథలతోనూ చేసే వస్తికర్మ.

**అనువాసనోపగవర్గం** – అనువాసనవస్తి కుప యోగించే కషాయద్రవ్య సమూహం. ఈ ద్రవ్యాలు పది. ఇవి సన్నరాష్ట్ర, దేవదారు, మారేడు, ఉమ్మెత్త, సదాప, తెల్లగలిజేరు, గలిజేరు, పల్లేరు, నెల్లి, శ్యోనాకమున్నూ.

**అనువేల్లితం** – వ్రణాలకు కట్టే కట్లలో ఒకరకం.

**అనుశస్త్రం** – చర్మం, స్ఫటికం, గాజుముక్క, జలగ, అగ్ని, ఉప్పు, గోళ్ళు – ఇలాంటి సాధనాలతో చేసే శస్త్రకర్మ. ఇది పిల్లలకు భయగ్రస్తులకున్నూ చేసేది.

**అనూచానం** – వేదవేదాంగాలు చదివిన వైద్యుని ధర్మం.

**అనూపం** – జలభూయిష్ఠమైన ప్రదేశం.

**అనూపజం** – అనూపదేశంలో పుట్టినది.

**అనూపదేశం** – జలభూయిష్ఠమైన ప్రదేశం.

**అనూపమాంసం** – అనూపదేశంలో పుట్టిన జంతువులదీ పక్షులదిన్నీ మాంసం.

**అన్నం** – వరిబియ్యం, గోధుమలు, కొర్రలు, చాములు మొదలైన గింజలతో సిద్ధపరిచే భోజనద్రవ్యం. అన్నం చర్వ్యం, చోష్యం, లేహ్యం, పేయం అని నాలుగువిధాలు. కొందరు నిష్పేయం, చర్వణం, చోష్యం, ఖాద్యం అని మరోనాలుగు విధాలున్నూ – అంటే మొత్తం యెనిమిది విధాలని చెప్పారు.

**అన్నకాలం** – అంటే భోజనం చెయ్యవలసిన సమయం. రసమూ, దోషాలూ, మలాలూ పక్వం అయినప్పుడు ఆకలి అవుతుంది. కాలమూ అకాలమూ అని యిక. విచారణ

చెయ్యనక్కరలేదు. అప్పుడు చక్కగా భుజించవచ్చు.

**అన్నకోష్ఠం** – ధాన్యాదులు నిలవచేసుకునే గాదె.

**అన్ననాడి** – అన్నం పక్వం చేసే నాడి. ఇది యిరవై మూరల పొడుగు. ఇది కండలతోనూ, పేగులతోనూ నిర్మితం అయి ఉంటుంది. దీనికి పైభాగం ముఖం. కిందిభాగం గుదం. కంఠం మొదలు ఆమాశయం దాకా ఇది అన్ననాడి అనిపించుకుంటుంది. అక్కడ ఆమాశయం ప్రారంభమవుతుంది. అది లావుగా వుంటుంది. ఆమాశయం తరవాతి భాగం ఆంత్రికం. అది గ్రహణికీ జఠరాగ్నికీ స్థానం. తరవాతి భాగం పక్వాశయం. అన్నం అక్కడ పక్వం అవుతుంది. తరవాతి భాగమే గుదం. అన్నకిట్టం మలం అయి ఇక్కడ్నించే బయటికి పోతుంది.

**అన్నప్రాశనం** – పిల్లలకు, ఆరోమాసాన – లేక – ఎనిమిదోమాసాన మొట్టమొదటిసారి భోజనం పెట్టడం.

**అన్నమండం** – ఇదే అష్టగుణమండం. ఇది ఆకలి పుట్టిస్తుంది. వస్తి శోధనం చేస్తుంది. ప్రాణప్రదం. రక్తవృద్ధికరమున్నూ. మరిన్నీ యిది జ్వరం తగ్గిస్తుంది. కఫమూ పిత్తమూకూడా తగ్గించేస్తుంది. వాతం హరిస్తుంది.

**అన్నలిప్స** – అన్నం తినాలన్న వాంఛ. ఆకలి.

**అన్నవహ** – తిన్న పదార్థాన్ని ఆమాశయం చేర్చే ధమనీయుగళం. దాని మూలమే ఆమాశయం.

**అన్నవాహిస్రోతస్సు** – కంఠనాళం.

**అన్యథాకామం** – అంటే నిషిద్ధ మైన కామేచ్ఛ. గుదద్వార గమనాదికం. ఇది మిక్కిలీ దూష్యం.

**అన్యలోహం** – కంచు.

**అన్వాశనం** – ఔషధాలు తయారుచేసే కర్మశాల.

**అన్వాసనం** – అనువాసనవస్తి.

**అన్వాహికం** – దినదినమూ వచ్చేది.

**అపక్వం** – ఉడకబెట్టనిది. కాచనిది. పచ్చిది.

**అపక్వమాంసం** – పచ్చిమాంసం.

**అపక్వక్షీరం** – పచ్చిపాలు.

**అపఘాత** – అస్వాభావికమరణం.

**అపచితం** – తగ్గిపోయినది.

**అపతర్పణం** – తృప్తి లేకపోవడం. కర్శనం.

**అపథ్యం** – అహితమైన వస్తువు.

**అపరా** – జరాయువు.

**అపరాహ్ణం** – దివస శేషభాగం.

**అపరేద్యువు** – మర్నాడు.

**అపవనం** – కృత్రిమమైన వనం.

**అపవరకం** – గర్భగృహం.

**అపసవ్యం** – కుడి.

**అపస్వరం** – సహజంకాని స్వరం.

**అపాటవం** – వ్యాధి.

**అపూపం** – పిండి, బెల్లం – వీటితో నేతిలో వండే భక్ష్యవిశేషం. అప్పాలు అని తెనుగుపేరు.

**అప్చరాలు** – అంటే నీటిలో సంచరించే పిట్టలు. ఇవి – హంస, బెగ్గురు పిట్ట, కలహంస, కొంగ, కన్నెలేడు, నీటికోడి, తెల్లకొక్కెర, వెన్నెలపులుగు, చక్రవాకం, నీటికాకి, క్రౌంచపక్షి – ఇత్యాదులు.

**అప్రకంప్యం** – స్థిరమైనది.

**అభావప్రతినిధి** – అంటే, ఔషధయోగంలోపడే వస్తువులలో ఏదయినా లభించకపోతే, దానికి బదులుగా వేసుకునే, అలాంటి రసవీర్యవిపాకాలే కలిగిన మరొకవస్తువు.

1. తేనెకు .–పాతబెల్లం.
2. పాలకు – పెసరకట్టు లేక చిరుసెనగలకట్టు.
3. చక్కెరకు – కలకండ (పటికబెల్లం).
4. శాలిధాన్యానికి – అరవైదినాల పంట ధాన్యం.
5. ద్రాక్షపండుకు – గుమ్ముడుపండు.
6. దానిమ్మపండుకు – చింతపండు.
7. సౌరాష్ట్రమృత్తికకు – పర్పటి – (సుగంధమృత్తిక) లేక – పటిక.
8. నందివర్ధనానికి – చెంగల్వకోష్ఠు లేక పిప్పలిమోడి.
9. లోహానికి – మాండూరం.
10. తెల్ల ఆవాలకు – ఆవాలు.
11. చవ్యమునకు – పిప్పలిమోడి.
12. గజపిప్పలికి – పిప్పలిమోడి.
13. ముంజతానికి – తాటిమొవ్వు.
14. కుంకుమపువ్వునకు – పసుపు.
15. ముత్యాలకు – ముత్యపుచిప్పలు.
16. వజ్రానికి – వైక్రాంతం.
17. ధనియాలకు – సదాపవిత్తులు.
18. నేలగుమ్ముడుకు – నేలతాడి.

19. బంగారానికి – స్వర్ణమాక్షికం లేక ఇనుము.
20. వెండికి – తారమాక్షికం లేక ఇనుము.
21. పుష్కరమూలానికి – చెంగల్వకోష్ఠు.
22. సైంధవలవణానికి – సాముద్రలవణం లేక బిడాలవణం.
23. పువ్వులకు – కాయలు.
24. జీడిగింజలకు – రక్తచందనం.
25. సన్నరాష్నకు – బదనిక.
26. జీలకర్రకు – ధనియాలు.
27. పచ్చకర్పూరానికి – తుంగముస్తలు లేక మావిపత్రి.
28. రసాంజనానికి – మామపసుపు కషాయం.
29. మేదకు – పెన్నేరు.
30. మహామేదకు – సుంగధి.
31. జీవకానికి – తిప్పతీగ.
32. బుషభకానికి – నేలగుమ్ముడు.
33. బుద్ధికి – బల.
34. వృద్ధికి – మహాబల.
35. కాకోళికి – } పిల్లితేగలు.
36. క్షీరకాకోళికి –
37. కస్తూరికి – జవ్వాజి లేక తక్కోలాలు లేక జాజిపువ్వులు లేక జాపత్రి లేక గంధకచోరాలు.
38. ములుమోదుగునకు – వేపపట్ట.
39. చాగగడ్డకు – మంజిష్ఠ లేక లింగదొండపట్ట.
40. కోలపొన్నకు – ముయ్యాకుపొన్న.
41. మాంసాలకు అన్నింటికీ – పావురం మాంసం. అన్నిటిలోనూ ఇది మిక్కిలీ గుణకరం కనక.
42. మాంసరసానికి– పెసరకట్టు.
43. . పాలకు – అన్ని జంతువుల పాలకూ – కొత్తగా ఈనిన ఆవు పాలు.
44. తిప్పసత్తుకు – తిప్పతీగ స్వరసం.
45. చిత్రమూలానికి – నేపాళపుక్షారం లేక ఉత్తరేణిక్షారం.
46. పెద్దదూలగొండికి – చిన్నదూలగొండి.
47. గ్రంధితగరానికి – చెంగల్వకోష్ఠు.
48. తేనెకొండెచెట్టుకు – మానకంద.
49. తెల్లనేలములకకు – ముల్లంగి.
50. పొగడపువ్వులకు – ఎర్రకలవ లేక నల్లకలవ.
51. నల్లకలవకు – తెల్లకలవ.
52. తామర పువ్వులకు – తామరవిత్తులు.
53. పొగడకు – తెల్లతుమ్మపట్ట.
54. జాపత్రికి – లవంగాలు.
55. జిల్లేడుపాలకు – జిల్లేడాకులరసం.
56. స్థౌణేయకానికి – చెంగల్వకోష్ఠు.
57. బావంచాలకు – తగిరిస గింజలు.
58. మామపసుపునకు – పసుపు.
59. తాళీసపత్రికి – నేలవులసిరిక.
60. గంటుభారంగికి – తాళీసపత్రి లేక ముల కవేరు.
61. సౌవర్చలవణానికి – కాచలవణం.
62. తక్కిన లవణాల కన్నిటికీ – సైంధవలవణం.
63. యష్టిమధుకానికి – ఆరెపువ్వు.
64. పుల్లప్రబ్బలికి – పులిచింతాకు.
65. పులిచింతాకుకు – నిమ్మరసం.
66. నఖంచిప్పలకు – ఏలకిపువ్వు.
67. కుంకుమకు – కుంకుమపువ్వు.
68. చందనానికి – పచ్చకర్పూరం లేక రక్త చందనం.
69. తుంగగడ్డలకు – అతివస లేక కరక్కాయ.
70. కరక్కాయకు – కర్కాటక శృంగి.
71. నాగకేసరాలకు – పద్మకేసరాలు.
72. జీడిగింజలకు – నదీభల్లాతకం గింజలు.
73. కుశకు – రెల్లు.
74. మత్స్యండికకు – కలకండ.
75. కలకండకు – చక్కెర.
76. వావిలికి – తులసి.
77. తులసికి – వావిలి.
78. నల్లగగ్గెరకు – తులసి.
79. తెల్లగలిజేరుకు – ఎర్రగలిజేరు.
80. సన్నరాష్నకు – కోలాంజనం.
81. స్వర్ణమాక్షికానికి– స్వర్ణగైరికం.
82. కాంతలోహానికి – తీక్ష్ణలోహం.
83. నవరత్నాలకు – ముత్యాలు.
84. రసభస్మానికి – రససిందూరం లేక ఇంగిలీకం.
85. ఆవుపాలకు – మేకపాలు.
86. ఆవునేతికి – మేకనెయ్యి.
87. పిల్లితేగలు, నేలగుమ్ముడు, నేలతాడి, జీల కర్ర, పసుపు, వాము, దేవదారు – వీటిలో రెండేసి రకాలున్నాయి. ఏ యోగంలో

నైనా రెండూ చెప్పినప్పుడు అందొకటి దొరకకపోతే రెండోదే రెండుమాట్లు వేసుకోవచ్చు.

అ వస్తువులు:

చిన్న పిల్లితేగలు – పెద్దపిల్లి తేగలు.
నేలగుమ్మడు – పాలగుమ్మడు.
చిన్ననేల తాడి – పెద్దనేల తాడి.
నల్లజీలకర్ర – తెల్లజీలకర్ర.
పసుపు – మానుపసుపు
చిన్నవాము – పెద్దవాము.
స్నిగ్ధదారు – కోష్ఠదారు (దేవదారుజాతి).
తెల్లవాకుడు – నల్లవాకుడు
కోలపొన్న – ముయ్యాకుపొన్న
పిన్నసదాప – పెద్దసదాప.
వట్టివేరు – కురువేరు.
అడవిపెసర – అడవిమినుము.
తక్కోలలు – రెండురకాలు.
రక్తచందనము – నిర్గంధం, సగంధం.

**అబ్జభోగం** – తామరదుంప.

**అభిఘారం** – నెయ్యి.

**అభిచారం** – మంత్రాలతో కూడిన మారణకర్మ.

**అభిధ్య** – పరుల ఉత్తమగుణాలు చూసి సహించలేకపోవడం.

**అభిలాష** – రమించే ఇచ్ఛ.

**అభిశాపం** – బ్రాహ్మలు, గురువులు, వృద్ధులు, సిద్ధులు మొదలైనవారు కోపంవచ్చినప్పుడు విధించే ఘోరశిక్ష. దీనివల్ల జ్వరమున్నూ వస్తుంది.

**అభిషంగం** – భూతాలూ, పిశాచాలూ, విషాలూ – వీటివల్ల కలిగే పీడ, కామ శోక భయ క్రోధాల వల్ల కలిగే జ్వరమూన్నూ.

**అభిషవం** – కాంజికాలలో ఇదొకటి.

**అభిషుతం** – ఇదొక కాంజికం.

**అభిషువిక్రాంతం** – మాధవీసుర.

**అభిషేకం/అభిషేచనం** – స్నానం.

**అభిష్యంది** – జిడ్డూ, గురుత్వమూ కల పెరుగు మొదలైనవి ఎక్కువగా పుచ్చుకుంటే రసవహ శిరలు రుద్ధాలయి శరీరం బరువెక్కుతుంది. ఇలాంటి గుణం కలిగించే పదార్థం అభిష్యంది. ఇందులో కఫం ప్రకోపించి వుంటుంది.

**అభిష్యంది** – శ్లేష్మకారి.

**అభిసరుడు** – రోగికి పరిచర్య చేసేవాడు.

**అభీకుడు** – కాముకుడు.

**అభుక్తం** – ఉపవాసం.

**అభుగ్నుడు** – రోగం లేనివాడు.

**అభేద్యం** – రత్నం.

**అభేషజం** – వైపరీత్యం కలిగించే ఔషధం. ఇది బాధనం, సామబాధనం అని రెండు విధాలు.

**అభోజనం** – ఉపవాసం.

ఉపవసించేవారు, ముందు తమ శరీరస్థితిగతులు బాగా పరిశీలించుకోవాలి. ఏమంటే!, అజీర్తిగా వున్నప్పుడు భోజనం చేసేవారికీ, తిన్నది బాగా జీర్ణం అయిన తరువాత కూడా భోజనం చెయ్యని వారికీ, రాత్రి భోజనం మానుకునేవారికీ ధాతువులు క్షీణిస్తాయి. దీనివల్ల అనేక విధాలైన వ్యాధులు సంభవిస్తాయి.

**అభ్యంగం** – నూనె మొదలైన చమురులు శరీరానికి మర్దనా చేసుకోడం – దీనిపేరే తలంటు.

నూనె మొదలైన చమురులు మర్దనా చేసుకుంటే అది శరీరం అంతటా సంగతం అయి స్రోతస్సులవల్ల బాహువులకు తర్పణం కలిగిస్తుంది. అదీ అభ్యంగం అంటే. మొదట్లో నీళ్ళు పోస్తే చెట్టు చిగిరించేటట్లు, నూనెమర్దనా చేసుకున్నవారికి ధాతువులు వృద్ధిపొందుతాయి. శిరాముఖాలవల్లా, రోమకూపాలవల్లా, ధమనుల వల్లా, నూనె శరీరం అంతటా ఇనికి తర్పణం కలిగిస్తుంది. ఇలాగ తల అంటుకోడంవల్ల ముసలితనం రాకుండా పోతుంది. శ్రమ హరించిపోతుంది. చూపు బాగుపడుతుంది. పుష్టీ, ఆయుర్వృద్ధి కలుగుతాయి. కమ్మని నిద్ర కూడా పడుతుంది. చర్మం మృదువై దృఢపడుతుంది.

తలంటు అంటే నూనె శిరస్సునా శరీరం అంతటా మర్దనా చేసుకోడం మాత్రమే కాదు – నూనె చెవుల్లోనూ, శిరస్సునా పాదాలకూ బాగా ఇనకాలి. దీనివల్ల వాతం హరిస్తుంది. ధాతుసామ్యం ఏర్పడుతుంది. శిరోజాలకు పుష్టి కలుగుతుంది. జుట్టు నెరియదు. శిరస్సున దుమ్ముపడడంవల్ల కలిగే దోషాలు పోతాయి. తలంటుకు నువ్వులనూనె మిక్కిలి శ్రేష్ఠం.

**అభ్యంజనం** – తలంటు.

**అభ్యంతుడు** – రోగి.

**అభ్యమితుడు** – రోగి.

**అభ్యయవకర్షణం** – శల్యాదులు తీసెయ్యడం.

**అభ్యవహరణం/అభ్యవహారం** – భోజనం.

**అమసుడు** – రోగి.

**అమానస్యం** – పీడ.

**అమృతబంధువు/అమృత సహోదరం** – అశ్వం.

**అమృతాష్టకం** – తిప్పతీగ, కొడిశపాలవిత్తులు. వేపపట్ట, చేదుపొట్ల, కటుక రోహిణి, సొంటి, చందనం, తుంగముస్తలు – ఇవి.

**అమృతి** – ఒకవిధమైన జలపాత్ర.

**అమ్లకాంజికం** – కాంజికాలలో ఇదొకటి. తరవాణి అని చెప్పవచ్చును.

**అమ్లపంచకం** – రేగు, దానిమ్మ, చింతపండు, చుక్కకూర, ఆమ్లవేతసం – ఇదొకవిధం.

నిమ్మ, నారింజ, ఆమ్లవేతసం, చింతపండు, మాదీఫలం – అదొక విధం.

**అమ్లవర్గం** – పులిచింత, గజనిమ్మ, అమ్లవేతసం, నిమ్మ, మాదీఫలం, నారింజ, దానిమ్మ, వెలగ, పౌర, ఉసిరి, తుముకి, రేగు, చింత – ఇదొక విధం.

అమ్లవేతసం, నిమ్మ, మాదీఫలం, సెనగపులుసు, నారింజ, చింత, పులిచింత, దానిమ్మ, ఉసిరి – ఇదొక విధం.

**అమ్లస్కంధం** – ఉసిరి, చింత, మాదీఫలం, ఆమ్లవేతసం, దానిమ్మ, వెండి, మజ్జిగ, శుక్తి, ఈడెపండు, పెరుగు, మామిడి, అంబాళపుకాయ, వెలగకాయ, వాకకాయ – ఇవి.

**అమ్లికాపానం** – ఇదొక విధమైన పానకం, చింతపండు నీళ్ళలో వేసి బాగా పిసికి, అందులో చక్కెర, మిరియాలపొడి, పచ్చకర్పూరం చేర్చి వడబోసి పుచ్చుకునేది.

**అయనం** – ఉత్తరాయనం, దక్షిణాయనం అని సంవత్సరానికి రెండు అయనాలు – ఒక్కొక్కదాని పరిమితి ఆరేసి మాసాలు. వీటిలో దక్షిణాయనం వర్షశరద్ధేమంత ఋతువులలో వ్యాపించి వుంటుంది. ఈ కాలంలో సూర్యుడు దక్షిణదిక్కుగా ప్రయాణం చేస్తాడు. ఈ సమయాన అమ్లలవణమధుర రసాలు బలవత్తరాలవుతాయి. ప్రాణి కోటికి బలం వృద్ధి అవుతుంది. ఉత్తరాయనం శిశిరవసంత గ్రీష్మర్తులు వ్యాపించి వుంటుంది. ఈ కాలాన సూర్యుడు ఉత్తర దిక్కుగా ప్రయాణం చేస్తాడు. ఈ కాలంలో తిక్తకషాయ కటురసాలు బలవత్తరాలవుతాయి. సర్వప్రాణులకూ బలం క్షీణిస్తుంది.

**అయోగం** – రోగకారణాలు మూడింట ఇదొకటి. చూడవలసినది చూడకపోవడం, వినవలసినది వినకపోవడం, ఆఘ్రాణించవలసినది ఆఘ్రాణించకపోవడం, తినవలసినది తినకపోవడం – ఇలాగ ఇంద్రియాలకూ ఇంద్రియార్థాలకూ సంబంధం లేకపోవడం అయోగం. అతియోగం ఎంత అపాయకరమో అయోగమూ అంత అపాయకరమే.

**అయోవస్తి** – వస్తికర్మలలో ఇదొకటి.

**అరతి** – వాంఛ లేకపోవడం. అదేపనిగా చింతిస్తూ వుంటే కలుగుతుంది.

**అరణ్యం** – ఉద్యానం, మహావనం, ఉపవనం, ప్రమదావనం – అని యిది నాలుగు విధాలు. ఉద్యానం కాముకులు క్రీడించేది. మహావనం క్రూరమృగాలతో నిండి వుంటుంది. ఉపవనం అంటే పౌరులు విహరించడానికి పట్నంలో అక్కడక్కడ దొరతనంవారు నిర్మించేది. ప్రమదావనం అంటే రాణులూ వారి చెలికత్తెలూ విహరించడానికి రాజగృహాలకు చేరివుంటుంది.

**అరిష్టం** – ముఖ్యద్రవ్యాలు పరిమిత జలంలో కాచి కషాయంచేసి అందులో ఆరెపువ్వు, బెల్లం, ద్రాక్షపండు, ప్రక్షేప్యం వేసి తయారు చేసే ద్రవరూపమైన ఔషధం. ఇది కాలం గడచినకొద్దీ గుణకారి అవుతుంది. ఎన్నివేల సంవత్సరాలకైనా ఇగిరిపోతే యిగిరిపోవాలి గాని చెడిపోదు. ఎంత పాతదయితే అంతమంచిది.

**అరిష్టత్రయం** – గుర్రాలకు వచ్చే మూడు రకాల వ్యాధులు. స్వస్థారిష్టం. వేధారిష్టం, కీటారిష్టం అని వాటిపేరు. ఇందులో మొదటిదయిన స్వస్థారిష్టం, మళ్ళీ – భోజనారిష్టం, ఛాయాద్యరిష్టం, దర్శనేంద్రియారిష్టం, శ్రవణేంద్రియారిష్టం, రసనేంద్రియారిష్టం అని అయిదు విధాలు. వీటిలో భోజనారిష్టంలో రోగం లేకపోయినా తిండిమీద ఇచ్ఛలేకపోవడం, శరీరం రంగు మారడం, మనస్సు చెడడం – ఇవి సంభవిస్తాయి. ఛాయాద్యరిష్టంలో, నీడలో వుండలేకపోడం, వంకర నడక మొదలైనవి సంభవిస్తాయి. దర్శనేంద్రియారిష్టంలో ముక్కు, మేఢ్రం, గుదం, కళ్ళు – వీటినుంచి హఠాత్తుగా రక్తస్రావం కలుగుతూ వుంటుంది. రసనేంద్రియారిష్టంలో శ్రవణశక్తి

తగ్గడం, నాలుక మొద్దుబారడం, నాలుక స్తంభించడం – ఇలాంటివి సంభవిస్తాయి.

వేధారిష్టం, శరదృతువులో సూర్యతాపంవల్లా, వర్షకాలంలో సరి అయిన తిండీ లేకా వస్తుంది. అప్పుడు జ్వరం వస్తుంది. అధోముఖమై వుండడం, దగ్గు, వగర్పు, శరీరం ఓగుసుకుపోవడం – ఇవి కలుగుతాయి. కీటారిష్టం అంటే, కడుపులో నులిపురుగులూ, పాములూ పుట్టుతాయి. దాంతో అనేక బాధలు సంభవిస్తాయి. శరీరం శుష్కించిపోతుంది.

**అరిష్టలక్షణం** – అంటే మృత్యులక్షణం. తప్పకుండా చనిపోయే రోగి కిది కలుగుతుంది.

**అరుంధతి** – జిహ్వాగ్రం.

**అరోకదంతం** – నల్లని దంతాలు.

**అర్కాదిగణం** – జిల్లేడు, తెల్లజిల్లేడు, కలుగ్రానుగు, క్రానుగు, నగాదంతి, పార, గంటుభారంగి, లవంగం, గొడ్డు ఆగాకర, పొట్టికాకరం, దూలగొండి, పెద్దదూలగొండి, సైంధవలవణం, గారచెక్క – ఇవి.

**అర్ధం** – హృదయం.

**అర్ధద్వారకం** – అస్త్రవిశేషం. ఛేదనభేదనాలకు ఉపయుక్తం.

**అర్ధపలం** – రెండు కర్షాలు.

**అర్ధమాత్రకం** – నిరూహణాధికారంలో చెప్పబడ్డ ఒక వస్తికర్మ.

**అర్ధమాసూరి** – అస్త్రధారావిశేషం – అంటే కత్తికి పెట్టే ఒకరకమైన పదును. లేఖనకర్మలో ఉపయోగించేది.

**అర్ధశక్తి** – ఇది వ్యాయామపరిమితి తెలిపే ఒక చిహ్నం. అర్ధశక్తి యేర్పడేటంతవరకే వ్యాయామం చెయ్యాలి. మనుష్యునకు హృదయంలో వుండే ప్రాణాలు కొంతసేపు వ్యాయామం చేసేటప్పటికే కంఠగతాలు అవుతాయి. అంటే సగంబలం తగ్గిపోయి యిక సగంబలమే నిలిచివుందన్నమాట. అర్ధశక్తి అంటే యిది. అది దాటి వ్యాయామం చేస్తే అపాయం సంభవిస్తుంది. ఇది ఆంతరిక లక్షణం. వ్యాయామం ప్రారంభించిన కొంత సేపటికి ఆ మనిషికి నొసట, ముక్కుమీద, శరీర సంధులలోను, చంకలలోను చెమట పడుతుంది. అర్ధశక్తికి అది బాహ్యలక్షణం, వెంటనే వ్యాయామం విరమించాలనడానికి అది గుర్తు. ఎంత బలవంతుడైనా యీ అర్ధశక్తి గుర్తించుకుని వ్యాయామం చేస్తేనే శ్రేయస్సు కలుగుతుంది.

**అర్ధశరావం** – మానపరిభాష. రెండు ప్రస్థతులు. అంటే సుమారు రెండు తులాల యెత్తు.

**అర్థాపత్తి** – స్పష్టంగా చెప్పకపోయినా, అర్థవశాత్తుగా స్ఫురించేది.

**అర్ధాశనం** – సగం సగం భోజనం.

**అర్ధాంశోనజలం** – సగం మిగిలేటట్టు కాచిన జలం.

**అర్ధోదకక్షీరం** – సగం నీళ్ళు కలిపి కాచిన పాలు. ఇది పచ్చిపాలకంటే లఘువు.

**అర్మణం** – మానపరిభాష. ఒక ద్రోణం.

**అర్శోఘ్నవర్గం** – అంటే మూలశంకవ్యాధి హరించే మూలికల సమూహం. అవి – కోడిశచెక్క, మారేటుపట్ట, చిత్రమూలం, సొంటి, అతివస, కరక్కాయ, దూలగొండి, మామపసుపు, వస, చవ్యం.

**అర్శోయంత్రం** – మూలశంక వ్యాధి పరీక్షించడాని కుపయోగపడే యంత్రం. ఇది గోస్తనాకారంగా వుంటుంది.

**అలంజరం** – పెద్ద మృణ్మయపాత్ర. బాన అని చెప్పవచ్చు.

**అలంబోర్ధ్వస్తని** – వాలిపోని ఊర్ధ్వముఖాలైన స్తనాలు గలది.

**అలాంతం** – బొగ్గు.

**అలాబువిధి** – ఆనపకాయ (సొరకాయ)తో రక్తమోక్షణం చేసే విధానం.

**అలాబూయంత్రం** – ఒకానొక యంత్రం.

**అలికమత్స్యం** – మానెలో వేయించిన చేప మాంసం.

**అల్పాయువు** – మేక.

**అవగధం** – ప్రాతస్స్నానం.

**అవగాహస్వేదం** – స్వేదకర్మలలో ఇదొకవిధం. వాతహర ద్రవ్యాలతో కషాయం కాచి, అందులో వాతహర మాంసాల రసం, తైలం, ఘృతం, పాలు తగినంత కలిపి పెద్దతొట్టెనిండా పోసి, సుఖోష్ణంగా వున్నప్పుడు రోగిని అందు లోదింపి స్నానం చేయిస్తే చక్కగా చెమట పడుతుంది. ఇది అవగాహ స్వేదం. ఇది సర్వాంగవాతం, మూలశంకలు, మూత్రకృచ్ఛం మొదలైన వ్యాధులలో చాలా పనిచేస్తుంది.

**అవగుంఠనం** – మేలిముసుగు.

**అవతానం** – వెన్నెల.

**అవదళనం** – మర్దనక్రియ.

**అవపీడం** – నస్యకర్మలలో ఇదొకవిధం.

**అవపీడకం** – ఘృతపానవిశేషం. ప్రాగ్భక్తం జీర్ణాంతికం అని యిది రెండు విధాలు.

**అవపీడననస్యం** – సొంటి మొదలైన తీక్ష్ణ ద్రవ్యాలతో కల్కమూ కషాయమూ చేసి వాటితో చేసే నస్యకర్మ యిది. శిరోవిరోచన నస్యం అనిన్నీ దీనికి పేరు.

**అవరోహం** – మర్రిచెట్టు మొదలైన వృక్షాల ఊడలు.

**అవలుంచనం** – ముండనం.

**అవలేపనం** – పూత, మెయిపూత.

**అవలేహనం** – నాకడం – చప్పరించడం.

**అవస్కందం** – అవగాహస్నానం.

**అవస్కయని** – చాలా దినాలకు ఈనిన ఆవు.

**అవిపటం** – ఉన్నివస్త్రం

**అవిశ్వాస** – చిరకాలాని కీనిన ఆవు.

**అవిసంవాది** – తికమకలు లేనిది. సత్యం

**అవ్యక్తం** – మూలప్రకృతి.

**అశిశ్విక** – సంతానం లేనిది. బిడ్డలు పుట్టనిది. గొడ్రాలు.

**అశ్మఘనస్వేదం** – స్వేదకర్మలలో ఇదొక విధం. మనిషి ప్రమాణం గల బండరాతిమీద వాతహరాలైన చెట్ల కట్టెలు పేర్చి, అవి పూర్తిగా కాలి బొగ్గులు అయిపోయేదాకా మండించి, ఆ నిప్పంతా దూరంగా తొలగించివేసి, దానిమీద వేడినీళ్ళు చల్లేది. ఒక్క క్షణం అయినాక దానిమీద పట్టుబట్ట అయినా, కంబళి అయినా, పరిచేది. రోగిని, శరీరం అంతా వాతహరతైలం పట్టించి దానిమీద పడుకోబెట్టి మీద పట్టుగుడ్డ, నూలుబట్ట, జింకచర్మం, కంబళి – వీటిలో ఒకటి కప్పాలి. కొంతసేపటికి మిక్కిలీ చెమటపట్టి, దోషాలు అన్నీ హరించిపోతాయి. ఇది అశ్మఘనస్వేదం.

**అశ్మర్యాహరణయంత్రం** – మూత్రాశ్మరీవ్యాధిలో, వస్తిలో వున్న రాళ్ళు తీసివెయ్యడానికి ఉపయోగించే యంత్రం.

**అశ్వగోష్ఠం** – గుర్రాలశాల.

**అశ్వతరం** – కంచరగాడిద

**అశ్వపుటభావన** – ముప్పయి రెండు పలాల ఔషధద్రవ్యానికిచేసే భావన.

**అశ్వవైద్యకం** – గుర్రాలకు సంబంధించిన చికిత్సాప్రక్రియ. దీనికి సంబంధించిన గ్రంథాలు శాలిహోత్రుడు, నకులుడు, భోజుడు, జయదత్తుడు మొదలైనవారు రచించివున్నారు.

**అష్టకర్మ** – పాదరసానికి చెయ్యవలసిన పద్దెనిమిది సంస్కారాలలోనూ స్వేదనం మొదలు దీపనం దాకా వుండే ఎనిమిది సంస్కారాలకు అష్టకర్మ అనిపేరు. స్వేదనం, మర్దనం, మూర్ఛనం, ఉత్థాపనం, పాతనం, బోధనం, నియామనం, దీపనం – అని వరసగా ఆ యెనిమిది సంస్కారాలకూ పేళ్ళు.

**అష్టగుణమండం** – ఎనిమిది భాగాలు బియ్యం, నాలుగు భాగాలు పెసలు, ఇవి కలిపి, వేయించి, పద్నాలుగు రెట్ల నీళ్ళలో పోసి కాచి, ఇంగువ, సైంధవలవణం, ధనియాలు, సొంటి, మిరియాలు పిప్పళ్ళు – వీటి చూర్ణం కలిపి వడబోసి పుచ్చుకునే యవాగువు. ఇది ఆకలిని వృద్ధిచేస్తుంది. బలకరం, వస్తిశోధనం.

**అష్టధాతువు** – బంగారం, వెండి, రాగి, నాగం, ఇత్తడి, వంగం, కాంతం, మాండూరం, ఖడ్గలోహం – ఈ లోహాలు.

**అష్టధాతుస్థానాలు** – రోగనిర్ణయం చెయ్యడానికి వీలయిన నాడులు మనుష్యశరీరంలో ఎనిమిది వున్నాయి. అవి రెండు చేతులలోనూ రెండు. రెండు పాదాలలోనూ రెండు. కంఠాని కిరుపక్కలా రెండు. ముక్కుకి ఇరుదెసలా రెండు – మొత్తం ఎనిమిది.

**అష్టపలం** – మానపరిభాష. ఒక శరావం. అరవైనాలుగు తులాలు.

**అష్టభావం** – మనిషికి కలిగే వికారాలు. ఇవి స్తంభం, స్వేదం, రోమాంచం, స్వరభంగం, వైస్వర్యం, కంపం, వైవర్ణ్యం, అశ్రుపాతం – అని యెనిమిది.

**అష్టమంగళం** – గుర్రాలకు ఉండవలసిన శుభలక్షణాలలో ఇదొకటి. తోక, వక్షస్థలం, మొగం, డెక్కలు, జూలు – ఇవి తెల్లగా వుండడమే ఆ లక్షణం.

**అష్టమంగళం** – మతాంతరం – బ్రాహ్మణులు, ఆవు, అగ్ని, బంగారం, నెయ్యి, సూర్యుడు, గుర్రం. రాజు – ఈ సముదాయమున్ను.

**అష్టమధుజాతి** – తేనె ఎనిమిది విధాలు. వాటి వివరం. 1. మాక్షికం, 2. భ్రామరం, 3.

క్షౌద్రం, 4. పౌత్తికం, 5. ఛాత్రకం, 6. అర్ఘ్యం, 7. ఔద్దాలకం, 8. దాలకం – అవి.

**అష్టమానం** – మాన పరిభాష. రెండు ప్రసృతులు. లేక అర్ధశరావం – నాలుగు పలాలు.

**అష్టమిక** – మాన పరిభాష. అర్థ ఫలం. అంటే నాలుగు తులాలు.

**అష్టమూత్రం** – ఆవు, మేక, కంబళి మేక, బర్రె, గుర్రం, ఏనుగు, ఒంటె, గాడిద – వీటి మూత్రాలు.

**అష్టమూలం** – శరీరానికి మూలాలు ఎనిమిది. అవి – చర్మం, మాంసం, శిరలు, స్నాయువులు, ఎముకలు, సంధులు, కోష్ఠం, మర్మస్థానాలు.

**అష్టమౌక్తికస్థానం** – ముత్యాలు పుట్టే స్థలాలు ఎనిమిది. అవి – శంఖం, ఏనుగు, సర్పం, చేప, మేఘం, వెదురు, అడవిపంది, ముత్యపుచిప్ప.

**అష్టలోహకం** – ఒక పక్షాన, లోహాలు ఎనిమిది. అవి – బంగారం, వెండి, రాగి, తగరం, నాగం, కాంతం, మాండూరం, లోహం –

**అష్టవర్గం** – ఎనిమిది మూలికలు. ఆయుర్వేదంలో వీటికి చాలా గొప్ప స్థానం వుంది. అవి – మేద, మహామేద, జీవకం, ఋషభకం. ఋద్ధి, వృద్ధి, కాకోళి, క్షీరకాకోళి.

**అష్టవర్గప్రతినిధి** – అష్టవర్గంగా నిర్దేశించిన మూలికలు ఎనిమిదీ చాలా గొప్పవి. అయితే, చాలా దినాలుగా అవి యివి అని యెవరూ నిర్ధారణగా చూపించలేకుండా వున్నారు. అందుచేత, వాటికి అభావ ప్రతినిధిమూలికలు వాడుకోడమే ఆచారంగా ఏర్పడింది. రసవీర్య విపాకాల సమ సరించి యీ ప్రతినిధిమూలికలు మూలాలకు అనుగుణమైనవే. ఎంతెంత మహావైద్యులూ కూడా ఇవే వాడుతున్నారు. అవి – మేదకు మహామేదకు పిల్లితేగలు, జీవకానికి ఋషభకానికి నేలగుమ్మడు. కాకోళీ క్షీరకాకోళి – వీటికి పెన్నేరు. ఋద్ధి వృద్ధి – వీటికి వారాహికంద (నేల గుమ్మడులో ఒకరకం).

*మతాంతరం: మేదకు పెన్నేరు. మహామేదకు సుగంధి. జీవకానికి తిప్పతీగ.*

*ఋషభకానికి తవాక్షీరి. ఋద్ధికి బల. వృద్ధికి మహాబల.*

**అష్టవిధ నిందితపురుషులు** – పురుషులలో ఎనిమిదివిధాలవారు నిందితులు. అతిదీర్ఘుడు (మిక్కిలీ పొడుగైనవాడు), అతిహ్రస్వుడు (మిక్కిలి పొట్టివాడు), అతిలోముడు (శరీరం అంతటా మిక్కిలిగా రోమాలుండేవాడు), అలోముడు (శరీరంమీద రోమాలే లేనివాడు), అతి కృష్ణుడు (కారునలుపుగా వున్నవాడు), అతిగౌరుడు (మిక్కిలీ తెల్లని వాడు), అతి స్థూలుడు (మిక్కిలీ లావుగా, గాదెబుట్టలా వున్నవాడు), అతి కృశుడు (మిక్కిలీ సన్నంగా – కిక్కిసకర్రలా వున్నవాడు)

ఇది భారతదేశానికి సంబంధించిన నిర్ణయం. జపానీయులందరూ పొట్టిగా వుంటారు. ఈ సూత్రం అలాంటివారికి అన్వయించదు.

**అష్టవిధవీర్యం** – ద్రవ్యాలకుండే వీర్యం – మృదు, తీక్ష్ణ, లఘు, గురు, స్నిగ్ధ, రూక్ష, ఉష్ణ, శీతల – అని యెనిమిది విధాలని కొందరు ఆచార్యుల మతం.

**అష్టవిధాన్నం** – అన్నం ఎనిమిది విధాలు – చర్వ్యం, చోష్యం, లేహ్యం, పేయం, ఖాద్యం, భోజ్యం, భక్ష్యం, నిష్పేయం – అవి.

**అష్టవిధోదకాలు** – నీరు ఎనిమిది విధాలు – అవి కౌపం, సారసం, తటాకం, చౌండ్యం, ప్రాస్రవణం, ఔద్భిదం, వాప్యం, నాదేయం – అవి.

**అష్టాంగం** – ఆయుర్వేదానికి అంగాలు ఎనిమిది. అవి శల్యతంత్రం, శాలాక్యతంత్రం, కాయచికిత్స, భూతవైద్యం, కౌమార భృత్యం, అగదతంత్రం, రసాయనం, వాజీకరణం – అవి.

*మతాంతరం: ద్రవ్యాభిధానం, గదనిశ్చయం, శల్యతంత్రం, కాయచికిత్స, భూత నిగ్రహం, విషనిగ్రహం, రసాయనం, బాలచికిత్స – అని.*

**అష్టాంగవైద్యకం** – శాలాక్య, కాయ, భూత, అగద, బాల, విష, వాజీకర, రసాయన చికిత్సలు.

**అష్టాదశధాన్యం** – ధాన్యం పద్దెనిమిది విధాలు. అవి – బఠాణీలు, గోధుమలు, కందులు, యవలు, జొన్నలు, శాలిధాన్యం, సెనగలు, చిరిసెనగలు, అవిసెగింజలు, పెసలు, నువ్వులు, ఉలవలు, చామలు, మినుములు, అలచందలు, వర్తు అధాన్యం, పచ్చపెసలు, ప్రేంకణాలు, ఇరణీధాన్యం.

**అష్టాదశమూలం** – అంటే పద్దెనిమిది విధాల వేళ్ళు. అవి – మారేడు, నెల్లి, దుండిగం,

పెన్నమ్ముదు, పార, గరిజేరు, ముత్తవపులగం, మాషపర్ణి, జీవకం, ఆముదపు చెట్టు, ఋష భకం, జీవంతి, పిల్లితేగలు, కాకి వెదురు, చెరుకు, దర్భ, రెల్లు, శాలిధాన్యం – వీటివేళ్ళు.

**అష్టస్థానాలు** – ఆయుర్వేదశాస్త్రం ఎనిమిది స్థానాలు గలది. అవి – సూత్రస్థానం, నిదానస్థానం, విమానస్థానం, శారీరస్థానం, ఇంద్రియస్థానం, చికిత్సితస్థానం, కల్పస్థానం, సిద్ధిస్థానం.

**అష్టౌషధి** – ఎనిమిది ఔషధులు. అవి – బ్రహ్మసువర్చల, ఆదిత్యపర్ణి, అశ్వబల, కాష్ఠగోధ, సోమ, పద్మ, అజశృంగి, నీలి – అవి. ఈ విషయమై చరక చికిత్సాస్థానంలో ఒకటవ అధ్యాయం చూసుకునేది.

**అసనాదిగణం** – కొన్ని చెట్ల పట్టలవర్గం. అవి – వేగిసపట్ట, తివిశపట్ట, భుజపత్రిపట్ట, మద్దిపట్ట, వెమలదుగుచెట్టుపట్ట, చంద్రచావ, తెల్లచంద్రచావ, దిరిసెనపట్ట, విరుగుడుచెట్టు పట్ట, మేషశృంగి, తెల్లచందనం, రక్తచందనం, మామపసుపు, తాళీసపట్ట, మోదుగుపట్ట, అగరుచెక్క, ఓకుపట్ట, ఏపిపట్ట, పచ్చిపోక, నారింజపట్ట, కొడిశపట్ట, సర్జవృక్షంపట్ట, అశ్వ కర్ణిపట్ట – ఈ గణం – శ్విత్రం, కుష్ఠు, పాండువు మొదలైన రోగాలు పోగొడుతుంది.

**అసాత్మ్యం** – అసౌఖ్యకరం (భరించనిది).

**అసారదధి** – వెన్న తీసివేసిన పెరుగు.

**అసిక్నిక** – అంతఃపురంలో సంచరించే పరిచా రకురాలు. విచ్చుకత్తులు ధరించి వుండేది.

**అస్థులు** – అంటే ఎముకలు. ఇవి చాలా గట్టిగా వుంటాయి. శరీరానికివే ఆధారం.

**అస్మంతకం** – పొయ్యి.

**అహంకారం** – క్షేత్రజ్ఞపురుషుని చైతన్యం.

**అహంకారం** – ఇది మహత్తువల్ల పుట్టినది. దానిలాగే సత్వరజస్తమో గుణాత్మకం. ఇది వైకారికం, తైజసం, భూతాది – అని మూడు విధాలు.

**అహితద్రవ్యం** – సహజంగానే కొన్ని వస్తువులు మంచివికావు. అవి ఆరోగ్యం పాడుచేస్తాయి. వాటిలో – శింబీధాన్యాలలో మినుములు పళ్ళలో లకుచఫలం, కూరలలో ఆవకూర, మాంసాలలో గోమాంసం, వసలలో మహిషవస, పాలలో మేకపాలు, మానెలలో కుసుమ మానె, చెరుకు సంబంధమైన వాటిలో ఫాణితమున్ను.

**అహితపదార్థం** – మనిషికి అపాయం కలిగించేవి రెండు. ఒకటి ప్రభాత కాలంలో నిద్రపోవడం. రెండు వృద్ధస్త్రీతో సంభోగం చెయ్యడం.

**అక్షగణం** – చెవులు, కళ్ళు మొదలయిన ఇంద్రియాల గణం.

**అక్షారలవణం** – ఆవుపాలు, ఆవునెయ్యి, ధనియాలు, పెసలు, నువ్వులు, యవలు, సాముద్రలవణం, సైంధవలవణం – వీటికి అక్షారలవణం అని పేరు.

**అక్షిపంచకం** – కన్ను, చెవి ముక్కు, చర్మం, నాలుక.

**అక్షివిఘూర్ణితం** – అపాంగదృష్టి.

## ఆ

**ఆంతరరోగాలు** – కోష్ఠం ఆశ్రయించి పుట్టే ఛర్ది, అతిసారం, శ్వాసకాసలు, ఉదరాలు, జ్వరం, శోఫ మూలశంకలు, గుల్మం, విసర్పం, విద్రధి – ఈ వ్యాధులు.

**ఆంతరిక్షజలం** – ఆకాశజలం. ఇది ధారం, కారం, తౌషారం, హైమం అని నాలుగు విధాలు. వావనీరు ధారం. వడగళ్ళనీరు కారం. మంచునీరు తౌషారం. పొద్దున్న పడే మంచునీరు హైమం. ధారం రెండు విధాలు – సాముద్రం, గాంగం అని. స్వాతి విశాఖలలో కురిసే వావనీరు గాంగం. చిత్రలో కురిసేదిన్నీ గాంగమే. మృగశీర్ష, ఆరుద్రలలో కురిసేది సాముద్రం. గాంగం మంచిది. సాముద్రం చెడ్డది.

**ఆంధసికుదు** – వంటవాడు.

**ఆకల్పకం** – రోగం.

**ఆకషం** – గీటురాయి.

**ఆకాశజలం** – అంతరిక్షజలం, వర్షపునీరు.

**ఆకాశాత్మక ద్రవ్యాలు** – మృదు, లఘు, సూక్ష్మ, శ్లక్ష్ణ శబ్దగుణాలు అధికంగా గలవి.

**ఆక్రోడం** – ఊరిబైట వుండే ఉద్యానవనం.

**ఆగారధూమం** – కరిధూపం.

**ఆగ్నేయగిరి** – వింధ్యపర్వతం ఆగ్నేయగిరి. దాని మీద పుట్టే ఓషధులు అగ్ని గుణభూయిష్ఠాలయి వుంటాయి.

**ఆగ్నేయద్రవ్యాలు** – ఉష్ణ, తీక్ష్ణ సూక్ష్మ, లఘు, రూక్ష విశద రూపగుణాలు అధికంగా గలవి.

**ఆచమనకం** – నిష్ఠీవనపాత్ర, ఉమ్ములు వేసే తొట్టి.

**ఆచారం** – సదాచారం, సత్పురుషులతో మైత్రిగా వుండడం, సజ్జనులతో స్నేహం చెయ్యడం, సాధుజనులనే కలుసుకుంటూ వుండడం – ఇత్యాది.

**ఆచితం** – మానపరిభాష – పదిభారాల పరిమితం.

**ఆజానేయం** – కులీనాశ్వం.

**ఆఢకం** – మానపరిభాష. ఎనిమిది శరావాల పరిమితం.

**ఆతపశుష్కం** – ఎండలో ఎండినది.

**ఆతురుడు** – రోగి.

**ఆత్మగుణాలు** – పరమాత్మకు లింగాలు కావడంవల్ల ఇచ్ఛ, ద్వేషం, సుఖం, దుఃఖం, ప్రయత్నం, బుద్ధి, చేతనం, ధృతి, స్మృతి, అహంకారం – ఈ పదీ ఆత్మగుణాలు.

**ఆత్మగుణాలు** – శిశువులకు సంక్రమించే గుణాలలో కొన్ని ఆత్మీయాలు. అవి – ఇంద్రియాలు, జ్ఞానం, విజ్ఞానం, ఆయువు, సుఖ దుఃఖాలు – ఇత్యాది.

**ఆత్మగ్రాహి** – కుక్షింభరుడు.

**ఆత్మనీనుడు** – కొడుకు.

**ఆత్మవిజ్ఞానం** – యోగాభ్యాసం మొదలైన సాధనాలతో పరమాత్మను తెలుసుకోడం.

**ఆత్రేయం** – శరీరంలో వుండే రసధాతువు.

**ఆదానకాలం** – అంటే ఉత్తరాయణం. ఈ కాలంలో సూర్యుడు తన తీక్ష్ణత వల్ల ప్రాణుల బలం ఆకర్షించుకుంటాడు. అంచేతనే దీనికి ఆదనకాలం అని పేరు.

**ఆదిబల ప్రవృత్తం** – తల్లిదండ్రులవల్ల సంక్రమించే వ్యాధులు. కుష్ఠు, మూలశంకలు మొదలైనవి. వీటిలో కొన్ని తల్లివల్లా కొన్ని తండ్రివల్లా వస్తాయి. వీటికి ఆధ్యాత్మిక వ్యాధులని పేరు.

**ఆదిమ** – భూమి.

**ఆద్యధాతువు** – శరీరంలో వుండే రసధాతువు.

**ఆద్యమాషకం** – మానపరిభాష. అయిదు గుంజల పరిమాణం.

**ఆధి** – మనోవ్యాధి.

**ఆధిభోగం** – ఆవులు, గుర్రాలు మొదలైన సంపత్తి అనుభవించడం.

**ఆనంద ప్రభవం** – రేతస్సు.

**ఆనువాసనికం** – అనువాసనవస్తి.

**ఆనూప** – జలభూయిష్ఠ ప్రదేశం.

**ఆనూపజలం** – ఆనూపదేశంలో వుండే నీరు.

**ఆనూపవర్గం** – అనూపదేశంలో వుండే ప్రాణివర్గం. అది అయిదు రకాలు – కూలచరాలు, ప్లవాలు, కోశస్థాలు, పాదినులు, మత్స్యాలు – అని. గజగవయాది పశువులు కూలచరాలు, హంసలు, సారసపక్షులు మొదలైనవి ప్లవాలు. వీటికి సంఘాతచారిణులనీ పేరు. శంఖాలు, నత్తలు మొదలైనవి కోశస్థాలు. తాబేళ్ళు, కుంభీరాలు మొదలైనవి పాదినులు, నీళ్ళలో సంచరించేవి మత్స్యాలు.

**ఆపన్నసత్వ** – గర్భవతి.

**ఆపాకం** – కుమ్మరి కుండలు కాల్చే ఆవ.

**ఆపానం** – మద్యపానభూమి.

**ఆప్తులు** – రజోగుణమూ, తమోగుణమూ లేని సాత్వికులు. తపోధనులు, త్రికాలజ్ఞానసంపన్నులు. వీరినే శిష్టులనీ, బుధులనీన్నీ పిలుస్తారు. వీరిమాట శిరసావహించడం శ్రేయస్కరం.

**ఆప్తోపదేశం** – ఆప్తులు చెప్పేమాటే ఆప్తోపదేశం. దీనికే ఆగమం, శాబ్దం అనీన్నీ పేర్లు.

**ఆప్యద్రవ్యాలు** – ద్రవ, స్నిగ్ధ, శీత, మంద, మృదు, పిచ్ఛిల, సర, రసగుణాలు అధికంగా గలవి.

**ఆమం** – అపక్వమైన అన్నరసం. జఠరాగ్ని తీక్ష్ణంగా లేకపోతే అన్నం రసంగా మాత్రమే తయారయి వుండిపోతుంది. రక్తం కాదు. ఆ రసమే ఆమం. అది అనేక వ్యాధులకు మూలం అవుతుంది. మలసంచయమే ఆమమని కొందరి మతం. దీనికే 'ఆంబం' అని క్షుద్రజనవ్యవహారం.

**ఆమం** – పచ్చిది. పండుకాదు, కాయ.

**ఆమానుబంధం** – ఆమం ఎప్పుడూ నిండుగా వుండడం.

**ఆమిషకరం** – రక్తం.

**ఆమోదం** – దూరంగా వ్యాపించే పరిమళం.

**ఆమ్లపంచకం** – అయిదు రకాల పుల్లని పళ్లు. అవి – రేగుపండు, దానిమ్మపండు, చింతపండు, పుల్లబచ్చలిపండు, అమ్లవేతస ఫలమున్నూ.

*మతాంతరం: నారింజ, నిమ్మ, అమ్లవేతసం, చింత, మాదీఫలం అని.*

**ఆమ్లవర్గం** – అమ్లవర్గం (చూడు.)

**ఆయతనత్రయం** – ఆయతనం అంటే రోగకారణం. అర్థానికీ కాలానికీ కర్మకూ అతియోగం, అయోగం, మిథ్యాయోగం – ఇవీ ఆ కారణాలు.

**ఆయుర్ద్రవ్యం/ఆయుర్యోగం** – ఔషధం.

**ఆయుర్వేదం** – ఇది ఋగ్వేదానికి ఉపవేదం. అథర్వవేదానికి ఉపాంగం. ఎనిమిది స్థానాలు గలది. ధన్వంతరి మొదలైన అనేకులు దీనికి సంబంధించిన గ్రంథాలు రచించారు.

**ఆయుర్వేది** – వైద్యుడు, ఆయుర్వేద సిద్ధాంతం అనుసరించి చికిత్స చేసేవాడు.

**ఆయువు** – శరీర ప్రాణసంయోగం. అంటే, పంచభూతాత్మకమైన శరీరం. చక్షురాది ఇంద్రియాలు, మనస్సు, జ్ఞానసంధానకర్త అయిన ఆత్మ – ఇవన్నీ కలిసి వుండే అవస్థా విశేషం.

**ఆయుష్యం** – ఆయుస్సు పెంచే ద్రవ్యం.

**ఆరగ్వధపంచకం** – రేల, కటుకరోహిణి, కరక్కాయ, పిప్పిలిమోడి, తుంగముస్తలు – ఇవి.

**ఆరగ్వధాదివర్గం** – రేల కొడిశపాలవిత్తులు, కలిగొట్టు, లతాకరంజం. వేప, తిప్పతీగ, చాగవార, వాకుడు, పార, నేలవేము, సహచరి, చేదుపొట్ల, క్రాముసు, కలుక్రాముగు, సప్తపర్ణి, చిత్రమూలం, గొర్డు ఆగాకర, పచ్చిపోక – ఇవి.

**ఆరణాలకం** – కాంజికాలలో ఇదొకటి.

**ఆరణ్యపశువు** – అరణ్యాలలో వుండే పశువు.

**ఆరణ్యోపలం** – విరుపిడకలు.

**ఆరామం** – ఊరివెలుపల సత్పురుషులు నాటిన తోట.

**ఆరోగ్యం** – ఏ రోగమూ లేకపోవడం.

**ఆరోగ్యపంచకం** – కరక్కాయ, రేల, కటుకరోహిణి, తెగడ ఉసిరిక పప్పు – ఇవి.

**ఆరోగ్యశాల** – చికిత్సాశాల.

**ఆరోగ్యాంబు** – నాలుగు భాగాలలో ఒక్క భాగమే మిగిలేటట్టు కాచిన వేడినీరు.

**ఆర్ఘ్యం** – తేనెలో ఇదొకరకం. మాళవదేశంలో, జరత్కారువి ఆశ్రమంలో వుండే చెట్ల నిర్యాసం (జిగురు) ఇది. దీనిపేరే ఆర్ఘ్యం.

*మతాంతరం:* తీక్ష్ణాలైన తొండాలతో తుమ్మెదలంతేసి తేనెటీగలు కొన్ని వున్నాయి. వాటికి ఆర్ఘాలు అని పేరు. అవి కూర్చే తేనెకనక, దీనికి ఆర్ఘ్యం అని పేరు.

**ఆర్ఘ్యశర్కర** – ఇది ఆర్ఘ్యమధువుతో సిద్ధం అవుతుంది. గుణాలు దానివే.

**ఆర్ద్రద్రవ్యాలు** – ఔషధాలలో వేసుకునేటప్పుడు ఈ కింద చెప్పిన మూలికలు పచ్చివే వేసుకోవాలి, కాని రెట్టింపు మాత్రం వేసుకోనక్కరలేదు. అవి – అడ్డసరం, కొడిశపట్ట, గుమ్మడికాయ, పిల్లి తేగలు, తిప్పతీగ, గోరింట, ఆముదపు చెట్టు, వెల్లుల్లి, ఖర్జూరపు పండు, తామర తూడు, కామంచిగడ్డి, లఘుపంచమూలాలు, మహాపంచమూలాలు, తృణ పంచమూలాలు, మాంసం, అల్లం, సుగంధి, కురువేరు, తుంగ గడ్డలు, వట్టివేరు, తామరదుంప, పెన్నేరు, సదాప, ప్రసారిణి.

**ఆలస్యం** – అలసభావం. అంటే, శక్తివుండిన్నీ పని చెయ్యడానికి ఉత్సాహం లేకపోవడం. సుఖస్పర్శ కావాలని వుంటుంది. దుఃఖస్పర్శ అంటే యిష్టంవుండదు. దీంతో కదల్లేకపోవడం తటస్థిస్తుంది. సోమరితనం వంటిది.

**ఆలానం** – ఏనుగులను కట్టే రాట.

**ఆలోచకం** – ఇదొక అగ్ని. ఇది కళ్ళలో వుంటుంది. వస్తువులను చూసేశక్తి కలిగిస్తుంది.

**ఆశయాలు** – స్త్రీ పురుషులకు శరీరంలో ఏడు ఆశయాలుంటాయి. అవి – వాతాశయం, పిత్తాశయం, కఫాశయం, రక్తాశయం, ఆమాశయం, పక్వాశయం, మూత్రాశయమున్ను. స్త్రీలకు ప్రత్యేకంగా గర్భాశయం అని ఎనిమిదోది కూడా ఉంటుంది.

**ఆశ్చ్యోతనం** – ఒక చేతితో కన్ను తెరిచి, రెండో చేతితో రెండంగులాల యెత్తునుంచి కషాయం తేనె, ఆసవం, తైలం, స్నేహద్రవ్యాలు – ఇలాంటి ఔషధాలు కంటిలో వెయ్యడం. దీనిపేరు ఆశ్చ్యోతనం.

**ఆశ్వీనం** – గుర్రంమీద ఒక్కదినం ప్రయాణం చేసేటంతటి దూరం.

**ఆసవం** – ప్రక్షేప్యచూర్ణం, బెల్లం, ఆరెపువ్వు, ద్రాక్షపండు, చక్కెర – ఇత్యాదులు పచ్చినీటిలో కలిపి కుండలో చీలఇచ్చి నెలదినాలు ఉంచి తయారుచేసేది.

లక్షణం యిలావున్నా, కషాయాలతో, తయారుచేసే ఆసవాలున్నా అనేకం వున్నాయి. ఇది సామాన్య ధర్మం మాత్రమే.

**ఆసీన ప్రచలాయితం** – ఇదొకరకమైన నిద్ర. అనగా కూచునేవుండి, నిద్రమత్తుతో వూగడం. సాధారణంగా దివానిద్ర అలవాటున్న వారికి

పరస్థలాలలో అవకాశం లేనప్పుడు ఇది తప్పని సరి అవుతూ వుంటుంది. రైలు బళ్ళలో ప్రయాణం చేసేవారి కందరికీ ఇది తప్పనిదే.

**ఆసురి** – త్రివిధచికిత్సలలో ఇదొకటి. శస్త్రకర్మ ఆసురి.

**ఆస్కందితం** – గుర్రపునడకలు అయిదు రకాలు. వాటిలో ఇదొకటి.

**ఆస్తికమతి** – ఉత్తమ వైద్యుడు.

**ఆస్థాపనం** – నిరూహవస్తి.

**ఆస్థాపనోపగవర్గం** – నిరూహవస్తికర్మకుపయోగించే కషాయద్రవ్యాలు. అవి – తెగడ, మారేడు, పిప్పళ్ళు, చెంగల్వకోష్ఠు, ఆవాలు, వస, గొడిశపాల విత్తులు, సదాప, యష్టిమధుకం, మ్రంగకాయ.

**అస్పందనం** – మిక్కిలీ వొణకడం (అతికంపం).

**అస్యలోమం** – మీసాలు.

**అస్యవైరస్యం** – నోరు విరసంగా వుండడం.

**అస్యాసవం** – చొంగ.

**ఆహారం** – అంటే భోజనపదార్థం. ఇది ఘన పదార్థం, ద్రవపదార్థం అని రెండు విధాలు. స్వభావగురువు, మాత్రాగురువు, సంస్కార గురువు – అని మళ్ళీ మూడు విధాలు. సహజంగా వస్తుగుణం అనుసరించి గురుత్వం కలది స్వభావ గురువు. మోతాదు ఎక్కువ అయితే మాత్రాగురువు. వంటచేసే విధానం అనుసరించి గురుత్వం పొందినది సంస్కార గురువు.

**ఆక్షికశీథువు/ఆక్షికీశీథువు** – అక్షం అంటే తానిచెట్టు. ఇదే కరకతాడి వుసిరికలలోని తాడి. దీనిపట్ట, వరిబియ్యం, ఆరెపువ్వు – వీటితో తయారుచేసిన మద్యం ఆక్షిక శీథువు.

## ఇ

**ఇంద్రమహోకాముకం** – కుక్క.

**ఇంద్రాగ్నిధూమం** – మంచు.

**ఇంద్రియకర్మ** – ఇంద్రియాలు చేసేపనులు. అవి – చెవులకు శబ్ద గ్రహణం, చర్మానికి స్పర్శగ్రహణం, కళ్ళకు రూపదర్శనం, నాలుకకు రసగ్రహణం, ముక్కులకు గంధగ్రహణం, వాక్కుకి మాట్లాడడం, చేతులకు ఆదానం, పాయువుకు విసర్గం, పాదాలకు గమనం, ఉపస్థకు ఆనందమున్ను.

**ఇంద్రియగ్రామం** – అంటే ఇంద్రియ సమూహం.

**ఇంద్రియజ్ఞానం** – ఇంద్రియాల వల్ల కలిగే జ్ఞానం.

**ఇంద్రియద్రవ్యాలు** – ఆకాశం, వాయువు, తేజస్సు, జలం, భూమి – ఇవి అయిదూ ఇంద్రియ ద్రవ్యాలు.

**ఇంద్రియపంచకం** – చక్షుస్సు, శ్రోత్రం, ఘ్రాణం, రసనం, స్పర్శనం.

**ఇంద్రియబుద్ధులు** – చక్షుర్బుద్ధి, శ్రోత్రబుద్ధి, ఘ్రాణబుద్ధి, రసనబుద్ధి, స్పర్శనబుద్ధి – ఇవి అయిదూ ఇంద్రియబుద్ధులు.

**ఇంద్రియవైకల్యం** – ఇంద్రియాలు వికృతి పొందడం.

**ఇంద్రియసంతాపం** – ఇంద్రియాలకు బాధ కలగడం.

**ఇంద్రియస్వాపం** – చేష్ట ఉడగడం, నిద్ర.

**ఇంద్రియాగోచరం** – అతీంద్రియ విషయం. ఇంద్రియాలకు అందనిది.

**ఇంద్రియాధిష్ఠానాలు** – కళ్ళు, చెవులు, ముక్కులు, జిహ్వ, చర్మం – ఇవి అయిదూ ఇంద్రియాధిష్ఠానాలు.

**ఇంద్రియార్థాలు** – శబ్దం, స్పర్శం, రూపం, రసం, గంధం – ఇవి ఇంద్రియార్థాలు.

**ఇంద్రియాలు** – మనిషికీ కర్మజ్ఞానసాధనాలు. ఇవి పదకొండు. కర్మేంద్రియాలు, జ్ఞానేంద్రియాలు, అంతరింద్రియం అని యివి మూడు విధాలు. చెవులు, చర్మం, కళ్ళు, నాలుక, ముక్కు – ఇవి జ్ఞానేంద్రియాలు. వీటికే బుద్ధీంద్రియాలు అనిన్నీ పేరు. ఇవి సమస్త విషయాలూ తెలుసుకోడాని కుపయోగిస్తాయి. వాక్కు, పాణి, పాయు, పాదం, ఉపస్థ – ఇవి కర్మేంద్రియాలు. ఇవి పని చెయ్యడానికి సాధనాలు. మనస్సు ఉభయాత్మకం. ఇదే అంతరింద్రియం.

**ఇంద్రోక్తరసాయనం** – ఇంద్రుడు చెప్పిన మహారసాయనవర్గం –

**ఇంద్రియోత్పత్తి** – తైజసాహంకారసాయంతో, వైకారికారికాహంకారంవల్ల, తల్లక్షణాలు గల శ్రోత్రం (చెవులు), త్వక్కు (చర్మం), చక్షుస్సు (కళ్ళు.), జిహ్వ (నాలుక), ఘ్రాణం (ముక్కు), వాక్కు (నోరు), హస్తం (చెయ్యి), ఉపస్థ, పాయువు (గుదస్థానం), పాదం (కాలు),

మనస్సు – ఈ పదకొండు ఇంద్రియాలున్నా పుట్టాయి.

ఇచ్ఛాపథ్యం – చాలా జబ్బులు మందు పుచ్చుకో కుండా ఆహారవిహారాలవల్లనే పోగొట్టుకోవచ్చు. ప్రతీవ్యాధికీ ఆహార విహారాల విషయమై విధినిషేధాలున్నాయి. ఈ వివరాలన్నీ శాస్త్రం వల్ల తెలుసుకోవచ్చు. సమర్థులైన వైద్యులు ప్రతీరోగికీ హితాహార విహారాలు విక్కచ్చిగా చెబుతూనే వుంటారు. అయినా, రోగు లున్నా కొన్ని స్వయంగా తెలుసుకోవచ్చు. దీనికి సూత్రం – ఏ వస్తువులు తింటే వ్యాధి తగ్గుతుందో – లేక – హెచ్చుతుందో పరిశీలించడం. ఇలాగే, ఏపని చేస్తే వ్యాధి తగ్గుతుందో – లేక – హెచ్చుతుందో గుర్తించడం. ఇలా గుర్తించినందుకు ఫలితం బాధించే పనులూ, బాధించే వస్తువులూ మానుకోవడం. హితకరాలేవో గుర్తించి అవి స్వీకరించడమే ఇచ్ఛాపథ్యం.

ఇష్టకాలయం – అంటే, ఇటుకలతో కట్టిన గృహం. ఇది శీతకాలంలో వెచ్చగానూ, వేసవిలో చల్లగానూ వుంటుంది.

ఇక్షునేత్రం – చెరకుగడకు కణుపు కణుపునా చిన్న బొటిమ వంటిది వుంటుంది. అదే మొలకవచ్చే స్థానం. దానికే ఇక్షునేత్రం అని పేరు.

ఇక్షుభక్షిక – ఇక్షురసం తీసేయంత్రం. చెరకు గానుగ.

## ఈ

ఈతిబాధలు – ఇవి ఆరు. అతివృష్టి, అనావృష్టి, మిడతలు, ఎలుకలు, చిలకలు, అత్యాసన్నులైన రాజులున్ను.

ఈక్షణికుడు – చేతిలోవున్న రేఖలుచూసి, శుభాశుభఫలాలు చెప్పేవాడు. సాముద్రిక శాస్త్ర జ్ఞుడన్నమాట.

## ఉ

ఉచ్చాటనం – అభిచారకర్మలు ఆరు. అందులో ఇదొకటి.

ఉచ్ఛాదనం –సుగంధ ద్రవ్యాలతో శరీరానికి వలుగు పెట్టుకోవడం.

ఉచ్ఛీర్షికం – తలగడ. దిండు.

ఉత్కర్షణం – కిందిదాన్ని పైకి తియ్యడం.

ఉత్కాక – ఏటా ఈనే ఆవు.

ఉత్కారిక – జొన్నపిండి, బియ్యపుపిండి, మినపపిండి, గోధుమపిండి మొదలైనవాటితో చేసే రొట్టె.

ఉత్కారిక – ఇది స్వేదకర్మకు ఉపయోగించే పదార్థం. యవలు, మినుములు, ఆముదపుగిం జలు, అవిసెగింజలు, కుసుమగింజలు – ఇవి సగం ఉడికించి చేసినది.

ఉత్క్లేదం – వమనం.

ఉత్క్లేశం – వమనం వచ్చేటట్టుండడం. కడు పులో తిప్పుతుంది. నోట నీళ్లూరతాయి. అసహ్యంగా వుంటుంది. మాటిమాటికి ఉమ్మివెయ్యవలసి వస్తుంది. హృదయంలో బాధగా వుంటుంది. వాంతిమాత్రం కాదు. ఇది ఉత్క్లేశం. ఓకిరింత అని దీనికేపేరు.

ఉత్క్లేశనవస్తి – వస్తికర్మలలో ఇదొకటి. ఆముద పుగింజలు, ఇప్పపట్ట, పిప్పళ్ళు, సైంధవలవణం, వస, వెర్రిపుచ్చకాయ – ఇవన్నీ కలిపి నూరి ఆ కల్కంతో వస్తిప్రయోగం చేసేది.

ఉత్తప్తం – ఎండిన మాంసం.

ఉత్తమం – గుర్రాలలో ఇదొక మంచిరకం. దీనివేగం మిక్కిలి ఎక్కువ. యుద్ధాలలో దీని ప్రయోజనం హెచ్చుగా వుంటుంది. శరీరం అంతా తూట్లు పడిపోయినా ఇది తన రౌతుకి అపాయం రాకుండా చూసుకుంటూ వుంటుంది.

ఉత్తమాంగం – అంటే శిరస్సు. ప్రాణమూ, చక్షురాది ఇంద్రియాలూ ఉండడంవల్ల అంగా లన్నిటిలోనూ ఇది మిక్కిలీ ఉత్తమం. కరచరణాది అంగాల కన్నిటికీ పైనివుండడం వల్ల కూడా దీనికీపేరు వచ్చింది.

ఉత్తమవైద్యుడు – వేదవేదాంగాలు చదివి క్షుణ్ణంగా తెలుసుకున్నవాడు.

ఉత్తరవస్తి – త్రివిధవస్తికర్మలలో ఇదొకటి. నిరూ హవస్తికర్మ చేసిన తరవాత యోనిద్వారానా, మూత్రద్వారానా చేసేది.

ఉత్తమవారి – తండులోదకం. అంటే బియ్య పుకడుగు.

ఉత్తరంగం – ద్వారానికి పైభాగాన వుండే అడ్డకమ్మి.

ఉత్తానశాయి – పాలు తాగే శిశువు.

ఉత్తానుడు – వెలికిల పరుండి వుండినవాడు.

**ఉత్తాపం** – వెచ్చపెట్టడం.

**ఉత్తారం** – వమనం.

**ఉత్తేజితం** – అశ్వగతులు అయిదింటిలో ఇదొకటి. కోపంగా వుండినట్టు నాలుగుకాళ్ళూ ఎగరవేసుకుంటూ పరుగెత్తడం.

**ఉత్పలగంధికం** – మిక్కిలీ సువాసనగల చందనం.

**ఉత్పలదలం** – శస్త్రాలలో ఇదొకటి.

**ఉత్పలపత్రకం** – ఇదిన్నీ ఒక అస్త్రం.

**ఉత్పలాదివర్గం** – ఇదొక కషాయ ద్రవ్యవర్గం – నల్లకలువ, ఎర్రకలువ, కొద్దిగా ఎర్రగావుండే కలువ, తెల్లకలువ, తెల్లతామరపువ్వు, యష్టిమధుకం – వీటి కషాయం. ఇది తాపం, దప్పిక, హృద్రోగం పోగొడుతుంది.

**ఉత్ప్లవనం** – ఎగిరిదాటడం.

**ఉత్సంగం** – ఒడి.

**ఉత్సర్జనం** – విడిచిపెట్టడం.

**ఉత్సర్య** – ఈనమోపైన ఆవు.

**ఉత్సాదనం** – నలుగుపెట్టుగోడం.

**ఉత్సింహానం** – ముక్కుతో గాలిపీల్చడం.

**ఉదకప్రక్షేపణం** – నీళ్ళు చల్లబరిచే ఉపాయం. ఉదకం నిండివున్న పాత్రమీద నీళ్ళు చల్లుతూ వుంటే పాత్రలోని నీళ్ళు చల్లబడతాయి.

**ఉదన్య** – దప్పిక.

**ఉదపానం** – కూపం.

**ఉదమానం** – నీటికొలత కుపయోగించే ఆఢకం.

**ఉదరపిశాచం** – సర్వభక్షకుడు.

**ఉదరావర్తం** – నాభి.

**ఉదరిణి** – గర్భవతి.

**ఉదర్దప్రశమనవర్గం** – ముయ్యాకుపొన్న, కోలపొన్న, ములక, వాకుడు, ఆముదపువేరు, కాకోళి, చందనం, వట్టివేరు, ఏలకులు, యష్టిమధుకం.

**ఉదశ్విత్తు** – సగం నీరు కలిసిన చల్ల.

**ఉదాసీనపరిషత్తు** – మూడు విధాల పరిషత్తులలో ఇదొకటి. ఏది యెలా జరిగినా సరే అనీ, ఎవరెలా అయినా సరే అనీ వొరగవేసుకుపోయేవారి సభ.

**ఉదూఖలం** – రోలు.

**ఉద్గమనీయం** – ఉతికిన వస్త్రం.

**ఉదారం** – త్రేనుపు.

**ఉద్గరణం** – వమనం.

**ఉద్ఘాటనం** – నూతిలో నుంచి నీరు తోడడానికి తాడుకట్టిన పాత్ర.

**ఉద్వర్తనం** – నలుగుపెట్టుకోడం. శరీరం మర్దించుకోడం.

**ఉధ్మానం** – పొయ్యి.

**ఉన్మాథం** – మృగాలనుపట్టి చంపడానికి ఉపయోగించే ఉచ్చులలో ఒకరకం.

**ఉన్మానం** – మానపరిభాష. ఒక తులం. ఒక ద్రోణమున్నూ.

**ఉపక్రమం** – చికిత్స.

**ఉపఘాత** – రోగం.

**ఉపచర్య** – చికిత్స. సేవ.

**ఉపచితం** – వృద్ధిపొందినది.

**ఉపతప్త** – రోగం.

**ఉపదగ్ధం** – కొద్దిగా కాలినది.

**ఉపధాతువు** – మాంసానికి చమురు (వస), మేదస్సుకు చెమట (స్వేదం), అస్థులకు దంతాలు (పళ్ళు), మజ్జకు వెంట్రుకలు, శుక్రానికి ఓజస్సు, స్త్రీలకు ప్రత్యేకంగా రసధాతువుకు స్తన్యం, రక్తధాతువునకు ఋతురక్తం ఉపధాతువులు.

**ఉపనాహస్వేదం** – స్వేదకర్మలలో ఇదొకటి. వస, సురాబీజం, సదాప, దేవదారు – ఇవిగాని – నువ్వులు, అవిసెగింజలు, మినుములు – ఇవిగాని – చెంగల్వకోష్ఠు, అగురుచెక్క, గ్రంథితగరం – ఇత్యాది గంధద్రవ్యాలు గాని – దుంపరాష్న, ఆముదపుగింజలు, జటామాంసి, మాంసం – ఇవిగాని – లవణం యెక్కువగా చేర్చి చమురు, చుక్రం (పులికడుగు), మజ్జిగ, పాలు – వీటిలో కలిపి దాంతో చెమట పుట్టించడం. దీనికి ఉపనాహస్వేదం అనిపేరు.

**ఉపభోగం** – మోతాదు మించేటట్టు భోజనం చెయ్యడం.

**ఉపమాత** – దాది.

**ఉపయంత్రం** – శల్యాలు తీసే యంత్రాలు పదిహేనువిధాలు. వాటిలో ఇదొకటి.

**ఉపయామం** – వివాహం.

**ఉపలోహం** – కంచు, ఇత్తడి మొదలైనవి.

**ఉపవస్తం** – ఉపవాసం.

**ఉపవాసం** – లంఘనం.

**ఉపవాహ్యం** – రాజు ఎక్కే ఏనుగు.

**ఉపవిషపంచకం** – చెముడుపాలు, జిల్లేడు, కరవీరం (గన్నేరు), పొత్తి దుంప, ఉమ్మెత్త.

**ఉపవిషాలు** – జిల్లేడుపాలు, జెముడుపాలు, పొత్తిదుంప, గన్నేరు, గురిగింజ, వల్లమందు, ఉమ్మెత్త – ఈ యేడున్నూ ఉపవిషాలు.

**ఉపవ్యాఘ్రం** – చిరుతపులి.

**ఉపశమం** – శాంతి.

**ఉపశయం** – వ్యాధిజ్ఞానహేతువు.

**ఉపసరం** – మొదటిమాటు గర్భం ధరించడం.

**ఉపసర్పి** – ఒక సంవత్సరంలో ఈనే ఆవు.

**ఉపస్తంభం** – ప్రధానమైన ఆధారానికి ఉప బలంగావుండేది ఉపస్తంభం. ఈ శాస్త్రంలో ఆయువే ప్రధానాధారం. దానికి ఉపబలాలు – అంటే ఉపస్తంభాలు ఆహారం, నిద్ర, బ్రహ్మచర్యం అవి మూడు.

**ఉపస్థాత** – పరిచారకుడు. రోగికి పరిచర్యచేసే యీ మనిషికి నాలుగు లక్షణాలుండాలి. అవి 1. అనురక్తి, 2. శుచి, 3. దక్షిత, 4. బుద్ధిమత్వం. ఈ ఉపస్థాత పాదచతుష్టయంలో ఒక పాదం.

**ఉపాసద్ధారణం** – లంఘనం.

**ఉపాసనం** – శుశ్రూష. రోగికి పరిచర్య చెయ్యడం.

**ఉపోషం/ఉపోషణం** – లంఘనం.

**ఉప్యం** – వపనకర్మ చేసే స్థలం.

**ఉల్ముకం** – మండుతున్న బొగ్గు.

**ఉల్లేఖనం** – వమనం.

**ఉష్ణవారణం** – గొడుగు.

**ఉష్ణీషం** – తలపాగా.

**ఉష్ణోదకం** – ఎనిమిదో వంతూ, నాలుగో వంతూ, సగమూ మిగిలేటట్టు కాచిన వేడినీరు. సందర్భం అనుసరించి ఈ అంతరువుల ఉపయోగం.

**మతాంతరం:** ఇది పాదహీనం, అర్ధహీనం, త్రిభాగహీనం – అని.

వీటిలో పాదహీనం వాతం హరిస్తుంది. అర్ధహీనం పిత్తం హరిస్తుంది. త్రిభాగహీనం కఫం తగ్గిస్తుంది.

## ఊ

**ఊర్జస్వలం** – ఉత్సాహకరం.

**ఊర్ధ్వజత్రువు** – మెడ ఎముక పైభాగం.

**ఊర్ధ్వనలికాయంత్రం** – ఇదే టంకయంత్రం. ఒక కుండలో యుక్త ప్రమాణంగా ప్రక్షేప్యమూ జలమూ పోసి, దానిమీద మరోకుండ బోర్లించి, చీలమన్ను పూసేది. కిందకుండ కంఠానికి కిందుగా ఒక రంధ్రంచేసి ఆ రంధ్రంలో ఒక సన్నని వెదురుగొట్టం ఉంచి, ఆ గొట్టం రెండోచివర ఒక సీసాలో పెట్టేది. సీసా ఒక నీళ్ళతొట్టిలో వుంచాలి. అప్పుడు కిందికుండ కింద మంటపెడితే జలం, ప్రక్షేప్యంతో మరిగి ఆవిరి అయి గొట్టంలోనుంచి సీసాలో ప్రవేశించి మళ్ళీ ద్రవం అయి వుంటుంది.

**ఊర్ధ్వపాతనం** – పాదరస సంస్కారాలలో ఇదొకటి.

**ఊర్మర** – సకల సస్యాలూ పండే భూమి. ఊషర క్షేత్రానికి ప్రతికూల లక్షణాలు కలది.

**ఊర్మణం** – మానపరిభాష. ఒక ద్రోణం.

**ఊషకాదిగణం** – వృష్యకం, తుత్థకం, ఇంగువ, కాశీసద్వయం, సైంధవలవణం, శిలాజిత్తు – ఇవి.

**ఊషాపానం** – ఎనిమిది ప్రసృతులు – అంటే పదహారు పలాల నీరు సూర్యోదయం కాకముందే పుచ్చుకోడం. దీనివల్ల వాత పిత్తకఫాల ప్రకోపం తగ్గిపోతుంది. శతాయువున్నూ సిద్ధిస్తుంది.

**ఊష్మస్వేదం** – స్వేదకర్మలలో ఇదొకటి. ఉత్కారిక, మట్టిబెడ్డలు, చిల్ల పెంకులు, రాళ్ళు, ధూళి, ఆకులు, ధాన్యం, కరీషం (పిడు పిడకలు), ఇసుక, ఊక – ఇవి వీలయినన్ని విధాల వెచ్చచేసి రోగి శరీరంమీద పెడుతూ చెమట పుట్టించడం. ఇది ఊష్మస్వేదం.

**ఊహిని** – చీపురుకట్ట.

## ఋ

**ఋతుకాలవర్జనీయాలు** – అంటే ఋతుమతి అయి వుండిన మూడు దినాలు స్త్రీలు చెయ్యగూడని పనులు.

ఆమె బ్రహ్మచర్యం అవలంబించి వుండాలి. అంటే అష్టాంగ మైధునరహితురాలై వుండాలి. కళ్ళకు కాటుక పెట్టుకోగూడదు. పగలు నిద్రపోరాదు. రోదించగూడదు. స్నానమూ, అనులేపనమూ, అభ్యంగమూ చెయ్యగూడదు. గోళ్ళు తీసుకోరాదు. పరిగెత్తగూడదు. దుమ కడం పనికిరాదు. నవ్వడం, మిక్కిలి చదవడం, గొప్పధ్వనులు వినడం, తలదువ్వుకోవడం పని

కిరాదు. గాలిలో తిరగరాదు. శ్రమకరమైన పని చెయ్యగూడదు. ఏమంటే? ఆ మూడు దినాలలోనూ, స్త్రీ, పగలు నిద్ర పోతే ఎప్పుడూ నిద్రపోయే స్వభావమూ; కాటుక పెట్టుకుంటే గుడ్డితనమూ, రోదనం చేస్తే వికారమైన చూపూ, స్నానాను లేపనాలు చేసుకుంటే ఎప్పుడూ దుఃఖించే స్వభావమూ, అభ్యంగం చేసుకుంటే కుష్ఠ రోగమూ, గోళ్ళు తీసుకుంటే పిప్పిగోళ్ళూ, పరిగెత్తినా, దుమికినా చంచలస్వభావమూ, నవ్వితే దంతాలు పెదవులు దవడలు నాలుక – ఇవి నల్లగా వుండడమూ, అతిసంభాషణ చేస్తే ప్రలాపమూ, గొప్ప శబ్దం వింటే చెవుడూ, తల దువ్వుకుంటే బట్టతలా, గాలిలో తిరిగినా శ్రమకరమైన పనిచేసినా ఉన్మాదమూ – ఇలాంటి దుర్లక్షణాలతో బిడ్డలు పుడతారు. కనక, ఋతుమతి చాలా జాగ్రత్తగా వుండాలి.

**ఋతుసంధి** – అంటే రెండు ఋతువుల సంధికాలం. ఇది – వెళ్ళిపోయే ఋతువు చివరి యేడు దినాలు, వచ్చే ఋతువు మొదటి యేడు దినాలూ – వెరశి పధ్నాలుగు దినాలు. ఈ సంధికాలంలో పూర్వర్తు ధర్మాలు ఆచరించగూడదు. వచ్చే ఋతువు ధర్మాలే ఆచరించాలి.

**ఋతుస్నాన** – ప్రథమ దృష్టి – ఋతుస్నానం చేసిన వెంటనే, స్త్రీ చక్కగా అలంకరించుకుని ముందుగా భర్తను తప్ప మరే పురుషునీ చూడగూడదు. ఏమంటే? ఆ స్థితిలో మొదట ఏ పురుషుని చూస్తే ఆ పురుషుని వంటి కుమారుడు కలుగుతాడు.

**ఋతుస్నాన** – ఋతుకాలం మూడు దినాలు గడిపి నాలుగోనాడు స్నానం చేసిన స్త్రీ. అయితే స్నానం చెయ్యగానే ఆ స్త్రీ ముందు భర్తనే చూడాలి.

**ఋతువు** – ఋతువులు ఆరు. సూర్యుడు ఒక్కొక్క రాశిలో ప్రవేశించినప్పుడు ఇక్కడ మనుష్యులకు వాతపిత్తకఫాలు చయ ప్రకోప సామ్యావస్థలు పొందుతూ వుంటాయి. అలాంటి రెండేసి రాసుల కాలప్రమాణం ఒక ఋతువు. వాటిపేరు శిశిరం, వసంతం, గ్రీష్మం, వర్షం, శరత్తు, హేమంతం అని.

మాఘఫాల్గునాలు శిశిరం. చైత్రవైశాఖాలు వసంతం. జ్యేష్ఠాషాఢాలు గ్రీష్మం. శ్రావణభాద్రపదాలు వర్షం. ఆశ్వయుజకార్తికాలు శరత్తు. మార్గశిరపౌషాలు హేమంతం.

## ఏ

**ఏకభక్తవ్రతం** – అంటే దినానికి ఒక్కమాటే భోజనం చెయ్యాలన్న నియమం. ఈ నియమం అనుసరించేవారు రాత్రి భుజించకూడదు. పగటిపూట రెండు జాములు దాటాక ఒక్కమాటే భుజించాలి.

**ఏకశఫం** – ఒక్క డెక్క మాత్రమే కలిగి వున్న పశుజాతి. ముఖ్యంగా గుర్రం, గాడిద, కంచరగాడిద, శరభం, చమరమృగం –వీటికి ఒక్కొక్క డెక్కే వుంటుంది.

**ఏకహస్తి** – అశ్వగతులలో ఇదొకటి.

**ఏకాదశేంద్రియం** – అంటే పదకొండు ఇంద్రియాలు. ఇవి – శ్రోత్రం, త్వక్కు, చక్షువు, రసన, ఘ్రాణం, వాక్కు, పాణి, పాయువు, ఉపస్థ, పాదం, మనస్సు – వీటిలో మొదటి అయిదూ జ్ఞానేంద్రియాలు. తరవాతి అయిదూ కర్మేంద్రియాలు. మనస్సు ఉభయాత్మకం.

**ఏరండాదివర్గం** – ఇది వాతపిత్త వికారాలు హరిస్తుంది. ఈ గణంలో ద్రవ్యాలు – ఆముదపుచెట్టువేరు, సుగంధి, ద్రాక్షపండు, దిరిసెనపట్ట, ప్రసారిణి, మాషపర్ణి, ముద్గపర్ణి, నేలగుమ్ముడు, మొగలిచన్ను – ఇవి.

**ఏలాదిగణం** – ఏలకులు మొదలైన ద్రవ్యాలు. ఇవి – చిన్నయేలకులు, పెద్దయేలకులు, తురుష్కం, చెంగల్వకోష్ఠు, ప్రేంకణాలు. జటామాంసి, కురువేరు, ధ్యామకం (దీనికి అభావప్రతినిధి వట్టివేరు), స్పృక్క మొగ్గలు, కచ్చూరాలు, దాల్చిని, ఆకుపత్రికం, గ్రంథి తగరం, మాచి పత్రి, జాజికాయ, నఖంచిప్పలు, దేవదారు, అగురు చెక్క, సరళనిర్యాసం, కుంకుమపువ్వు, దమనం, గుగ్గిలం, పున్నాగం, నాగకేసరాలు.

**ఏలాద్వయం** – చిన్నయేలకులు, పెద్ద ఏలకులున్ను.

**ఏషణ** – అంటే సాధించడానికి తగిన ఉపాయం. ఇది ప్రాణైషణ, ధనైషణ, పరలోకైషణ అని మూడు విధాలు. మనిషి ఇహపరసుఖం అర్జించుకోవాలంటే ఏషణాలు మూడూ సంపాదించుకోవాలి. ఇవి సంపాదించుకోలేనివాడు పురుషాధముడు. ఈషణాలు వేరు.

## ఓ

**ఓజస్సు** – అంటే ఓజోధాతువు. ఇది శుక్రాది ధాతువులన్నిటికంటే విశిష్టమూ, గొప్పదిన్నీ. ఇది హృదయంలో వుంటుంది. ఇది ఎనిమిది బిందువుల పరిమాణం. కొంచెం పసుపూ కొంచెం ఎరుపూ కలిసిన తెలుపురంగుగా వుంటుంది. ఇది నశిస్తే మనిషి తక్షణం చనిపోతాడు.

తుమ్మెదలు పువ్వుల్లోనుంచీ, ఫలాలలోనుంచీ తేనె సంగ్రహించి ఒకచోట చేర్చేటట్టు మనిషి శరీరంలో వుండే రసాది ధాతువులనుంచి గుణాలు, వాటిసారం గ్రహించి హృదయంలో చేరుస్తూ వుంటాయి. ఆ సారమే ఓజస్సు.

ఈ ఓజస్సు ప్రధానం, అప్రధానం అని రెండు విధాలు. హృదయాశ్రితమైన అష్టబిందాత్మక ఓజస్సు ప్రధానం. అప్రధానమైనది అంజలి పరిమితమై వుంటుంది. ఇది క్షీణిస్తే మనిషికి బలహీనం కలుగుతుంది. భయం పుడుతుంది. మనస్సు కలత పొందుతుంది. శరీరం కాంతిహీనం అవుతుంది. ఆయాసంగా వుంటుంది.

**ఓజస్కరం** – ఓజోధాతువును పుట్టించేది.

**ఓషధి** – ఒక్కమాటు ఫలించి నశించిపోయే అరటిచెట్టు, ధనియాల చెట్టు మొదలైనవి ఓషధులు. ఇవి స్థావరాలనీ, జంగమాలనీ రెండు రకాలు. వాటిలో స్థావరాలు, వనస్పతి వృక్షం వీరుత్తు ఓషధి అని మళ్ళీ నాలుగువిధాలు. పూతలేకుండా కాసేది వనస్పతి. పూసికాసేదీ వృక్షం. అల్లుకునే తీగ వీరుత్తు. ఒక్కపంటపండి నశించేది ఓషధి. జంగమాలున్నూ – జరాయుజాలు, అండజాలు, స్వేదజాలు, ఉద్భిజ్జాలు అని నాలుగు విధాలు. పశువులు, మనుష్యులు, పులులు – ఇత్యాదులు జరాయుజాలు. పక్షులు, పాములు, సరీసృపాలు – ఇత్యాదులు అండజాలు. క్రిమికీటకాలు స్వేదజాలు, కప్పలు మొదలైనవి ఉద్భిజ్జాలు.

**ఓషధిగణం** – అంటే రసాయనానికి సంబంధించిన ఓషధుల గణం. వీటికి మహౌషధులని పేరు. ఇవి – అజగరి, శ్వేతకాపోతి, కృష్ణకాపోతి, గోనసి, వారాహి, కన్య, ఛత్ర, అతిచ్ఛత్ర, కరేణు, అజ, చక్రక, ఆదిత్యపర్ణిని, బ్రహ్మసువర్చల, శ్రావణి, మహాశ్రావణి, గోలోమి, అజలోమి, మహావేగవతి అని పద్దెనిమిది. వీటి వివరాలు గ్రంథాంతరాలవల్ల తెలుసుకునేది. యథాశాస్త్రంగా ఇవి సేవిస్తే ఏ వయసువాడైనా పురుషుడు మంచి యువకుడయి పోతాడు. సింహపరాక్రముడూ, చాల చక్కనివాడూ, సకల విద్యలూ నేర్చినవాడున్నూ అవుతాడు. ఆ మనిషి రెండువేల సంవత్సరాలు బతుకుతాడు. మహావైభవాలు అనుభవిస్తాడు. ఖేచరుడున్నూ అవుతాడు.

**ఓష్ఠరంజని** – తాంబూలం.

## ఔ

**ఔఖ్యం** – గిన్నెలోవండిన అన్నాదికం.

**ఔదనికుడు** – వంటలవాడు.

**ఔదరికుడు** – కుక్షింభరుడు.

**ఔద్దాలికం** – పుట్టతేనె. ఇది బంగారురంగుగా వుంటుంది.

**ఔద్భిదం** – భూమిలోనుంచి ధారగా వచ్చే జలం. ఇది చల్లగానూ మధురంగానూ వుంటుంది.

**ఔద్భిదచతుష్కం** – వనస్పతి, వానస్పత్యం, వీరుధం, లత అని ఔద్భిదాలు నాలుగు విధాలు.

**ఔద్భిదాలు** – అంటే భూమి బద్దలుచేసుకుంటూ పుట్టుకువచ్చేవి. ఇవి – వేళ్ళు, పట్ట, చేవ, బంక, స్వరసం, కాడ, చిగురు, క్షారాలు, పాలు, పళ్ళు, పువ్వులు, భస్మం, తైలం, ముళ్ళు, ఆకులు, ఊడలు, దుంపలు, అంకురాలు – ఇత్యాదులు.

**ఔధస్యం** – పశువుల పాలు.

**ఔపవస్తం** – ఉపవాసం.

**ఔషధం** – రోగాలు హరించే ద్రవ్యం. దీనికి నాలుగు గుణాలుండాలి. 1. బహుకల్పం, 2. బహుగుణం, 3. సంపన్నం, 4. యోగ్యం – అని. బహుకల్పం అంటే, స్వరసం, చూర్ణం, లేహ్యం, తైలం, ఘృతం, రసౌషధం, అసవారిష్టాలు – ఇత్యాదిగా బహువిధాలైనది. బహుగుణం అంటే గురుమందాదియుక్తమై అనేక సుగుణాలు కలిగించగలది. సంపన్నం అంటే ప్రశస్తప్రదేశాల్లో పుట్టిన మూలికాదులతో తయారైనది. వింధ్యపర్వతం మీద పుట్టినవి మంచివి. అవే గ్రహించేది. అడవుల్లోనూ, చిట్టడవుల్లోనూ పుట్టినవిన్నీ గ్రహించవచ్చు. పుట్టలమీదా, శ్మశానాల్లోనూ పుట్టినవి గ్రహించగూడదు. యోగ్యం అంటే వాడడానికి తగ్గ స్థితిలో వుండేది. ఇలాగ, చతుర్విధ శుభలక్షణయుక్తమైన ఔషధం –

శోధనం, శమనం అని రెండువిధాలు. వీటిలో వస్తివిరేచనకర్మల కుపయోగించేది శోధనం. ఇది కుపితాలైన దోషాలు పైకి వెడలించి రోగాలు తగ్గిస్తుంది. తైలఘృత మధురూపమైనది శమనం. ఇది స్వస్థానంలోనే దోషాలు సామ్యపరుస్తుంది. వాతప్రకోపంలో వస్తికర్మ చెయ్యాలి. పిత్తప్రకోపంలో విరేచన సాధనం చెయ్యాలి. వస్తి అనే సాధనం ద్వారా గుదమార్గాన కషాయం, స్నేహం ఎక్కించడం వస్తికర్మ. నోటిద్వారా ఔషధం పుచ్చుకుంటే గుదద్వారాన లోపలి దోషాలు బయటికి వెడలించడం విరేచనకర్మ. కఫప్రకోపంలో వమనం చేయించాలి. నోటిద్వారా ఔషధం పుచ్చుకుంటే వాంతి అయి, దోషాలు నోటినుంచే బయటికి పోతాయి. ఇది వమనకర్మ.

ఇక శమనపద్ధతి: వాతానికి తైలం, పిత్తానికి ఘృతం, కఫానికి తేనె వాడేది.

**ఔషధకాలం** – అంటే ఔషధం పుచ్చుకోవలసిన సమయం. నిర్భక్తం, ప్రాగ్భక్తం, అధోభక్తం, మధ్యేభక్తం, అంతరాభక్తం, సభక్తం, సాముద్గం, గ్రాసం, ముహూర్ముహుపు, గ్రాసాంతం, అని యిది పది విధాలు.

నిర్భక్తం, ఎలాంటి ఆహారమూ పుచ్చుకోనప్పుడు – అంటే లంఘనాల సమయాన పుచ్చుకునేది. ప్రాగ్భక్తం భుజించడానికి వెనకటి కాలం. అంటే ముందు పుచ్చుకున్న కొంతసేపటికి భుజించడం. అదోభక్తం – భోజనం కాగానే పుచ్చుకునేది. మధ్యేభక్తం – సగం భోజనం అయిన తరవాత పుచ్చుకుని తరవాత తక్కిన సగం భోజనమూ చెయ్యడం. అంతరాభక్తం – రెండు భోజనాలకు మధ్య పుచ్చుకునేది. సభక్తం – భోజనం చేస్తూ చేస్తూ పుచ్చుకునేది. సాముద్గం – భోజనానికి ముందూ వెనకా పుచ్చుకునేది. గ్రాసం – ముద్దతో కలిపి పుచ్చుకునేది. ముహూర్ముహుపు – భోజనం చేసినా చెయ్యకపోయినా మాటిమాటికీ ఔషధం పుచ్చుకోడం. గ్రాసాంతరం – ముద్దకీ ముద్దకీ మధ్య పుచ్చుకునేది.

నిర్భక్తం చాలా పనిచేస్తుంది. ప్రాగ్భక్తం త్వరగా జీర్ణం అవుతుంది. బలమున్నూ చేస్తుంది. అధోభక్తం ఊర్ధ్వకాయాశ్రితాలైన రోగాలు పోగొడుతుంది. బలమున్నూ చేస్తుంది. మధ్యేభక్తం శరీరం మధ్యభాగాన వుండే రోగాలు పోగొడుతుంది. అంతరాభక్తం హృదయానికి బలం చేస్తుంది. మనోబలమున్నూ కలిగిస్తుంది. ఆకలి పుట్టిస్తుంది. సభక్తం దుర్బలులకూ, సజలులకూ, పిల్లలకూ, మంచిపని చేస్తుంది. సాముద్గం మలబంధం పోగొడుతుంది. అగ్నిదీప్తి కలిగిస్తుంది. ముహూర్ముహుపు శ్వాసకాసలు, దప్పిక, ఛర్ది తగ్గిస్తుంది. గ్రాసాంతరం కుష్ఠు ప్రమేహాలు పోగొడుతుంది.

**మతాంతరం:** కించిత్సూర్యోదయం, దివస భోజనం, సాయంత్రంభోజనం, ముహూర్ముహుపు, రాత్రి – అని ఔషధం సేవించవలసిన సమయాలైదు.

కించుత్సూర్యోదయం అంటే ప్రాతఃకాలం. పిత్తమూ కఫమూ ప్రకోపించివున్నప్పుడూ, విరేచనాలకూ, వాంతికీ సాధనం చేసుకోవాలన్నా, లేఖనౌషధాలు పుచ్చుకోవాలన్నా, ఔషధం పుచ్చుకోవలసిన సమయం.

దివసభోజనం, పగటిభోజనం, అనగా దినానికి మొదటి భోజనం చేసే సమయం అపానవాతం యెక్కువగా వుండినా, అరోచక వ్యాధి ఉండినా, ఔషధం భోజనం ప్రారంభించగానే పుచ్చుకోవాలి. సమానవాతం ప్రకోపించివుండినా, అగ్నిమాంద్యం వుండినా, భోజనం సగం అయిన తరవాత ఔషధం పుచ్చుకోవాలి. వ్యానవాతం ప్రకోపించివుంటే భోజనం కాగానే ఔషధం పుచ్చుకోవాలి. ఎక్కిళ్ళు, ఆక్షేపకవాతం, కంపవాతం – ఈ వ్యాధులుంటే భోజనానికి ముందూ వెనకా కూడా, ఔషధం పుచ్చుకోవాలి.

సాయంత్రం భోజనం, సాయంకాలం భోజనం చేసే సమయం. అంటే రెండో భోజనకాలం. ఉదానవాతం ప్రకోపించి వుండి, స్వరభంగం మొదలైన వ్యాధులు సంభవించివుండినప్పుడు ముద్ద ముద్దకూ మధ్య ఔషధం పుచ్చుకోవాలి. ప్రాణవాతం ప్రకోపించి వుంటే భోజనం కాగానే పుచ్చుకోవాలి.

ముహూర్ముహుపు. అంటే మాటిమాటికీ ఔషధం పుచ్చుకోడం. దప్పిక, ఛర్ది, ఎక్కిళ్ళు, శ్వాస, విషవ్యాపత్తు – ఈ బాధలుంటే మాటిమాటికిన్నీ, అన్నంతో కూడానూ ఔషధం పుచ్చుకోవాలి.

రాత్రి అంటే పరుండబోయే సమయం.

ఊర్ధ్వ జత్రవ్యాధులుండినా, లేఖనౌషధాలూ, బృంహణౌషధాలూ, శమనౌషధాలూ పుచ్చుకోవలసివుండినా ఈ సమయంలో పుచ్చుకోవాలి.

**ఔషధగంధి** – వాసన చూస్తే జ్వరాదికం కలిగించే ఓషధి.

**ఔషధవీర్యం** – ఉష్ణవీర్యం (వేడిచేస్తుంది), శీతవీర్యం (చలవచేస్తుంది) – అని ఇది రెండు విధాలు. మతాంతరం ప్రకారం, ఇది శీతం, ఉష్ణం, రూక్షం, స్నిగ్ధం, మృదు, పిచ్ఛిలం, తీవ్రం, విశదం అని యెనిమిది విధాలు.

**ఔషధవీర్య హీనకాలం** – ఓషధులు యథా రూపంగా వుంటే ఒక్క సంవత్సరం దాటాక వీర్యహీనా లయిపోతాయి. చూర్ణం రెండు మాసాల అనంతరమూ, వటికలు, గుటికలు, లేహ్యాలు సంవత్సరం తరవాతనూ, ఘృతమూ తైలమూ నాలుగుమాసాల అనంతరమూ లఘుపాకసిద్ధాలైనవి సంవత్సరం తరవాతనూ హీనవీర్యాలయి పోతాయి. ఆసవారిష్టాలు, భస్మాలు, రసౌషధాలు – ఇవి మాత్రం ఎన్నిటికీ చెడిపోవు. అంటే ఎంత కాలం వుండినా వీటికి వీర్యహాని సంభవించదు. పైపెచ్చు, పాతగిల్లినకొద్దీ యివి ఎక్కువ పని చేస్తాయి. అందుకు తగ్గట్టు, తయారైన వెంటనే ఇవి వాడడం అంత మంచిది కాదు. కొంచెమయినా మాగిన తరవాత వాడితే బాగా పనిచేస్తాయి.

**ఔషధాలయం** – అంటే చికిత్సాశాల. రోగులకు సకల సౌకర్యాలూ పుష్కలంగా వుండేటట్టు వైద్యుడు ప్రత్యేక గృహం ఏర్పాటు చేసుకోవాలి. ఇది చాలా ముఖ్యమైన విషయం. దీనిని నిర్మించడానికి వాస్తుశాస్త్రం క్షుణ్ణంగా తెలిసిన శిల్పిని ఏర్పాటు చేసుకోవాలి. ఈ గృహం చాలా దృఢంగా వుండాలి. ఒక పక్క గాలి లేకుండేటట్టూ, మరొకపక్క గాలి ఎక్కువగా ఉండేటట్టూ ఉండాలి. ఇటూ అటూ తిరగడానికి బాగా విశాలంగా వుండాలి. గాలీ వెలుతురూ అడ్డగించే పెద్ద పెద్ద కట్టడాలు వగైరాలు ఆ ప్రాంతంలో ఎక్కడా వుండగూడదు. పొగ, ఎండ, నీరు, దుమ్ము – వీటివల్ల బాధ వుండగూడదు. అనిష్టం కలిగించే శబ్దస్పర్శరూప రసగంధాలున్నూ ఆ ప్రాంతంలో వుండరాదు. మంచినీరు, పానపాత్రలు, రోళ్ళు, రోకళ్ళు మొదలైన ఉపకరణాలన్నీ పుష్కలంగా వుండాలి. మలమూత్రవిసర్జనకూ స్నానానికీ ప్రత్యేకస్థలాలుండాలి. వంటశాలకూడా ప్రత్యేకంగా వుండాలి.

ఇలాంటిచోట వైద్యుడు రోగులకు చికిత్స చేయాలి.

**ఔషధావస్థలు** – ప్రతీ ద్రవ్యానికీ మధురాది రసమూ, గురుత్వాది గుణమూ, ఉష్ణాదివీర్యమూ, మధురాదివిపాకమూ, ప్రభావమూ. ఈ అయిదు అవస్థలూ ఉన్నాయి.

**ఔషధీపంచామృతం** – తిప్పతీగ, పల్లేరు, నేలతాడి, బోడతరం, పిల్లితేగలు – ఇవి అయిదూ ఓషధీరూప పంచామృతం.

## క

**కంకాళం** – అస్థిపంజరం.

**కంటకత్రయం** – వాకుడు, పెద్దములక, పల్లేరు.

*మతాంతరం:* పెద్దములక, చిన్నములక, దూలగొండి.

**కంటకపంచమూలం** – వాకచెట్టు, పల్లేరు, ఆదొండ, ములుగోరింట, పిల్లితేగలు –

*మతాంతరం:* వాక, పల్లేరు, ములుగోరింట, పిల్లితేగలు, గెద్దగోరు.

**కంటకారీత్రయం** – పెద్దములక, దూలగొండి, తక్కోల.

*మతాంతరం:* పెద్దములక, చిన్నములక, దూలగొండి.

**కంటకారీద్వయం** – పెద్దములక, వాకుడు.

**కంఠకూలిక** – వీణ.

**కంఠఘ్నం** – కంఠానికి చెరుపుచేసేది.

**కంఠతలాసిక** – గుర్రాలనుకట్టే పగ్గం.

**కంఠపాశకం** – ఏనుగు మెడకి కట్టే పగ్గం.

**కంఠ్యం** – కంఠానికి మేలుచేసేది.

**కంఠ్యవర్గం** – స్వరం సరిచేసే కషాయద్రవ్యాలు. సుగంధి, చెరుకువేళ్ళు, యష్టిమధుకం, పిప్పళ్ళు, ద్రాక్షపండు, నేలగుమ్ముడు, పెనువేప, హంసపాది, పెద్దములక, వాకుడు.

**కండరాలు** – చేతులూ, కాళ్ళూ ముడుచుకోడానికీ, చాచుకోడానికీ వీలు కలిగించే లావుపాటి నరాలు.

**కందూఘ్నవర్గం** – దురదలు పోగొట్టే వస్తువులు. ఇవి – చందనం, వట్టివేరు, రేల, కానుగ, కొడిశపాల, ఆవాలు, యష్టిమధుకం, మానుపసుపు, తుంగగడ్డలు.

**కండోలం** – వెదుళ్ళతో నిర్మించిన గాదె.

**కందపంచకం** – తైలకంద, అహిస్నేత్రకంద, సుకంద, క్రోడకంద, రుదంతీ కంద. ఇది తామ్రమారణానికుపయోగిస్తుంది. సర్వరోగహరమున్నూ.

**కందవర్గం** – నేలగుమ్ముడు, పిల్లితేగలు, తామరతూడు, సమ్మదుంప, పరికెగడ్డ, సారకంద, మధ్వాలుకం (శిరగడం), హస్త్యాలుకం, కాష్టాలుకం (కర్రపెండలం), శంఖాలుకం, రక్తాలుకం (ఎర్రముల్లంగి), కలువదుంప, నల్లకలువదుంప.

*మతాంతరం:* కంద, పెండలం, సారకంద, నీరుల్లి, ఎర్రముల్లంగి, తాంబూల పర్ణకంద (పెండలం), హస్తికంద.

**కందవిషం** – అంటే విషవ్యాప్తాలయిన దుంపలు కొన్ని వున్నాయి. అవి – కాలకూటం, వత్సనాభం, ఆవాలు, చిత్రమూలం, కర్దమం, వైరాటకం, తుంగముస్తలు, కర్కాటకశృంగి, పుండరీకం, ముల్లంగి, హాలాహలం, మహావిషం, కర్కటకం – ఈ పదమూడు రకాల కందలలో (దుంపలలో)ను విషం వుంది.

కాలకూటకంద విషంవల్ల స్పర్శజ్ఞానం పోతుంది. వొణుకు పుడుతుంది. స్తంభమున్నూ సంభవిస్తుంది. వత్సనాభంవల్ల గ్రీవాస్తంభం, కళ్ళూ మలమూత్రాలూ పచ్చబడడం సంభవిస్తుంది. ఆవదుంప వల్ల వాతవైగుణ్యం, ఆనాహం గ్రంధులూ పుడతాయి. చిత్రమూలం వల్ల గ్రీవాదౌర్బల్యం, వాక్సంగం తటస్థపడతాయి. కర్దమం వల్ల చొంగకారడం, కళ్ళుపచ్చబడడం, విడ్భేదం కలుగుతాయి. వైరాటకంవల్ల శరీరం అంతటా పోట్లు, శిరోరోగం పుడతాయి. తుంగముస్తలవల్ల శరీర స్తంభం, వొణుకు కలుగుతాయి. కర్కాటకశృంగివల్ల శరీరం శుష్కిస్తుంది. తాపమూ, ఉదరవృద్ధీ కలుగుతాయి. పుండరీకంవల్ల కళ్ళు ఎర్రబడతాయి. కడుపు పెరిగిపోతుంది. ముల్లంగివల్ల వైవర్ణ్యం, ఛర్ది, ఎక్కిళ్ళు, ఉబ్బు, మడ్డితనం సంభవిస్తాయి. హాలాహలంవల్ల హృదయగ్రంధి, శూల, త్రేనుపులు కలుగుతాయి. కర్కటకంవల్ల గంతులు వెయ్యడం, నవ్వడం, పళ్ళుకొరకడం కలుగుతాయి.

**కందసారాలు** – అంటే దుంపలే సారమైన ద్రవ్యాలు. ఈ క్రింద చెప్పబోయే దుంపలే వాడుకునేది. మంజిష్ఠ, చెంగల్వకోష్టు, తచ్చూరాలు, నేలగుమ్ముడు, పసుపు, పొత్తిదుంప, భద్రముస్తలు, పిల్లితేగలు, పన్నరాస్న, అతివస, సుగంధి, అల్లం, నేలతాడి, వస, తుంగ, అడవికంద, తెగడ, చాగ, పుల్లబచ్చలి, పెన్నేరు, చామ, వేగిస.

**కందుపక్వం** – అంటే నీరు తగలకుండా చేసిన వంటకాలు. శూద్రులు నీళ్ళు కలవకుండా చేసిన తైలపక్వాలు బ్రాహ్మలు తినవచ్చునని ధర్మశాస్త్రవచనం.

**కంధరం** – మీగడపెరుగు చిలికి వెన్న తియ్యని మజ్జిగ.

**కంబళవాహ్యం** – ఎద్దుబండి.

**కంబుగ్రీవం** – శంకాని కున్నట్టు మూడు రేఖలు గల కంఠం. ఇదే కంబు కంఠం.

**కంపనం** – మానపరిభాష ఒక ఆఢకం. అంటే ఎనిమిది శరావాల పరిమితం

**కుంభపుటం** – ఔషధాలు వండే పుటాలలో ఇదొకటి. కుండకు అడుగు భాగాన అంగుళ పరిమాణంగల రంధ్రాలు వలభై చెయ్యాలి. కుండలో సగంవరకూ బొగ్గులుపోసి, వాటిమీద ఔషధం వుండిన శరావసంపుటం వుంచి కుండ మూసి చీలమన్ను ఇవ్వాలి. తరవాత పైమన్న మూకుడులో నిప్పులువేసి కుండ పొయ్యిమీద వుంచి మంటబెట్టాలి. ఇది మూడుదినాల వంట. తరవాత సాంగశీతలంగా తీసుకుని మందు వాడుకునేది.

**కకారపూర్వకద్రవ్యం** – అంటే కకారం మొదటగల సంస్కృతశబ్దాలతో వ్యవహరించే ద్రవ్యాలు. అవి – కటుకం, కాలిశాకం, కూష్మాండం, కర్కటి; కర్కంధు, కర్కోటకం, కలింగం, కరమర్దం, కరీరం, కతకం, కశేరు, కాంజికం – ఇవి రక్తపిత్త వ్యాధిగలవారు వర్జించాలి.

**కచ్ఛపయంత్రం** – వెడల్పయిన బాన గ్రహించి, అడుగున బిడాలవణం వేసి, దానిమీద పాదరసం ఉంచి పైని మళ్లీ బిడాలవణం వెయ్యాలి. ఆ భాగం మాత్రం మూకుడుతో మూసి ఆ ప్రాంతం చీలమన్ను పూసి బాననిండా పిడకలుచేర్చి నిప్పుపెట్టి పుటం వేసేది. ఇది రసం గంధకం జారణచెయ్యడానికి ఉపయోగించేది.

**కజ్జలధ్వజం** – దీపపు శమ్యా.

**కటు** – కారం. షడ్రసాలలో ఒకటి. ఇది తగలడంతోటే నాలుక మండుతుంది. ఉద్వేగం కలుగుతుంది. నసాళం ఎక్కుతుంది. ముక్కు స్రవిస్తుంది.

**కటుకత్రయం** – సొంటి, పిప్పలి, మిరియాలు.

**కటుకవర్గం** – కారపురుచిగల వస్తువుల సమూహం. అవి – మునగ, ఎర్రమునగ, ముల్లంగి, వెల్లుల్లి, అడవిగన్నేర, సోపు, చెంగల్వకోష్టు, దేవదారు, పర్పాటకం, కారుగచ్చ, అజామోదం, గుగ్గులు, తుంగముస్తలు, పొత్తిదుంప, కసివింద, వరగోగు – ఇత్యాది.

**కటుచాతుర్జాతం** – దాల్చిని, ఏలకులు, ఆకుపత్రికం, మిరియాలు.

**కటుచాతుర్భద్రకం** – ఏలకులు, దాల్చిని, ఆకుపత్రికం, మిరియాలున్ను.

*మతాంతరం:* ఏలకులు, దాల్చిని, ఆకుపత్రికం, మిరియాలు.

**కటుత్రయం** – సొంటి, పిప్పలి, మిరియాలు.

**కటుపంచకం** – గుర్రాలకు వడకలు వేర్పే స్థలాలు అయిదు. అవి – మండలాకారం, చతురస్రం, గోమూత్రం, అర్ధచంద్రం, నాగపాశం.

**కటువిపాకం** – వస్తువు జీర్ణమయ్యేటప్పుడు కటురసంగా పరిణమించడం.

**కట్ఫలాదిపానం** – కట్ఫలం, త్రిఫలాలు, దేవదారు, రక్తచందనం, చిట్టీత పండు, కటు కరోహిణి, పద్మకాష్ఠం, వట్టివేళ్ళు – ఇవి సమభాగాలుగా గ్రహించి చేసే కషాయం. ఇది జీర్ణజ్వరంలో మిక్కిలీ హితకరం.

**కణాదిగణం** – పిప్పళ్లు, పిప్పలిమోడి, చవ్యం, చిత్రమూలం, సొంటి, మిరియాలు, ఏలకులు, అజామోదం, కొడిశపాలవిత్తులు, పాఠ, రేణుకలు, జీలకర్ర, గంటుభారంగి, పెమవేప, ఇంగువ, గజపిప్పళ్ళు, ఆవాలు, వాయువిళంగాలు, అతివస, చాగ.

**కత్తోయం** – మద్యం.

**కథాప్రసంగుడు** – విషవైద్యుడు.

**కదుష్ణం** – గోరువెచ్చన.

**కనిష్ఠ** – చిటికెనవేలు. చిన్నది.

**కనీయః పంచమూలం** – అంటే లఘుపంచమూలం. ముయ్యాకుపొన్న, కోలపొన్న, వాకుడు, పెద్దములక, పల్లేరు.

**కపివిరోధి** – మిరియాలు.

**కపిశ/కపిశి/కపిశిక/కాపిశాయనం** – మద్యం.

**కపోతపుటం** – ఔషధ పుటాలలో ఇదొకటి. చిన్నగోతిలో ఎనిమిది పిడకలతో వేసేది.

**కఫప్రకృతి** – ఇది కలవారికి చిత్తం స్థిరంగా వుంటుంది. కేశాలు నల్లగా వుంటాయి.

**కఫసంశమనవర్గం** – కఫం తగ్గించేవి. రూక్ష క్షారకషాయతిక్త కటురసాలు, వ్యాయామం, నిష్ఠీవనం, ధూమపానం, శిరోవిరేచక వమన స్వేదాలు, ఉపవాసం, స్త్రీసేవ, నడక, జాగరణం, జలక్రీడ, మైథునం – ఇలాటి పనులవల్ల కఫం తగ్గిపోతుంది.

**కరకాజలం** – ఆకాశాన, వాయ్వగ్నిసంయోగం వల్ల నీరు రాయికట్టి, ముక్కలు ముక్కలుగా భూమిమీద పడుతుంది. ఆ ముక్కలే వడగళ్ళు. వాటివల్ల పుట్టిన జలం ఇది. ఆకాశ జలంలో ఇదొకరకం.

**కరంజద్వయం** – కానుగుచెట్లలో రెండు రకాలున్నాయి. ఒకటి చిరిబిల్వం. రెండోది కంటుకీవిటపికరంజం. చిరిబిల్వానికే పూతికరంజం అని పేరు. కంటకీవిటపికరంజమే నక్తమూలం.

**కరణత్రాణం** – శిరస్సు.

**కరమధ్యం** – మానపరిభాష. ఒక కర్షం.

**కర్ణపూరణం** – చెవిలో నూనె పోసుకోవడం.

**కర్ణవ్యధ** – ఆభరణాలు ధరించడానికి చెవులు కుట్టడం. ఇది శిశువుకు ఆరోనెలలోనో, ఏడోనెలలోనో చెయ్యాలి.

**కర్మ** – ఒక కార్యం నెరవేర్చడానికి తగిన అంగికాదిచేష్టారూపమైన వ్యాపారం. పని.

**కర్మవస్తి** – అంటే, వరాసగా ముప్ఫయిమాట్లు చేసే వస్తికర్మ. మొదట ఒక స్నేహవస్తి. తరవాత ఒక అనువాసనవస్తి. దాని తరవాత నిరూహవస్తి. ఒకదాని తరవాత ఒకటి చొప్పున అనువాసనవస్తి నిరూహవస్తి ఇరవై నాలుగుమాట్లు. చివరికి అయిదు స్నేహవస్తులు – ఇవన్నీ కలిసి కర్మవస్తి.

**కర్మసహప్రకృత్తు** – అనేక కార్యాలు చేసేది.

**కర్మేంద్రియం** – పనిచెయ్యడాని కనువైన ఇంద్రియం. ఇవి అయిదు. అవి – వాక్కు, పాణి, పాదం, పాయువు, ఉపస్థ.

**కర్మేంద్రియ విషయాలు** – కర్మేంద్రియాలు అయిందిటికీ – అనగా, వాక్కునకు సంభాషణ, హస్తానికి గ్రహణం, ఉపస్థకు ఆనందం,

సుదానికి మలోత్సర్జనం, పాదానికి గమనం – ఇవి విషయాలు.

**కర్షం** – మానపరిభాష. రెండు తులాలు.

**కర్షార్థం** – మానపరిభాష. ఒక తులం.

**కర్షూస్వేదం** – స్వేదకర్మలలో ఇదొకటి. మనిషి పొడుగున ఒక గుంట తవ్వాలి. దాని అడుగు వెడల్పుగానూ, పైభాగం సన్నంగానూ వుండాలి దానినిండా మంచి కట్టెలుపేర్చి నిప్పు పెట్టాలి. కొంత సేపటికి పొగ మంట తగ్గి బొగ్గులు కణకణలాడుతూ వుంటాయి. అప్పుడు ఆ గోతిమీద నులకమంచంవేసి రోగిని, శరీరం అంతా వాతహరతైలం పట్టించి దానిమీద పడుకోబెట్టి కిందాపైనీ గుడ్డలు కప్పేది. బాగా చెమటపట్టి దోషాలు తగ్గిపోతాయి. ఇది కర్షూస్వేదం.

**కలలు** – రసాదిధాతువులకు మధ్యభాగాన ద్రవరూపంగా వుండి శరీరోష్ణంవల్ల పక్వం అయి వుండేవి కలలు.

**కళస** – మానపరిభాష. ఒక ద్రోణం పరిమాణం.

**కల్లత** – చెముడు.

**కల్యం** – రోగవిముక్తి.

**కల్యజగ్ధి** – ప్రాతఃకాలభోజనం.

**కవచీయంత్రం** – ఔషధాలువండే గాజుకుప్పెలలో ఒకరకం.

**కవలం** – గండూషాలలో ఇదొక రకం. నోరు మెదపడానికి వీలుండేటట్టు నూరిన మూలికల ముద్ద. (కల్కం) నోటమంచుకుని పుక్కిలించడం కవలం.

**కవలగ్రహం** – మానపరిభాష. ఒక కర్షం.

**కవోష్ణం** – గోరువెచ్చన.

**కషాయజలం** – జువ్వి, రావి, మేడి, దిరిసెన, మర్రిపట్టలతో కాచిన కషాయజలం.

**కషాయనిత్యుడు** – నిత్యమూ కషాయం ఎక్కువగా సేవించేవాడు.

**కషాయపంచకం** – కషాయాలు – స్వరసం, కల్కం, శృతం, శీతం, ఫాంటం అని అయిదు విధాలు. ఈ కషాయాలలో లవణరసం తప్ప తక్కిన అయిదు రసాలూ ఉత్పత్తి కారణాలయి యుంటాయి. వీటిలో పూర్వ పూర్వం మిక్కిలీ బలాధికం – అనగా, ఫాంటంకంటే శీతమూ, శీతంకంటే శృతమూ, శృతం కంటే కల్కమూ, కల్కంకంటే స్వరసమూ బలమైనవి.

**మతాంతరం:** ఈ కషాయపంచకం విషయమై మరొక సిద్ధాంతంకూడా వుంది. దానినిబట్టి పంచకషాయాలూ స్వరసం, కల్కం, క్వాథం, హిమం, ఫాంటం – అని నిర్ధారించబడింది.

కషాయాలు అయిదు కాదు, ఏడు. ఇది చరకసిద్ధాంతం. సేకకషాయం, స్నేహకషాయం, పానకషాయం, వ్రణకషాయం, ఆశ్చ్యోతన కషాయం, గండూషకషాయం, నిరూహకషాయం – అని. వీటిలో సేకకషాయం సగపాలు మిగిలేటట్టూ, స్నేహకషాయం నాలుగో భాగం మిగిలేటట్టూ, పానకషాయం ఎనిమిదో వంతు మిగిలేటట్టూ, వ్రణకషాయం పదహారో పాలు మిగిలేటట్టూ, ఆశ్చ్యోతనకషాయం అయిదో వంతు మిగిలేటట్టూ, గండూషకషాయం ఆరో భాగం మిగిలేటట్టూ నిరూహకషాయం ముప్పయి రెండో పాలు మిగిలేటట్టూ కాచాలి.

అయితే, కషాయాలు ఏడు అన్న సిద్ధాంతంలోకూడా మతాంతరం వుంది. అవి – పాచనకషాయం, శోధనకషాయం, క్లేదన కషాయం, నావన కషాయం, దీపనకషాయం, తర్పణకషాయం, శోషణకషాయం – అని. వీటిలో, పాచనకషాయం భుజించిన ఆహార ద్రవ్యాలు పచనం అయేటట్టు చేస్తుంది. ఇది సగం మిగిలేటట్టు కాచాలి. శోధనకషాయం మలాదులను శోధిస్తుంది. ఇది పన్నెండో వంతు మిగిలేటట్టు కాచాలి. క్లేదనకషాయం ద్రవం పుట్టిస్తుంది. ఇది నాలుగో పాలు మిగిలేటట్టు కాచాలి. నావనకషాయం నస్యాని కుపయోగిస్తుంది. ఇది యెనిమిదో వంతు మిగిలేటట్టు కాచాలి. దీపనకషాయం అగ్నిదీప్తి కలిగిస్తుంది. ఆరోపాలు మిగిలేటట్టు కాచాలి. తర్పణకషాయం తృప్తి కలిగిస్తుంది. అయిదోభాగం మిగిలేటట్టు కాచాలి. శోషణకషాయం శోషింపచేస్తుంది. ఇది పదహారో వంతు మిగిలేటట్టు కాచాలి.

కషాయాలు ఏడున్నూ కాదు, పధ్నాలుగు. ఇది భోజుని మతం. అవి – పానకషాయం, గండూషకషాయం, పానీయకషాయం, సేక కషాయం, ఆశ్చ్యోతనకషాయం, వ్రణప్రక్షాళన కషాయం, ముఖప్రక్షాళనకషాయం, ఉష్ణోదకకషాయం, ఆస్థాపనకషాయం, వమనకషాయం,

విరేచనకషాయం, స్నానకషాయం, యవాగూ కషాయం, స్నేహకషాయం – అని.

ఇవి తయారుచేసే పద్ధతి. పానకషాయానికి – ఔషధద్రవ్యం ఒక పలం. నీరు ఇరవైనాలుగు పలాలు. ఎనిమిదో వంతు మిగిలేటట్టు కాచాలి.

**గండూషకషాయానికి** – ఔషధద్రవ్యం ఒక వంతు. నీరు నాలుగురెట్లు. అయిదోవంతు మిగిలేటట్టు కాచాలి.

**పానీయ కషాయానికి** – ఔషధద్రవ్యం కర్షం. నీరు అర్ధప్రస్థం.

నాలుగోవంతు మిగిలేటట్టు కాచాలి.

**సేకకషాయానికి** – ఔషధద్రవ్యం ఒక వంతు. నీరు నాలుగురెట్లు. ఎనిమిదో వంతు మిగిలేటట్టు కాచాలి.

**ఆశ్చ్యోతనకషాయానికి** – ఔషధద్రవ్యానికి ఆరురెట్ల నీరుచేర్చి, ఆరోవంతు మిగిలేటట్టు కాచాలి.

**వ్రణప్రక్షాళనకషాయానికి** – ద్రవ్యానికి మూడురెట్ల నీళ్ళుపోసి, పన్నెండోవంతు మిగిలేటట్టు కాచాలి.

**ముఖప్రక్షాళనకషాయానికి** – ద్రవ్యానికి మూడురెట్ల నీళ్లుపోసి, పన్నెండోవంతు మిగిలేటట్టు కాచాలి.

**ఆస్థాపనకషాయానికి** – ద్రవ్యానికి ఆరు రెట్ల నీరు. ఏడోవంతు మిగిలేటట్టు కాచాలి.

**వమనకషాయానికి** – ద్రవ్యానికి మూడురెట్ల నీరు. సగం మిగిలేటట్టు కాచాలి.

**విరేచనకషాయానికి** – ద్రవ్యానికి ఆరురెట్ల నీరు. ఎనిమిదో వంతు మిగిలేటట్టు కాచాలి.

**స్నానకషాయానికి** – ద్రవ్యానికి ఇరవై నాలుగురెట్లు నీరు. సగం మిగిలేటట్టు కాచాలి.

**యవాగూకషాయానికి** – ద్రవ్యానికి ఇరవైనాలుగురెట్ల నీరు. ఎనిమిదోవంతు మిగిలేటట్టు కాచాలి.

**స్నేహకషాయానికి** – ద్రవ్యానికి నాలుగురెట్ల నీరు. నాలుగో వంతు మిగిలేటట్టు కాచాలి.

**కషాయపాత్ర** – కషాయాలు కాచడానికి బంగారపుపాత్ర మిక్కిలీ శ్రేష్ఠం. ఇది విషం హరిస్తుంది. వెండిపాత్ర మధ్యమం. ఇది బలం కలిగిస్తుంది.

రాగిపాత్ర నిషిద్ధం. మట్టిపాత్ర నింద్యంకాదు, వాడవచ్చు.

**కషాయయోని** – అంటే కషాయజాతి. ఇది మధురకషాయం, ఆమ్లకషాయం, కటుకషాయం, తిక్తకషాయం, కషాయకషాయం – అని అయిదు విధాలు.

**కషాయవర్గం** – కషాయరసంగల ద్రవ్యాల సమూహం. అవి త్రిఫలాలు. ఏపి చెట్టుపట్ట, నేరేడు, మామిడి, పొగడ, తిందుకం, న్యగ్రోధాదులు, అంబష్ఠాదులు, ప్రియంగ్వాదులు, లోధ్రాదులు, శాలిసారాదులు, ఇండుగుచెట్టు, కొండపిండిచెట్టు, కురవకం, కోవిదారం, జీవంతి, పాలంకి, సునిషణ్ణాదులు, నీవారాదులు, పెసలున్నూ.

**కక్షాంతరం** – గర్భగృహం.

**కక్షాపటం** – కౌపీనం, గోచి.

**కాంచి** – మొలనూలు, ఒకపోగుదారంతో తయారుచేస్తే కాంచి. ఎనిమిది పోగులతో అయితే మేఖల. పదహారు పోగులది రసన. ఇరవై అయిదు పోగులది కలాపం.

**కాండపటం** – తెర.

**కాంస్యపాత్ర** – మానపరిభాష. ఆఢకపరిమాణం.

**కాకనిద్ర** – అల్పనిద్ర.

**కాకవంధ్య** – ఒక్క సంతానమే కన్న స్త్రీ.

**కాచభాజనం** – గాజుపాత్ర.

**కాదంబరం/కాదంబరి** – నానావస్తువులతోనూ తయారుచేసిన మద్యం.

**కాపిశాయనం** – మద్యం.

**కామయాన** – గర్భిణి.

**కామమలోలుపుడు** – సద్వైద్యుడు.

**కాయం** – శరీరం. ఇది సాత్త్వికం, రాజసం, తామసం అని మూడు విధాలు. వాటిలో, సాత్త్వికం – బ్రాహ్మణం, మహేంద్రం, వారుణం, కౌబేరం, గాంధర్వం, యామ్యం, ఋష్యం – అని ఏడువిధాలు. రాజసం – ఆసురం, సార్పం, శాకునం, రాక్షసం, పైశాచం, ప్రేతం – అని ఆరు విధాలు. తామసం – పాశవం, మాత్స్యం, వానస్పత్యం అని మూడు విధాలు.

**కాయచికిత్స** – చికిత్సాశాస్త్రానికి సంబంధించిన అష్టాంగాలలో ఇదొకటి. సర్వాంగవ్యాధులూ

– అంటే, జ్వరం, అతిసారం, రక్తపిత్తం, శోష, ఉన్మాదం, అపస్మారం, కుష్ఠు, ప్రమేహం – ఇత్యాదులకు సంబంధించిన చికిత్సాక్రమం ఈ భాగంలో వుంటుంది.

**కారణం** – రోగహేతువు. ఇది సన్నికృష్టం, విప్రకృష్టం అని రెండు విధాలు. వాతప్రకోపం మొదలైనవి సన్నికృష్టం, విరుద్ధాహారాదికం విప్రకృష్టం.

**కార్యద్వేషం** – అలసభావం. సోమరితనం.

**కార్షాపణం/కార్షికం** – మానపరిభాష. ఒక కర్షం.

**కాలచక్రం** – నిమిషాలు మొదలు మహాయుగాలవరకూ గల కాలం ఎల్లప్పుడూ చక్రంలాగ పరివర్తనం చెందుతూ వుంటుంది. అంటే తిరుగుతూ వుంటుంది. కనక, దానికి కాలచక్రం అనిపేరు. లేక ఆరు ఋతువుల రూపమైన – అంటే, వసంతం, గ్రీష్మ, వర్ష, శరత్, హేమంత, శిశిర ఋతురూపమైన సంవత్సరం, ఋతువులు సంవత్సరం అనే చక్రానికి ఆకులన్నమాట.

**కాలజబలం** – త్రివిధ బలాలలో ఇదొకటి. ఋతుధర్మాల ననుసరించీ వయోవ్యవస్థల ననుసరించీ కలిగే బలం కాలజం.

**కాలత్రయం** – భూత భవిష్యద్వర్తమానాలు.

**కాలప్రభాతం** – శరదృతువు.

**కాలబలప్రవృత్తం** – ఆధిదైవికరోగం. అది శీతోష్ణవాత వర్షాదులవల్ల వస్తుంది. వ్యాపన్నర్తుకృతం, అవ్యాపన్నర్తుకృతం అని అది రెండు విధాలు.

**కాలమానం** – కాలసంబంధమైన పరిమాణం. 18 నిమిషాలొక కాష్ఠ. 30 కాష్ఠలొక కల. 30 కలలొక క్షణం. 12 క్షణాలొక ముహూర్తం. 30 ముహూర్తాలొక దినం. అంటే రాత్రింబగళ్ళు. 15 దినాలొక పక్షం. 2 పక్షాలొక మాసం. 2 మాసాలొక ఋతువు. 6 ఋతువులొక సంవత్సరం. ఇత్యాది.

**కాలవస్తి** – వర్షాది ఋతువులలో వాతాద్యుపశమనం కోసం చేసే వస్తికర్మ. మొదట ఒక స్నేహవస్తి చేసేది. తరవాత ఒక నిరూహవస్తి చేసేది. మళ్ళీ స్నేహవస్తి. మళ్ళీ నిరూహవస్తి. ఇలాగ ఒకటి తరువాత ఒకటిగా స్నేహవస్తీ నిరూహవస్తీ మొత్తం పన్నెండు చేసేది. చివర వరాసగా మూడు స్నేహవస్తులు చేసేది. చివరికి వస్తుల సంఖ్య పదిహేను. ఇవన్నీ కలిసినదానికే కాలవస్తి అనిపేరు.

**కాలశేయం** – ఒక పాలు నీళ్ళు, మూడు పాళ్ళు పెరుగున్నూ కలిపి చేసిన మజ్జిగ.

**కాలసంకర్ష** – తొమ్మిది సంవత్సరాల వయస్సుగల కన్య.

**కాలాంతరప్రాణహరమర్మలు** – ఇవి వక్షో మర్మలు, సీమంతాలు, తల హృదయాలు, క్షిపాలు, ఇంద్రవస్తులు, కటీకతరుణాలు, పార్శ్వ సంధులు, బృహతులు, నితంబాలు – అవి ముప్ఫయిమూడు. వీటిమీద దెబ్బ తగిలితే మెల్లిగా కాలాంతరాన ప్రాణాపాయం సంభవిస్తుంది.

**కాళింగమానం** – ఔషధాలు తయారుచెయ్యడానికీ, వాడడానికీ కళింగ దేశంలో వాడుకలో వుండిన మానం. ఇది 12 ఆవాలు ఒక యువ. 2 యువ లొక గుంజ, 3 గుంజ లొక వల్లం. 8 గుంజ లొక మాషం. 4 మాషా లొక శాణం లేక, నిష్కం లేక, టంకం. 6 మాషా లొక గద్యాణం. 10 మాషాలొక కర్షం. 4 కర్షా లొక ఫలం.

*సర్షపాదిమానం: 8 ఆవాలొక యవ. 2 యవలొక రక్తి. 2 రక్తులొక వల్లం. 4 వల్లాలొక మాషం. 4 మాషాలొక శాణం. 2 శాణాలొక కర్షం. 2 కర్షాలొక శుక్తి. 2 శుక్తులొక పలం. 2 పలాలొక ప్రసృతి. 2 ప్రసృతులొక కుడవం. 2 కుడవాలొక మానిక. 2 మానిక లొక ప్రస్థం. 4 ప్రస్థాలొక ఆఢకం. 4 ఆఢకా లొక ద్రోణం. 2 ద్రోణాలొక శూర్పం. 2 శూర్పాలొక భారిక. 100 పలా లొక తుల. 20 తుల లొక భారం.*

*పరమాణ్వాదిమానం: 30 పరమాణువు లొక త్రసరేణువు. 6 త్రసరేణువులొక మరీచి. 6 మరీచు లొక రాజిక. 3 రాజిక లొక సర్షపం (ఆవగింజ). 8 ఆవాలొక యవ. 4 యవలొక గుంజ. 5 గుంజలొక పణం. 6 గుంజలొక మాషం. 4 మాష లొక శాణం (అరతులం). 2 శాణాలొక కోలం. అంటే ఒక తులం. 2 కోలాలొక కర్షం. 2 కర్షాలు అర్ధపలం. 4 కర్షాలొక పలం. 2 పలాలొక ప్రసృతి. 2 ప్రసృతులొక కుడవం. 2 కుడవాలొక మానిక. 2*

మానికలొక ప్రస్థం. 4 ప్రస్థాలొక ఆఢకం. 4 ఆఢకాలొక కలశం. 2 కలశలొక శూర్పం. 2 శూర్పాలొక ద్రోణం. 2 ద్రోణాలొక ఖారి. 100 పలాలొక తుల. 2000 పలాలొక భారం.

వ్రీహ్యాదిమానం: 4 వీహాలు ఒక గుంజ. 5 గుంజలొక పణం. 8 పణాలొక ధరణం. 2 ధరణాలొక కర్షం. 4 కర్షాలొక పలం. 100 పలాలొక తుల. 20 తులలొక భారం.

**కాశి** – ధన్వంతరి తండ్రి సుహోత్రుడు.

**కాశికాప్రియుడు** – దివోదాసుడైన ధన్వంతరి.

**కాశీరాజు** – ధన్వంతరి.

**కాశ్మీరజం** – కుంకుమపువ్వు.

**కాష్ఠ** – కాలపరిమాణం – 30 కలలు.

**కాష్ఠమయి** – శవదహనస్థానం. శ్మశానం.

**కాష్ఠమల్లం** – శవయానం.

**కాసఘ్నధూపం** – అయిదురకాల ధూమపానాలలో ఇదొకటి. ఇది పీలిస్తే కాస తగ్గిపోతుంది. ఇందులో పడే వస్తువులు పెద్దములక, వాకుడు, సొంటి, పిప్పళ్ళు, మిరియాలు, కసింతాకు, ఇంగువ, గొరపట్ట, మణిశిల. ఇవి కల్కంచేసి వర్తిచేసి ధూమపానవిధిగా ఉపయోగించేది.

**కాసమర్దగుటిక** – సంభారం చూడు.

**కాసహరవర్గం** – ద్రాక్షపండు, కరక్కాయ, ఉసిరికపప్పు, పిప్పళ్ళు, దూలగొండి, కర్కాటకశృంగి, వాకుడు, తెల్లగలిజేరు, గలిజేరు, నేల ఉసిరిక.

**కాసీసత్రితయం** – కాసీసం, ధాతుకాసీసం, పుష్పకాసీసం.

**కాసీసద్వయం** – ధాతుకాసీసం, పుష్పకాసీస మున్నూ.

**కించిత్తు** – నాలుగోవంతు.

**కించిత్పాణి** – మానపరిభాష. ఒక కర్షం.

**కింశుకాదిగణం** – త్రిదోషాలూ హరించే వస్తుగణం. మోదుగు, పెద్దముల్లుడు, సొంటి, కూరనెల్లి, పల్లేరు, శ్యోనాకం, శాలిపర్ణి, సింహపుచ్ఛీద్వయం, పాటల, వాకుడు, మారేడు, పెద్దములక, మాషపర్ణి.

**కిట్టవర్జితం** – శుక్రం.

**కుండలిక** – పాముచుట్టలాగ వుండే పిండివంట. జిలేబీ.

**కుంభసర్పి** – నూటపదకొండు సంవత్సరముల నాటి నెయ్యి.

**కుంభీపుటం** – గజపుటం.

**కుంభీస్వేదం** – వాతహరద్రవ్యాలతో కషాయం చేసి ఒక కుండ నిండించి మూడో వంతు భాగం పైకి ఉండేటట్టు భూమిలో పాతిపెట్టాలి. దానిమీద మలకమంచంవేసి, పల్చని పక్కవేసి, రోగికి శరీరం అంతటా వాతహరతైలం పట్టించి దానిమీద పడుకోబెట్టి పైని బట్టలు కట్టాలి. తరవాత, ఇనపగుళ్ళయినా, రాతిముక్కలయినా ఎర్రగా కాల్చి కుండలో వేస్తూవుండాలి. దాంతో ఉక్క బయలుదేరి రోగికి చక్కగా చెమటపడుతుంది. ఇది కుండతో చేసేది కనక, కుంభీస్వేదం.

**కుక్కుటపుటం** – ఔషధపుటాలలో ఇదొకటి. మూరెడు గోతిలో పది ఏరుపిడకలతో వేసేది. ఆరు ఘన అంగుళాలలో వేసే పుటం అని మతాంతరం.

**కుక్కుటపుటభావన** – రెండుపలాల ద్రవద్రవ్యంతో నూరి కుక్కుట పుటం వేసేది.

**కుక్కుటాండకపాలం** – కోడిగుడ్డు డొలక.

**కుటీ ప్రావేశికం** – రసాయన చికిత్సలో కుటీ ప్రావేశికమనీ, వాతాత పికం అనీ రెండువిధాలున్నాయి. అయితే, వాతాత పికం కంటే కుటీ ప్రావేశికం గొప్పది. వాతాత పికం సామాన్యం.

పట్టణం బయట, ఉత్తరదిక్కున గాలి తక్కువగా వుండేచోట, భయం లేనిచోట ఒక మేడ కట్టుకోవాలి. అది త్రిగర్భగా వుండాలి. అంటే, మొదట వొక గృహం. దానిలో మరో గృహం. అందులో ఇంకో గృహం. వాటికి కిటికీలు చాలా చిన్నవిగా వుండాలి. పొగ, ఎండ, దుమ్ము, పాములు, మూర్ఖులు – వీటి కది దూరంగా వుండాలి. వైద్యోపకరణాలన్నీ అందులో సమృద్ధిగా వుండాలి. అలికి ముగ్గులు తీర్పించుకుని రోగి అందులో ప్రవేశించి చికిత్స పొందాలి.

**కుటీస్వేదం** – కుటి అంటే గుడిసె. దానిగోడలు దళసరిగా ఎత్తుగా వుండాలి. ఒక్కటే ద్వారం ఉండాలి. కిటికీ ఉండగూడదు. గోడలకు లోభాగాన, చెంగల్వకోష్ఠు సుగంధద్రవ్యాలూ నూరి వెల్లవేసినట్టు పూసి వుంచుకోవాలి. గుడిసెమధ్యగా దుప్పటి, జింకతోలు, పట్టుబట్టలు, కంబళ్ళు – వీటితో శయ్య సిద్ధం

చేసుకోవాలి. పొగలేకుండా కణకణలాడే బొగ్గు నిప్పులతో నిండివున్న కుంపట్లు పక్కచుట్టూ వుంచాలి. తరవాత శరీరం అంతటా వాతహరతైలంపూసి రోగిని ఆ పక్కమీద పడుకోబెట్టి బట్ట కప్పాలి. దాంతో సుఖంగా చెమటపట్టి వ్యాధి తగ్గిపోతుంది.

కుడవం – మానపరిభాష. 32 తులాల పరిమితి.

కుణపగంధం – శవంవాసన.

కుతపకాలం – మధ్యాహ్నం.

కుధాన్యం – అంటే క్షుద్రధాన్యం. ఇదొక వర్గం. కోర, ధూషక, శ్యామాక, నీవార, శాంతను, తువరక, ఉద్దాలక, ప్రియంగు, మధులిక, నందీముఖ, కురువింద, గవేధుక, వరుక, ఉదపర్ణి, ముకుంద, రేణుజ – ఇవి ఈ వర్గంలోవి.

కుపథ్యం – అపథ్యం.

కుప్యశాల – ధాతుద్రవ్య నిర్మాణశాల.

కుల్య – మానపరిభాష. ఎనిమిది ద్రోణాలు.

కుశద్వయం – స్థూలదర్భ, సూక్ష్మదర్భ.

కుష్ఠఘ్నవర్గం – కుష్ఠ పోగొట్టే ఓషధుల వర్గం. ఓషధులు – చంద్ర, కరక్కాయ, ఉసిరికాయలు, పసుపు, నల్లజీడిగింజలు, సప్తపర్ణి, రేల, కరవీరం, వాయువిడంగాలు, జాజిచిగుళ్ళున్ను.

కుసుమతి – రజస్వల అయిన స్త్రీ.

కూలేచరం – జలప్రాంతంలో సంచరించే జంతువర్గం. ఇవి లులాయ, గండ, వరాహ, చమరీ, వారణ అని అయిదు రకాలు. సుశ్రుతుడు చెప్పిన కూలేచరాలు వేరు. అవి గజ, గవయ, మహిష, రురు, చసుర, సృమర, రోహిత, వరాహ, ఖంగి, గోకర్ణ, కాలపుచ్ఛ, కోద్ర, న్యంకు, వనగవయ – ఇత్యాదులు.

కూపస్వేదం – మంచమంత వైశాల్యం, అంతకు రెట్టింపులోతు ఉండేటట్టు గొయ్యి తవ్వి, శుభ్ర పరచి; గుర్రం, ఆవు, గాడిద, లొట్టిపిట్ట – వీటి లద్దెలతో నింపి, దానికి నిప్పుపెట్టి, పొగ మంట తగ్గిపోయిన తరవాత ఒక నులకమంచం గోతిమీద వేసి, దానిమీద కొద్దిపాటి పక్క వేసేది. తరవాత, రోగిని శరీరం అంతటా వాతహర తైలం పూసి దానిమీద పడుకోబెట్టి పైని బట్టకప్పి వుంచేది. చక్కగా చెమటపట్టి వ్యాధి తగ్గిపోతుంది. నూతివంటి గోతిమీద చేసే క్రియ కనక ఇది కూపస్వేదం.

కృచ్ఛ్రసాధ్యం – అసాధ్యంలో లెక్క. చాలా కష్టంమీద తగ్గితే తగ్గవచ్చు. రోగికీ చికిత్సకునకూ గూడా చాలా దీక్ష వుండాలి.

కృతాన్నం – ఒబ్బు మొదలైన పిండివంటలు.

కృష్ణాదిగణం – పిప్పళ్ళు, చిత్రమూలం, పిప్పలి మూలం, అగ్నిసరం, ముంజిష్ఠ, తుంగముస్తలు. గ్రంధికం, ఏలకులు, అతివస, రేణుకలు, సొంటి, పిప్పళ్ళు, మిరియాలు, వాము, ద్రాక్షపండు, జీలకర, మారేడు, నేలవేము, చందనం, గంటు భారంగి, సుగంధి, కరక్కాయ, ఉసిరికపప్పు, తాడికాయ, చాగచెక్క, జీలకర్ర – ఇవి.

కృసరం – నువ్వులూ పరిబియ్యమూ సమంగా కలిపి వండిన అన్నం.

మతాంతరం: నువ్వులు, మినపపప్పు, నెయ్యి – ఈ మూడూ చేర్చివండిన పులగం.

కేశచ్ఛిత్తు – మంగలి.

కేశయంత్రం – ఉపవిషాదులు శోధించే యంత్రం.

కైశోరం – పదకొండు – పదిహేను సంవత్సరాల మధ్య వయస్సు.

కోటరి – వస్త్రస్త్రీ.

కోష్ఠాగ్ని – ఆమాశయంలోవుండే అన్నద్రవ్యం పచనంచేసే జఠరాగ్ని. ఇదే పాచకాగ్ని.

కోలం – మానపరిభాష. ఒక తులం.

కోష్ఠం – కంఠం మొదలు ఆమాశయపక్వాశయాల వంటి గుదస్థానం వరకూ ఉండే పెద్ద పేగు.

కోష్ఠచతుష్కం – మృదుకోష్ఠం, మధ్యకోష్ఠం, క్రూరకోష్ఠం, సమకోష్ఠం అని కోష్ఠం నాలుగువిధాలు.

కోష్ఠయంత్రం – కమ్మరి కొలిమి.

కోష్ఠికయంత్రం – తిత్తి.

కోష్ఠిక – మూస.

కోష్ణం – గోరువెచ్చన.

కౌతుకం – భోజనకాలం.

కౌపం – ఇంద్రనీలమణుల రంగుతో విమలమై తియ్యగావుండే నూతినీరు.

కౌమారభృత్యం – చంటిపిల్లలకుచేసే చికిత్సావిధానం. ఆయుర్వేద శాస్త్రంలో ఇదొక ప్రత్యేక భాగం.

కౌస్తం – పదేళ్ళనాటి నెయ్యి.

క్రశిమ – కార్శ్యం. చిక్కిపోవడం.

క్రిమిఘ్నవర్గం – మునగ, మిరియాలు, గండీరం, కేముకకంద (ఇది ఉత్తరదేశ ప్రసిద్ధం), వాయువిడంగాలు, వల్లవావిలి, ఉత్తరేణి, పల్లేరు, గంటుభారంగి, ఎలుక చెవియాకు.

క్రిమిశైలం – పుట్ట.

క్రియ – చికిత్స. అంకురించినవ్యాధిని తగ్గించేదీ, మరోవ్యాధి పుట్టకుండా చేసేదీన్నీ.

క్రియాక్రమం – చికిత్సోపక్రమం.

క్రియాతియోగం – వైద్యుని పొరపాటువల్ల వాంతి, విరేచనాలు మొదలైనవి ఎక్కువగా కావడం.

క్రియావస్తి – వమనాది పంచకర్మలలో చెయ్యతగ్గ వస్తి.

క్రీడారత్నం – మైథునం.

క్రోధం – కోపం, క్రోధమూ శోకమూ వాత పిత్తాలను ప్రకోపింప చేస్తాయి. రక్తమున్నూ ఉదుకెత్తిస్తాయి.

క్రోధమూర్ఛితుడు – మిక్కిలీ క్రోధం గలవాడు.

క్రోశం – 4000 హస్తాల పరిమాణం.

క్లమం – ఆయాసమూ వగర్పూ లేని శ్రమ. శబ్దస్పర్శాదిజ్ఞానం వుండదు. బడలిక హెచ్చుగా వుంటుంది. ఇది ఇంద్రియార్థాలను బాధిస్తుంది.

క్లేదనం – కఫవిశేషం. దీనిస్థానం ఆమాశయం. దీనిపని అన్నం పచనం చెయ్యడం.

క్లైబ్యం – అంటే నపుంసకత్వం. ఇది మానసజం. ధాతుక్షయజం, శుక్రక్షయజం, ఉపఘాతజం, సహజం, స్థిరశుక్రజం అని ఆరు విధాలు. ద్వేష్య స్త్రీ సంయోగంవల్ల వచ్చేది మానసజం. కట్వమ్ల లవణ రసాలు ఎక్కువగా వాడడంవల్ల సౌమ్యధాతువు క్షీణించగా తటస్థించేది ధాతుక్షయజం. వాజీకరౌషధాలు సేవించకుండా స్త్రీలతో ఎక్కువగా క్రీడించడం వల్ల వచ్చేది శుక్రక్షయజం. వీర్యవాహిశిరలు తెగిపోవడంవల్ల వచ్చేది ఉపఘాతజం. పుట్టుకతోవచ్చేది సహజం. అతిబలిష్ఠమైన మదనవికారం బ్రహ్మచర్యాదుల వల్ల అణచుకోడంవల్ల వచ్చేది స్థిరశుక్రజం. వీటిలో ఉపఘాతజమూ, సహజమూ అసాధ్యాలు: తక్కినవి సరియైన చికిత్సకు లొంగుతాయి.

*మతాంతరం:* ఇది బీజోపఘాతం, ధ్వజభంగం, ముసలితనం, శుక్రక్షయం – అని నాలుగు విధాలు.

క్వథనం – క్వాథ సిద్ధం చెయ్యడం.

క్వథిక – క్వాథ.

క్వథితం – సిద్ధమైన క్వాథ.

క్వథితశీతలం – కాచి చల్లార్చినది.

క్వాథం – అంటే కషాయం. ఇది పాచనం, శోధనం, క్లేదనం, శమనం, దీపనం, తర్పణం, శోషణం అని యేడు విధాలు. సగంనీరు మిగిలేటట్టు కాచింది పాచనం. పన్నెండోభాగం మిగిలేటట్టు కాచింది శోధనం. నాలుగోవంతు మిగిల్చింది క్లేదనం. ఎనిమిదోవంతు మిగిల్చింది శమనం. ఆరోవంతు మిగిల్చింది దీపనం. అయిదోవంతు మిగిల్చింది తర్పణం. పదహారోవంతు మిగిల్చింది శోషణం.

పాచనం దోషాలను పచనం చేస్తుంది. దీపనం అగ్నిదీప్తి కలిగిస్తుంది. శోధనం మలాలను శోధిస్తుంది. శమనం రోగాలను శమింపచేస్తుంది. తర్పణం ధాతువులకు తృప్తి కలిగిస్తుంది. క్లేదనం హృదయానికి క్లేదనం కలిగిస్తుంది. శోషణం శోషింపచేస్తుంది.

శమన కషాయం పూర్వాహ్ణంలో యివ్వాలి. దీపనం అపరాహ్ణకాలంలోనూ, తర్పణమూ క్లేదనమూ ప్రాతఃకాలంలోనూ, శోషణ అర్ధ రాత్రి, శోధనం సూర్యోదయాత్పూర్వమూ ఇవ్వాలి.

రాగిపాత్రలో కాచిన కషాయం విషం కంటే అపాయకరం. చల్లబడ్డ కషాయం మళ్ళీ కాస్తే అదిన్నీ విషమే. వమనం చేయించే కషాయం మాత్రం రాగిపాత్రలో కాచాలి. కషాయం సన్ననిమంట మీద కాచాలి గాని, ఎప్పుడూ పెద్దమంటమీద కాచగూడదు.

## ఖ

ఖజలం – అంటే ఆకాశజలం. వర్షాకాలంలో మేఘాలతో కలిసి మహాసర్పాలూ, కీటలూతాలూ తిరుగుతూ వుంటాయి. కనక, ఆకాశజలం – అంటే మేఘాలు వర్షించే జలం ఆగస్త్యోదయం అయేదాకా పానయోగ్యం కాదు.

ఖట్వ – మంచం. దీనిమీద పడుకుంటే వాతం చేస్తుంది.

ఖనయిత్రి – గునపం.

ఖరకుటి – మంగలి క్షౌరశాల.

ఖరదండం – తామరపద్మం.

ఖరపల్లవం – టేకుచెట్టు.
ఖరపాచ్యం – వెలగచెట్టు.
ఖరాగ్ని – అర్కాలు తయారు చెయ్యడానికీ, వంట ఔషధాలు తయారుచెయ్యడానికీ వాడే మూడు అగ్నులలో ఒకటి.
ఖస్తని – భూమి.
ఖాద్యం – ఎనిమిది విధాలైన ఆహారద్రవ్యాలలో ఒకరకం.
ఖారి – మానపరిభాష – నాలుగు ద్రోణాల పరిమితి. నాలుగు ఆఢకాలొక ద్రోణం. నాలుగు ద్రోణాలొక ఖారి.
ఖార్జూరసుర – ఖర్జూరపండు, ఆరెపువ్వు – వీటితో తయారుచేసిన సురావిశేషం.
ఖురసానా – కురాసాని వాము.

## గ

గండకుసుమం – ఏనుగుమదం.
గండదూర్వ – నీటిమీద పెరిగే గరికగడ్డి.
గండూషం – అంటే చమురులు, పాలు, కషాయాది ద్రవాలు నోటినిండా వుంచుకుని పుక్కిలించడం. మోతాదు – ద్రవ్యద్రవ్యం అయితే పలం అంటే 8 తులాలు. చూర్ణం అయితే తులం.
గండూషచతుష్టయం – స్నిగ్ధ గండూషం, శమన గండూషం, శోధన గండూషం, రోపణ గండూషం – అని గండూషం నాలుగు రకాలు.
గంధగ్రాహి – నాశిక, ముక్కు.
గంధతూర్యం – ఇది యుద్ధాలలో వాడే గొప్ప వాద్య విశేషం.
గంధద్రవ్యం – తైలానికి సువాసన కలగడానికి వేసే వస్తువులు. అవి – ఏలకులు, చందనం, కుంకుమ పువ్వు, అగరుచెక్క, మురామాంసి, కంకోలం, జటామాంసి, కచ్చూరాలు, శ్రీవాసం (సరళ నిర్యాసం), గ్రంధిపర్ణి, పచ్చకర్పూరం, వట్టి వేరు, కస్తూరి, నఖం చిప్పలు, బావంచాలు, తుంగముస్తలు, మెంతులు, లవంగాలున్నూ – ఇవి మెత్తగా చూర్ణించి, తైలపాకం పూర్తి అయిన తరవాత దింపడానికి ముందు దానిలోవేసి బాగా కలిపి వస్త్రగాలితం చేసుకునేది.
గంధధూళి – కస్తూరి.
గంధనాళిక – ముక్కు.
గంధపిండిక – రసం ఒక పలం, గంధకం ఒక కర్షం మెత్తగా నూరి కల్వంలోనే దేవదాళిరసంపోసి చేతివేలితో కలిపితే ముద్ద అవుతుంది. ఇది గంధక జారణ మారణాల కుపయోగిస్తుంది.
గంధపిశాచిక – ధూపం.
గంధమార్జాలవీర్యం – కస్తూరి.
గంధమైథునం – వృషభం.
గంధశేఖరం – కస్తూరి.
గంధాష్టకం – అంటే ఎనిమిది సుగంధద్రవ్యాలు: ఇది అనేక విధాలు. వాటిలో ఇక్కడ అయిదు విధాలు చూపబడుతున్నాయి.

మాంసయూషం వగైరా సువాసింపచెయ్యడానికి వాడే గంధాష్టకం – జాపత్రి, లవంగాలు, దాల్చిని, ఏలకులు, ఆకుపత్రికం, నాగకేసరాలు, మిరియాలు, కస్తూరిన్ని.

**దేవీప్రీతికరాలు** – చందనం, అగురుచెక్క, పచ్చకర్పూరం, తాళీసపత్రి, కురువేరు, కుంకుమపువ్వు, రక్తచందనం, చెంగల్వకోష్టు.

**గణపతి ప్రీతికరాలు** – చందనం, పచ్చకర్పూరం, నాగకేసరాలు, కురువేరు, తుంగముస్తలు, దేవదారు, గోరోచనం, కుంకుమపువ్వు.
గంధోత్తమ – మదిర, సురావిశేషం.
గగనధ్వజం – మేఘం.
గజచక్షువు – వికృతనేత్రాలు.
గజదఘ్నం – ఏనుగీత లోతునీరు.
గజదానం – ఏనుగుమదం.
గజపుటం – గజంలోతూ, గజంకైవారమూ వుండేటట్టు గొయ్యితవ్వి మూడువంతుల లోతు పిడకలతో పూడ్చి, వాటిమీద ఔషధంవున్న మూకుళ్ళుంచి వాటిపైన గొయ్యినిండేదాకా, మళ్ళీ పిడకలు పేర్చి, నిప్పుపెట్టి, సాంగశీతలావ తీసుకునేది.
గజముక్త – ఏనుగుల గండస్థలంలో పుట్టే ముత్యం.
గజలిండం – ఏనుగులద్ది.
గజవైద్యకం – ఏనుగులకు చేసే వైద్యక్రియలు తెలిపే గ్రంధం.
గణపతీసుతుడు – దివోదాసుడు.
గతశోకం – అశోకవృక్షం.
గతసన్నకం – మదం క్షీణించిన ఏనుగు.
గదాగదులు – అశ్వినీకుమారులు.

గదాగ్రణి – క్షయరోగం.

గది – రోగి.

గద్యాణం – కాళింగమానపరిభాష. ఆరుమాసాల పరిమితి.

గర్భం – తేజస్సంయోగంవల్ల శుక్రం తరళీభూతమై, జారి, యోని ముఖానపడి, వాయు సంయోగాన ఋతురక్తంలో కలిసి గర్భం అనిపించుకుంటుంది. తరవాత అగ్నిసోమసంయోగంవల్ల అది గర్భాశయం చేరుకుంటుంది. ఋతురక్తం అధికంగావుంటే కన్య, శుక్రం యెక్కువగావుంటే పుత్రుడూ, రెండు సమంగా వుంటే మాత్రం నపుంసకుడూ పుడతాడు. ఇంకా వివరాలు శారీర స్థానంలో చూసుకునేది.

గర్భచర్య – గర్భోపచారం.

గర్భచ్యుతి – గర్భస్రావం.

గర్భయంత్రం – ఇది ఆర్కాదులు, తయారుచెయ్యడానికి ఉపయోగించే యంత్రం. ఒక పెద్దకుండంలో ఒక యిటుకవుంచి, దానిమీద ఔషధ ద్రవ్యంతో నిండిన గిన్నె వుంచాలి. ఆ కుండమీద మరోకుండ ఊర్ధ్వముఖంగా వుంచి కిందికుండ మూతికీ పైకుండ అడుగుభాగానికీ చీలయిచ్చి, పై కుండలో నీరుపోసి కిందికుండకింద సన్ననిమంట పెట్టేది. పైకుండలో నీరువేడెక్కితే అది తీసేసి చల్లని నీరు పోస్తూ వుండాలి. ఇలా కొంతసేపు చేస్తే గిన్నెలో తైలాదులు స్రవిస్తాయి. అప్పుడు యుక్తిగా తీసుకునేది.

గర్భవతి – చూలింతరాలు. ఈమె ఎప్పుడూ సంతోషంగా వుండాలి. శుచిగానూ, చక్కగా అలంకరించుకునీ వుండాలి. తెల్లని బట్టలు కట్టుకుని శాంతంగా వుండాలి. గురుదేవ బ్రాహ్మణభక్తి పరురాలై మంగళకృత్యాలు చేస్తూ వుండాలి. మలినంగానూ, వికారంగానూ వుండే హీనులను ముట్టుకోరాదు. చూడగూడనివి చూడగూడదు. దుర్గంధం ఆఘ్రాణించగూడదు. ఉద్వేగం కలిగించే కథలు మాటలు వినరాదు. ఆరిపోయీ, నిలవవుండీ, పాసిపోయీ వుండిన అన్నం భుజించగూడదు. బయట తిరగరాదు. పాడుబడ్డ యిళ్ళు, చైత్యాలు, శ్మశానం, తోటలూ, భయంకరాలూ చూడగూడదు. గట్టిగా మాట్లాడరాదు. తరుచుగా తైలాభ్యంగం నలుగుపెట్టుకోడం పనికిరాదు. ఎత్తుగా వుండేచోట పడుకోరాదు. కుర్చీల మీద కూచోకూడదు. స్నిగ్ధమూ, మధురమూ, దీపనీయ సంస్కృతమూ అయిన అన్నం భుజించాలి.

గర్భస్థాపనం – గర్భరక్షణం.

గర్భాగారం – శయనగృహం, అంతర్గృహమున్నూ.

గర్భాధానం – ప్రథమఋతుస్నానం అయిన తరవాత, స్త్రీకి చెయ్యవలసిన పది సంస్కారాల లోనూ మొదటిది. అయితే ఆమెకి పదహారేళ్ళు నిండనిదే యీ సంస్కారం చెయ్యగూడదు. పురుషునకు పాతిక యేళ్ళుండాలి. అంతకి చిన్న వయస్సులో అయితే, గర్భం ఏర్పడితే, అది నిలవనే నిలవదు. నిలిస్తే గర్భంలోనే శిశువు మరణిస్తుంది. మరణించకపోతే దుర్బలంగా పుడుతుంది. పుట్టినా చిరకాలం జీవించదు. కనక, ఎలాంటి కారణాలవల్లా గూడా పదహారేళ్ళు నిండకుండా స్త్రీకి గర్భాధానం చెయ్యగూడదు.

గర్భాష్టమం – గర్భం యేర్పడినది మొదలు ఎనిమిదో మాసం. ఎనిమిదో సంవత్సరమున్నూ.

గర్భిణి – గర్భవతి అయిన స్త్రీ. గర్భిణికి స్తనాగ్రాలు నల్లబడతాయి. కడుపుమీద రోమరాజి స్ఫుటం అవుతుంది. కనురెప్పలు తరుచు మూతలుపడుతూ వుంటాయి. చర్ది పుడుతుంది. ఆహారవస్తువుల వాసన తగిలితేనే డోకు వస్తుంది. నోట నీరూరుతూ వుంటుంది.

గర్భిణీవర్జనీయాలు – గర్భవతి అయిన స్త్రీ శ్రమకరాలైన పనులూ, వ్యాయామం, సంభోగం, సగంసగం భుజించడం, ఎక్కువగా భుజించడం, పగలు నిద్రించడం. రాత్రి మేలుకోడం, శోకించడం, వాహనాలు ఎక్కి తిరగడం, భయపడడం, వికటస్థలాలలో కూచోడం – ఇత్యాది కృత్యాలు చెయ్యగూడదు.

గర్భిణ్యవేక్షణం – కుమారభృత్యం. అంటే గర్భిణీ పరిచర్య.

గళభంగం – స్వరభంగం.

గవ్యూతి – రెండు క్రోసుల దూరం.

గాత్రఘర్షణం – శరీరం తోముకోడం.

గాత్రమార్జని – స్నానంచేసి శరీరం తుడుచుకునే అంగవస్త్రం, తువ్వాలు.

గాత్రానులేపని – శరీరానికి నలుగుపెట్టుకోడానికి సుగంధ ద్రవ్యాలతో తయారుచేసిన పిండిముద్ద.

గాలనం – వస్త్రగాలితం చెయ్యడం.

గ్రామ్యధర్మం – సంభోగం.

**గ్రామ్యపశువు** – పద్నాలుగు విధాల పశువులలో ఇదొక రకం. ఇవి ఏడు రకాలు – గొరం, విరజం, అశ్వం, అశ్వతరం, గర్దభం, మనిషి. ఇవి గ్రామ్యపశువులు.

**గ్రామ్యాతియోగం** – అతిమైథునం.

**గ్రాసం** – రసశుద్ధులలో ఒకటి.

**గ్రాహివస్తి** – నిరూహవస్తులలో ఒకటి.

**గ్రాహి** – స్తంభనకారి, అంటే విరేచనాదులు కట్టేది.

**గ్రాహ్యౌషధం** – అంటే స్తంభనకర ద్రవ్యాలు. ఇవి సొంటి, గజపిప్పళ్ళు, జీలకర్ర మొదలైనవి. ఉష్ణవీర్యాలు కనక అగ్నిని ఉద్దీపింపచేస్తాయి. ఆహారం పక్వం చేస్తాయి. ద్రవం ఇంకేటట్టు చేస్తాయి. ఇవి గ్రాహిఔషధాలని పేరు.

**గ్లాని** – ఓజస్సు క్షీణించడంవల్ల కలిగే వ్యాధి. నోరు తియ్యగావుంటుంది. కునికిపాట్లు వస్తూంటాయి. రొమ్ము ఉబ్బేటట్టుంటుంది. అన్నం తినాలని వుండదు. ఈ అవస్థ గ్లాని.

**గిరిమాలపంచకం** – రేల, గ్రంధికం, తుంగ ముస్తలు, నేలవేము, కరక్కాయ.

**గ్రీష్మం** – షడృతువులలో ఒకటి.

**గుంఫం** – గడ్డం మీసాలు.

**గుటికాంజనం** – మూడురకాల అంజనాలలో ఒకటి.

**గుడం** – చెరుకురసం వండి తయారుచేసే మధుర పదార్థం. ఇది ధౌతం, అధౌతం, పురాణం, నవం అని నాలుగు విధాలు. ధౌతం నాతిశ్లేష్మలం, మలానలో మనమున్ను, అధౌతం క్రిములు పుట్టిస్తుంది. మజ్జ, రక్తం, కొవ్వు, మాంసం – ఇవి వృద్ధిచేస్తుంది. పురాణం హృద్యం, స్వస్థహితమున్ను, నవం శ్లేష్మం పెంచుతుంది. అగ్నిమాంద్యమున్నూ కలిగిస్తుంది.

**గుడపాకం** – బెల్లం పాకం సిద్ధం అయినప్పుడు పూసినట్టు గరిటెకు పట్టుకుంటుంది. తీగలు సాగుతుంది. కొంచెం తీసి నీళ్ళున్న పాత్రలో వేస్తే కరిగిపోదు. గట్టిపడుతుంది.

**గుడసూక్తం** – బెల్లం, నీళ్ళు, మూనె, కంద మూల ఫలాలు – ఇవన్నీ ఒక కుండలోపోసి చీలయిచ్చి నెలదినాలుంచితే అది పులుస్తుంది. అదే గుడసూక్తం.

**గుడూచ్యాదిగణం** – తిప్పతీగ, పద్మకాష్ఠం, వేపపట్ట, ధనియాలు, రక్తచందనమున్ను.

**గుణత్రయం** – సత్వగుణం, రజోగుణం, తమోగుణమున్ను, వీటిలో – సత్వగుణమే శ్లేష్మం. రజోగుణం పిత్తం, తమోగుణం వాతం.

**గుణాలు** – ద్రవ్యగుణాలు, గురుత్వం (బరువు), మందత్వం, హిమం (చల్లదనం), స్నిగ్ధం (జిడ్డు), శ్లక్ష్ణం (నునుపు), సాంద్రం (చిక్కన), మృదుత్వం (మెత్తన), స్థిరత్వం (నిలకడ), సూక్ష్మం, విశదం అని గుణాలు పది. గురుత్వానికి లఘుత్వం, మందతకు తీక్ష్ణత, హిమానికి ఉష్ణం, స్నిగ్ధానికి రూక్షం, శ్లక్ష్ణానికి ఖరం (గరగర), సాంద్రతకు ద్రవత్వం, మృదుత్వానికి కాఠిన్యం, స్థిరత్వానికి సరత్వం (శీఘ్రంగా వ్యాపించేది), సూక్ష్మానికి స్థూలం, విశదానికి పిచ్ఛిలం అని మొత్తం గుణాలు యిరవై.

**గురుత్వం** – అంటే శరీరం భారంగా వుండడం. శరీరం అంతా తడిచర్మం కప్పినట్టు బరువుగా వుంటుంది. శిరస్సు మిక్కిలీ బరువుగా వుంటుంది. ఇదే గురుత్వం,

**గురుపంచమూలాలు** – ఇవే బృహత్పంచమూలాలు. మారేడు, దుండిగము, గుమ్మడు, కలిగొట్టు, తక్కెల.

**గురువు** – అలఘుద్రవ్యం. సులభంగా జీర్ణం కానిది. పృధివీసోమగుణ భూయిష్ఠం. ఇది స్వభావగురువు. మాత్రాగురువు, సంస్కార గురువు అని మూడు విధాలు. మినుములు మొదలైనవి స్వభావ గురుద్రవ్యాలు. పెసలు మొదలైనవి మాత్రాగురువులు. పిండి మొదలైనవి సంస్కార గురువులు.

**గుర్వర్చనం** – గురువులను, దేవతలను, బ్రాహ్మణులను అర్చించడం. ఇది స్వర్గసౌఖ్యం, యశస్సు, ఆయుర్వృద్ధి కలిగిస్తుంది. దౌర్భాగ్యం పోగొడుతుంది. ధనధాన్యసంపత్తి కలిగిస్తుంది.

**గుర్విణి** – గర్భవతి.

**గృష్టిక్షీరం** – అరుదుగా ఈనే ఆవుపాలు.

**గృహోశ్మ** – పన్నెకల్లు.

**గోగృష్టి** – అరుదుగా ఈనే ఆవు.

**గోచరవిభ్రమం** – చూపు సరిగా ఆనకపోడం.

**గోణి** – మానపరిభాష, ఒక ద్రోణం.

**గోవరం** – ఆవుల శాలలో, ఆవులదెక్కలతో నలిగిన గోమయచూర్ణం.

గోవరపుటం – గోతిలో ఏరుపిడకల చూర్ణంపోసి, దానిమధ్య శరావ సంపుటంవుంచి, అదిమి, నిప్పుపెట్టి, చల్లబడ్డ తరువాత తీసుకునేది.

గోక్షురాదిగణం – ఇది లోహమారణాని కుప యోగిస్తుంది. మూలికలు – పల్లేరు, గొలిమిడి, వాకుడు, సింహపుచ్ఛి, కుశించిక.

గోక్షురాది పంచమూలం – పల్లేరు, రేగు, కొడిశ, కసివింద, ఆవాలున్ను.

గౌరీయంత్రం – ఎనిమిది అంగుళాలు పొడవు వెడల్పుగల ఇటుక గ్రహించి మధ్యభాగాన మూకుడులాగ గుంటలుచేసి, అది సున్నం మొద శైవాటితో మన్నగా వుండేటట్టు చెయ్యాలి. తరవాత ఆ గుంటలో జారణచెయ్యవలసిన ద్రవ్యానికి నాలుగోభాగం గంధకం గ్రహించి చూర్ణించి సగం ఆ గుంటలో పోసి, దానిమీద జారణ చెయ్యవలసిన బంగారం. వెండి, అభ్రకం ఇత్యాదులుంచి దానిమీద గంధకశేషంపోసి ఒక మూకుడుమూసి చీలయిచ్చి చిన్నచిన్న ఏరుపిడకలతో పుటంపెట్టుకునేది. ఇది గౌరీయంత్రం. ఇది జారణాని కుపయోగిస్తుంది.

## ఘ

ఘటం – మానపరిభాష. ఒక ద్రోణం.

ఘటకం – పువ్వులు లేకుండా కాసేచెట్టు.

ఘనాగ్నిసహం – ఉత్తమమైన కంచులోహం.

ఘనాత్యయం – శరదృతువు.

ఘరట్టం – రుబ్బురోలు.

ఘర్మదోషం – మిక్కిలీ చెమటపట్టడం.

ఘర్మాంతం – వర్షాకాలం.

ఘర్మకాలం – రుబ్బుపాత్రం – రోకలి.

ఘ్రాణం – ముక్కు, కర్మేంద్రియాలలో ఒకటి.

ఘ్రాణోదకం – నిశీథకాలానా, ప్రాతఃకాలానా ముక్కురంధ్రాలద్వారా నీరుతాగడం. దీనివల్ల గృధ్రదృష్టి, సూక్ష్మబుద్ధి, శరీరానికి మంచి తేజస్సు సిద్ధిస్తాయి. శిరోరోగాలు హరిస్తాయి. వలీఫలితాలు సంభవించవు.

ఘృతకోష్ఠం – ఇదొక స్వేదకర్మ. అవగాహన స్వేదంలో ఉపయోగించే తొట్టికషాయంతోకాక గోరువెచ్చని నేతితో నింపాలి. ఇంతే భేదం.

ఘృతాభ్యంగం – నేతితో తల అంటుకోడం.

## చ

చంక్రమణం – అంటే తిరగడం. అదేపనిగా తిరగడం చాలా చెడ్డది. అది అనాయుష్యమూ, అనారోగ్యకరమున్నూ, కళ్ళకున్నూ హాని కలిగిస్తుంది. అయితే, కాళ్ళకు చెప్పులు తొడుగుకుని, శరీరానికి ఆయాసం కలగకుండా మితంగా తిరగడం చాలా అగత్యం. దాని వల్ల ఆయువు పెరుగుతుంది. దేహబలమూ, బుద్ధిబలమూ, జఠరదీప్తి కలుగుతాయి. ఇంద్రియ బోధన మున్నూ కలుగుతుంది. కొవ్వూ, కఫమూ, స్థౌల్యమూ తగ్గిపోతాయి. వాటితోబాటు, సౌకుమార్యమున్నూ కొంత క్షీణించి పోతుంది.

చంద్రచందనం – కుంకుమపువ్వు, ఆగురుచెక్క, చందనమున్ను.

చందనద్వయం – చందనం, రక్తచందనమున్నూ.

చందనాదిగణం – ఇవి ఏడు సుగంధద్రవ్యాలు. చందనం, రక్తచందనం, వట్టివేరు, పచ్చకర్పూరం, ఏలకులు, తిప్పతీగ, లతాకస్తూరిన్నీ.

చంద్రశాల – చాలా ఎత్తయిన మేడ మీది అంతస్థు.

చక్రగండువు – గుండ్రని దిండు.

చక్రతైలం – అప్పుడు గానుగ ఆడిన నువ్వుల నూనె.

చక్రధారం – సగభాగం పదనుగల శస్త్రవిశేషం.

చక్రభేదిని – రాత్రి.

చక్రముఖం – పంది.

చక్రయంత్రం – ఔషధపుటాలలో ఇదొకటి. ముందు పెద్దగొయ్యి తీసేది. దానిలో మళ్ళీ చిన్న గొయ్యి తీసేది. ఆ చిన్న గోతిలో శరావసంపుటం ఉంచి పెద్దగోతిలో పిడకలతో పుటం పెట్టేది.

చతుర్గతి – తాబేలు.

చతురమ్లం – అమ్లచతుష్టయం. దానిమ్మ, అమ్లవేతసం, రేగు, చింతపండున్ను.

మతాంతరం: అమ్లవేతసం, ఆమ్రాతకం, దబ్బ, నిమ్మ.

చతుర్జాతం – దాల్చిని, ఏలకులు, ఆకుపత్రికం, నాగకేసరాలున్ను.

చతుర్థిక – మానపరిభాష, ఒక పలం. అంటే యెనిమిది తులాలు.

**చతుర్బీజం** – మెంతులు, చంద్రశూరం, నల్లజీలకర్ర, వామున్ను.

**చతురూషణం** – సొంటి, పిప్పలి, మిరియాలు, పిప్పలిమోడిన్నీ.

**చతుర్థమదం** – మద్యపానంవల్ల కలిగే నాలుగు మదాలలో ఇదొకటి. చివరిదిన్ని. మద్యం అధికంగా తాగి ఈ నాలుగోమదం పొందిన మనిషి మొదలు నరికిన చెట్టులాగ నేల మీద పడిపోతాడు. మృతునిలాగ వుంటాడు. ఇది ప్రాణికోటికి క్రూరమృగసంకీర్ణమైన గాఢారణ్యంలో ప్రవేశించడం వంటిది.

**చతుర్భద్రం** – తుంగముస్తలు, అతివస, తిప్పతీగ, సొంటిన్నీ.

**చతుర్విధకవలం** – స్నేహికం, శమనం, శోధనం, రోపణం అని కవలం నాలుగు విధాలు.

**చతుర్విధ గండూషాలు** – స్నైహికం, శమనం, శోధనం, రోపణం అని గండూషమున్నూ నాలుగు విధాలు.

**చతుర్విధస్నేహాలు** – స్నేహం అంటే చమురు. ఇది నెయ్యి, నూనె, వస, కొవ్వు అని నాలుగు విధాలు.

**చతుర్విధ స్వేదాలు** – తాపస్వేదం, ఉపనాహ స్వేదం, ఊష్మస్వేదం, ద్రవస్వేదం అని స్వేదకర్మ నాలుగు విధాలు.

**చతుర్విధాన్నం** – చవ్యం, చోష్యం, లేహ్యం, పేయమున్ను.

**చతుష్కువలయం** – కలవకాడ, కలవదుంప, కలవఆకు, కలవపువ్వు కేసరాలు.

**చతుష్పాటి** – నది.

**చతుష్పాద** – చికిత్సాపాద చతుష్టయం. అవి – వైద్యుడు, రోగి, ద్రవ్యాలు, ఉపస్థాత.

**చయం** – వాతాది దోషాలు తమతమ స్థానాలలోనే వృద్ధిపొందడం.

**చయకృత్** – త్రిదోషకరం.

**చర్మపుటకం** – తోలుతోచేసిన దొప్ప.

**చర్మప్రసేకం** – తిత్తి.

**చర్మసారం** – శరీరంలో వుండే రసధాతువు.

**చర్వణం** – అష్టవిధాన్నాలలో వొకటి.

**చర్వితం** – పళ్ళతో నమలినది.

**చర్వ్యం** – చతుర్విధాన్నాలలో వొకటి.

**చలుకం** – మానపరిభాష. ప్రసృతి.

**చషకం** – సురాపాన పాత్ర.

**చక్షుష్యం** – కళ్ళకు హితకరం.

**చాతుర్జాతం** – దాల్చిని, ఏలకులు, ఆకుపత్రికం, నాగకేసరాలు.

**చాతుర్భద్రకం** – సొంటి, అతివస, తుంగముస్తలు, తిప్పతీగ – ఇవి. కలిపి చాతుర్భద్రకం.

**చారవాయువు** – చల్లని సుగంధవాయువు.

**చాలని** – జల్లెడ.

**చికిత్స** – రోగం నిర్ణయించి రకరకాల ఔషధాలు వాడి అది పోగొట్టడం. ఏమిచేస్తే శరీరంలో వుండే వాతపిత్తకఫాలు సమస్థితికి వస్తాయో అది చికిత్స. వైద్యుడు చేసేపని. ఇది ఆసురి, మానుషి, దైవి అని మూడువిధాలు. చికిత్సచేస్తే ఒకచోట ధర్మం సిద్ధిస్తుంది. ఒక చోట మైత్రి ఏర్పడుతుంది. ఒకచోట ద్రవ్యం లభిస్తుంది. ఒకచోట యశస్సు వస్తుంది. ఒకచోట చికిత్సలో నైపుణ్యం కలుగుతుంది. కనక, చికిత్స ఎన్నడూ నిష్ఫలంకాదు.

**చికిత్సకుడు** – వైద్యుడు. ఈ వైద్యుడు ప్రాణాభిసరుడు, రోగాభిసరుడు అని రెండు విధాలు. ప్రాణాభిసరుడు రోగాలు పోగొట్టి ప్రాణాలు నిలిపేవాడు. రోగాభిసరుడు అంటే ప్రాణాలు తీసేవాడు.

**చికిత్సాంగం** – చికిత్సకు ఏడు అంగాలు. అవి – రోగి, దూతి, వైద్యుడు, ఆయుర్దాయం, ద్రవ్యం, సేవకుడు, మంచి ఔషధమున్ను.

**చికిత్సాప్రాభృతుడు** – వైద్యుడు. ప్రాభృతం అంటే కానుక. చికిత్స చేసి కానుకలు సంపాదించేవాడు.

**చికిత్సాసంభారం** – రోగికి చికిత్స చేసే టప్పుడు వైద్యుడు తన చికిత్సాలయంలో సమకూర్చి వుంచుకోవలసిన వస్తుసామగ్రి.

1. పరిచారకులు. వీరు పరిచర్య చేయడంలో కుశలులై వుండాలి. మంచి నడవడి, పరిశుద్ధత, రోగుల యెడల ప్రీతి, అభిమానం, అనుకూల్యం కలవారున్నూ అయివుండాలి. సకలకృత్యాలూ చెయ్యగలిగిన్ని వుండాలి. స్నానం చేయించడం, ఒడలు పిసకడం, రోగులను లేవతియ్యడం, పడుకోబెట్టడం, ఔషధాలు తయారుచెయ్యడం – వీటిలో సమర్థులూ, హితచింతకులున్నూ అయివుండాలి.
2. వైద్యుని చెంత కొందరు సభ్యులుండాలి. వారిలో జంత్రగాత్రాలతో చక్కగా పాడ గలవారూ, చక్కని వాద్యగాళ్ళూ, శ్లోకా

లకు అర్థం విప్పిచెప్పగలవారూ, మనస్సును కుల్లాసం కలిగేటట్టు మాట్లాడగలవారూ, పురాణేతిహాసాలు చెప్పగలవారూ, ఇంగిత జ్ఞానం కలవారూ, దేశకాలపరిజ్ఞానం కల వారున్నూ అయివుండాలి.

3. అక్కడ వివిధ పక్షులూ, జంతువులన్నూ ఉండాలి. వాటిలో లకుముకిపిట్టలూ, కపింజలములూ, కుందేళ్ళూ, జింకలూ, లేళ్ళూ, నల్లని తోకలతో ఈకలూ, పెద్ద పెద్ద కడుపులు గల జింకలూ, పొట్టేళ్ళూ సమృద్ధిగా పాలిచ్చు ఆవులున్నూ అనేకంగా వుండాలి. వాటికి మంచిమేత నీరు సమృద్ధిగా వుండాలి.

4. అక్కడ, నీళ్ళు నిలవ ఉంచుకోవడానికీ, తాగ డానికీ, చేతులూ, కాళ్ళూ, మొగాలూ కడు క్కోడానికీ, చక్కని పాత్రలూ, కుండలూ, చెంబులూ, బానలూ, కడవలూ, ఇనుప పామాను, కొయ్యసామాను, మూకుళ్ళు, కవ్వాలూ, చర్మాలూ, గుడ్డలూ, దారాలూ, పత్తీ, ఊలు మొదలైనవిన్నీ సమృద్ధిగా వుండాలి.

5. మంచాలూ, బల్లలూ, కూజాలూ, పరు పులూ, దుప్పట్లూ, దిండ్లూ, రోగుల మలమూత్రాదులు పట్టడానికి తగిన పాత్రలూ, స్వేదం, స్నేహం, అభ్యంగం, ప్రదేహం, పరిషేకం, అనులేపనం, వమనం, విరేచనం, ఆస్థాపనవస్తి, అనువాసనవస్తి, నస్యకర్మ — వీటికి కావలసిన ఉపకర ణాలు, రకరకాల కల్వాలూ, శస్త్రాలూ, ధూమనేత్రాలూ, వస్తినేత్రాలూ, చీపుళ్ళూ, త్రాసులూ, మజ్జా, తేనే, బెల్లమూ, లవ ణమూ, కట్టెలూ, మద్యమూ, సారాయీ ఇంకా అనేకరకాల సురలూ, కాంజికాలూ, తుషోదకాలూ, మేదకమూ, పెరుగుమీది మీగడా, పులిగంజీ, గోమూత్రమూ ఇత్యాదు లున్నూ సర్వసమృద్ధిగా వుండాలి. రకరకాల ధాన్యాలు, పెసలు, మినుములు, కందులు, నువ్వులు, ఉలవలు, రేగుపళ్ళు, ద్రాక్షపళ్ళు, వేలగుమ్మడుపళ్ళు. చిట్లీతపళ్ళు, కరక్కా యలు ఉసిరికాయలు, తాడికాయలు — ఇవిన్నీ సిద్ధంగా వుండాలి. నానా విధాలైన ఔషధాలున్నూ సమృద్ధిగా వుండాలి.

చికిత్స్యుడు — చికిత్స చెయ్యవలసిన రోగి. ఇతను నిజ ప్రకృతివర్ణాలు చెడనివాడూ, సత్వ వంతుడూ, వైద్యభక్తుడూ, జితేంద్రియుడూ ఈ లక్షణాలు కలవాడయివుండాలి.

చికిరం — నదీతీరాన, ఇసుకతిప్పలలో ఊరేనీరు.

చిత్రిణి — స్త్రీజాతులు పద్మిన్యాదులు నాలుగు. వాటిలో ఇదొక జాతిస్త్రీ.

చిరంటి — ఋతుమతి అయివున్న స్త్రీ.

చిరసూత — చిరకాలానికి ఈనిన ఆవు.

చుంబనం — అంటే ముద్దు. ముద్దుపెట్టుకోదగిన స్థానాలు పది. అవి — మొగం, స్తనాలు, లలాటం, కంఠం, నేత్రాలు, చెక్కిలి, చెవులు, కక్ష, ఊరువులు, భగం, తల.

చులుకం — మానపరిభాష. ఒక ప్రసృతి.

చుల్లి — వంటచేసే పొయ్యి.

చూర్ణం — వస్తువులు మెత్తగాదంచి వస్త్రగాలితం చేసిన గుండ. రెండు మాసాలు దాటితే యిది గుణహీనం అవుతుంది.

చూర్ణాంజనం — మూడు రకాల అంజనాలలో ఇదొకటి.

చూర్ణోదకం — అయిదు శరావాల నీళ్ళలో నాలుగు కర్షాల చూర్ణం కలిపి, రెండుజాములు నిలవ ఉంచి, తేరిన నీళ్ళు తీసుకోవాలి. అదీ చూర్ణోదకం.

చేతనాధిష్ఠానం — హృదయం.

చేతనావృత్తి — ఆయువు.

చేష్ట — వాఙ్మనశ్శరీర ప్రవృత్తి.

చైత్యముఖం — కమండలం.

చోష్యం — ఎనిమిది రకాల అన్నంలో ఇదొక రకం.

చౌండ్యోదకం — కొండలమధ్య నిలవవుండి రకరకాల తీగలతో నిండి వుండేది చౌండ్యోదకం.

ఛచ్ఛిక — వెన్నతో కలిసిన మజ్జిగ.

ఛురిక — గొడ్డుఆవు.

ఛోటిక — చిటిక.

## జ

జంగమవిషాశ్రయాలు — సర్పాదుల దృష్టి, శ్వాస, కోరలు, గోళ్ళు, మూత్రం, మలం, శుక్రం, చొంగ, స్పర్శ, కాటు, ఋతురక్తం, రాపిడి, గుదం, ఎముక, పిత్తం, శూక (తోక) మొదలైన చోట్ల వుండే ముల్లు — ఈ స్థలాలు జంగమవిషం వుండేవి.

జగదున్మాదకం — మద్యం.

**జటామాంస్యాదిగణం** – ఇదొక సుగంధద్రవ్యగణం. అవి – జటామాంసి, వఖంచిప్పలు, ఆకుపత్రికం, లవంగాలు, గ్రంధిపర్ణం, శైలేయం, గంధపాషాణమున్ను.

**జఠరాగ్ని** – కోష్ఠాగ్ని.

**జలం** – నీరు. ఇది అనేకవిధాలు. అన్నీ యిక్కడ రాస్తే గ్రంధ విస్తరం అవుతుంది. కనక, కొద్దిగా మాత్రమే రాస్తాను. జలానికి స్పర్శ, రూప, రస, గంధ, వీర్య, విపాకాలు అని ఏడుదోషాలున్నాయి. స్పర్శదోషం – ఖరత్వం, పైఛ్చిల్యం, ఉష్ణత్వమున్ను. రూపదోషం – బురద, ఇసక, నాచు, రంగురంగులు – ఇవి ఉండడం. రసదోషం – రుచిగా లేకపోవడం. గంధదోషం – దుర్వాసన. వీర్యదోషం – దప్పిక మొదలైన అనేక వ్యాధులు సంభవిస్తాయి. విపాకదోషం – మలబంధాదికం. నీరు తేరుకోడానికి ఏడు ఉపాయాలున్నాయి. అవి – ఇండుపుగింజ, గోమేధికమణి. తామరతూళ్లు, నాచు, వస్త్రం, ముత్యం, మణి – ఇవి.

**జలయంత్రం** – పైని నీరు, కింద మంట, మధ్య రసగంధకాదులు. జలయంత్ర స్వరూపమిది. వివరాలు – లోహంతో ఒక పెద్దబావ సిద్ధం చేసుకోవాలి. లోహశరావసంపుటిలో స్వర్ణరసగంధకాదులుంచి మేకరక్తంతో లోహకిట్టం నూరి దానితో ఆ శరావసంపుటానికి చీలయిచ్చేది. ఇది చాలామాట్లు చెయ్యాలి. ఇటుక చూర్ణం తుమ్మ చెక్కరసంతో నూరి దానితోనున్నూ చీల యిచ్చేది. ఇది కూడా చాలామాట్లు చెయ్యాలి. అప్పటికి దానికి నీటివల్ల కరిగిపోకుండా వుండే గట్టితనం వస్తుంది. అయినా శుద్ధ లోహకిట్టం, ఉప్పు – ఇవి బర్రెపాలతో నూరి దానితో కూడా చీల యిచ్చేది. అప్పుడు ఆ శరావసంపుటి లోహబానలో వుంచి నిండా నీళ్ళుపోసి పోయిమీద వుంచి మంటబెట్టేది. ఇది జలయంత్రం.

**జాంగమద్రవ్యం** – జంగమాల వల్ల లభించిన ద్రవ్యాలు. అవి – తేనె, గోమూత్రం, చేదుకట్టు, వస, మూలుగు, రక్తం, మాంసం, మలం, మూత్రం, తోలు, రేతస్సు, ఎముకలు, స్నాయువులు, శంఖాలు, గోళ్లు, డెక్కలు, వెంద్రుకలు, గోరోజనమున్ను.

**జాంగలదేశం** – నీరుతక్కువగా ఉండే ప్రదేశం. అక్కడ చెట్లున్నూ, అల్పంగానేవుంటాయి. పిత్తరక్తవ్యాధులక్కడ ఎక్కువగా వుంటాయి.

**జాడ్యం** – శరీరం జడంగా వుండడం. అంటే అలస భావం. జాడ్యం అంటే వ్యాధి పర్యాయమున్నూ.

**జాతీద్వయం** – జాజికాయ, జాపత్రిన్ని.

**జ్ఞానవతి** – రెండు విధాలైన పరిషత్తులలో ఇదొకటి. జ్ఞానవంతులున్న పరిషత్తుకి ఈ పేరు.

**జిహ్వానిర్లేఖిని** – పళ్ళు తోముకున్నప్పుడు నాలుక గీసుకునే బద్ద. ఇది బంగారం, వెండి, ఇత్తడి – వీటిలో దేనితో నైనా చేయించుకోవచ్చు. పొడుగు పన్నెండు అంగుళాలుండాలి. అంచులు మృదువుగానున్నూ వుండాలి.

**జీరకద్వయం** – తెల్లజీలకర్ర, నల్లజీలకర్ర.

**జీవకాదిపంచమూలం** – జీవకం, ఋషభకం, మేద, మహామేద, జీవంతిన్నీ.

**జీర్ణాంతికం** – నిన్న భుజించిన ఆహారం జీర్ణం అయిన తరవాత చేసే ఘృతపానం.

**జీర్ణాహారం** – ఆహారం జీర్ణం అవుతున్న అవస్థ.

**జీవంత్యాదివర్గం** – ఇదే జీవనీయవర్గం.

**జీవద్వంద్వం** – జీవకం, ఋషభకమున్ను.

**జీవనం** – ఆవులు మొదలైన పశుధనం.

**జీవనం** – ఓజోవృద్ధికరం, ఓజస్సు వృద్ధిచేసేది.

**జీవనార్థం** – పాలు.

**జీవనీయం** – నెయ్యి.

**జీవనపంచమూలం** – పిల్లితేగలు, పెద్దమ్ముడు, పాలకూర, జీవకం, ఋషభకమున్ను.

**జీవనీదశకం** – జీవనీయగణంలో చెప్పిన 10 వస్తువులున్ను.

**జీవనీయగణం** – పాలకూర. కాకోళి, క్షీరకాకోళి, మేద, మహామేద, ముద్గపర్ణి, మాషపర్ణి, జీవకం, ఋషభకం, యష్టిమధుకమున్ను.

**జీవమందిరం** – శరీరం.

**జీవవత్స** – బ్రతికివున్న బిడ్డలుకల స్త్రీ.

**జీవశోణితం** – జీవపోషకమైన శుద్ధరక్తం. శుద్ధరక్తమో రక్తపిత్త సంబంధమైన రక్తమో తెలుసుకోవాలంటే, అది నూలుగుడ్డమీద వేసి కడిగేది. గుడ్డ ఎర్రగానే వుంటే అది జీవరక్తం. అది అన్నంలోనయినా పిండిలోనైనా కలిపెడితే కుక్కలు తింటాయి. ఆ విధంగా కూడా శుద్ధరక్తం తెలుసుకోవచ్చు.

**జీవాదానం** – జీవరక్తం ఎండిపోడం.

**జీవాపగమం** – షడ్ధాతువులు విడిపోడం. మృత్యువు.

**జీవితం** – ఆయువు.

**జీవితాధిసరుడు** – జీవనరక్షకుడు అంటే వైద్యుడు.

**జృంభ** – ఆవులింత. నోటితో గాలి లోపలికి పీల్చి నోరు బాగా విప్పి మళ్ళీ ఆ గాలి విడిచిపెట్టడం. అప్పుడు కన్నీళ్ళు వస్తాయి.

**జేంతాకస్వేదం** – స్వేదకర్మలలో ఇదొకటి. జేంతాకం అంటే చుట్టుగుడిసె. ఊరికి తూర్పున అయినా, ఉత్తరాన అయినా అది నిర్మించుకోవాలి. అక్కడి మట్టి నల్లనిది లేక బంగారు చాయకలది అయి వుండాలి. చెట్లూ చేమలూ అక్కడ దిట్టంగా వుండాలి. జలాశయమున్నూ ఒకటి వుండాలి. ఆ జలాశయానికి గుడిసె అభిముఖంగా, అంటే దాని ద్వారం నీటి కేడెనిమిది మూరల దూరాన ఉండేటట్టు జలాశయానికి పడమటనైనా, దక్షిణాన అయినా వుండాలి. దాని ఎత్తు పదహారు మూరలు. దాని చుట్టుకొలత కూడా పదహారు మూరలుండాలి. దానికి చుట్టూ గవాక్షాలుండాలి. గోడలూ నేలా అంతా మట్టితో పూతపెట్టాలి. అందులో గోడకు చేర్చి ఇటూ అటూ ద్వారం దాకా చుట్టూ ఒక అరుగుకట్టాలి. దాని వెడల్పూ ఎత్తూకూడా మూరెడేసి వుండాలి. ఆ గుడిసెమధ్య నాలుగు మూరల అడ్డుకొలతగల ఒక కుండు కట్టాలి. అది మనిషి యెత్తున, పొగ పోడానికి తగిన ఏర్పాటుతో వుండాలి. దానికి చుట్టూ అనేక రంధ్రాలుండాలి. ఆ కుండు చంద్రకట్టెలతోనైనా, ఏపికట్టెలతోనైనా నింపి విప్పపెట్టాలి. ఆ కర్రలు బాగా మండి, పొగా, మంటా తగ్గిపోయాక –

రోగిని వాతహరతైలం శరీరం అంతటా పట్టించి పైని బట్టలు కప్పి, అందులో ప్రవేశపెట్టాలి.

రోగి, లోపలవున్న చుట్టుతిన్నెమీద ఉండుండి పక్కమార్చుకుంటూ పడుకోవాలి. మిక్కిలీ చెమట పట్టడంవల్ల మూర్ఛవస్తున్నట్టుండ వచ్చు. అయినా అరుగు విడిచిపెట్టకూడదు. అరుగు దిగనే కూడదు. కొంతసేపటికి శరీరంలోవుండే మలాలన్నీ చెమట రూపాన బయటికి వెళ్ళిపోతాయి. స్రోతస్సులన్నీ తెరుచుకుంటాయి. శరీరం తేలిక అవుతుంది. స్తంభం, సుప్తి, గురుత్వం – ఇలాంటివన్నీ తొలగిన్నీ పోతాయి. అప్పటికి స్వేదకర్మ ముగిసిందన్నమాట.

అప్పుడు రోగి అరుగుమీదుగానే ద్వారంచేరి మెల్లిగా బయటికి రావాలి. కాని వెంటనే చల్లని నీళ్ళలో స్నానం చెయ్యగూడదు. తాకనే కూడదు. అప్పుడు శరీరానికి చల్లని నీళ్ళు తగిలితే శరీరంలో వుండే వేడి చర్రున నెత్తికెక్కి కళ్ళు చెడిపోతాయి. కొంతసేపటికి ఉక్క, చెమటబాధ తగ్గిపోతాయి. మరొక క్షణం వేచివుండి అప్పుడు సుఖోష్ణమైన నీళ్ళతో చక్కగా స్నానంచేసి విధ్యుక్తప్రకారం భోజనం చెయ్యాలి. ఇది జేంతాకస్వేదం.

**జ్ఞానేంద్రియం** – నేత్రాది బుద్ధీంద్రియాలు. అంటే, శ్రోత్రం, త్వక్కు, చక్షుస్సు, జిహ్వ, ఘ్రాణమున్ను.

**జ్ఞానేంద్రియ విషయాలు** – జ్ఞానేంద్రియాలు అయిదింటికీ విషయాలు. అవి – శ్రోత్రానికి శబ్దం. త్వక్కుకు స్పర్శ. చక్షుస్సుకు రూపం. జిహ్వకు రసం. ఘ్రాణానికి గంధమున్ను.

**జ్యోత్స్నావృక్షం** – దీపపుశమ్మా.

**జ్వరఘ్నవర్గం** – సుగంధి, చక్కెర, పాఠ, మంజిష్ఠ, ద్రాక్ష, గోగు, చిట్టీత, కరక, ఉసిరి, తాడిన్నీ.

**జ్వరాగ్ని** – జ్వరంవల్ల కలిగే సంతాపం.

**జ్వరాధిష్ఠానం** – శరీరం. మనస్సున్నూ.

## ట

**టంకం** – మానపరిభాష. ఒక ధరణం.

**టంకయంత్రం** – ఇదే ఊర్ధ్వనలికాయంత్రం.

## డ

**డమరుయంత్రం** – ఔషధాలు వండడానికి ఉపయోగించే యంత్రాలలో ఇదొకటి.

**డోలాయంత్రం** – రససంస్కారానికి ముఖ్యంగా ఉపకరించే ఒక యంత్రం. ఇతర ఔషధాలు కొన్ని స్విన్నం చెయ్యడానికిన్నీ ఇది ఉపయోగిస్తుంది.

## త

**తండులధావనం** – బియ్యపు కడుగు.

**తండులోదకం** – బియ్యాని కెనిమిది రెట్లు నీళ్ళు పోసి, బాగా పిసికి ఉంచి, తేరిన నీరు తీసుకునేది. దీనికే కలి అనిన్నీ పేరు.

**తంత్రకారులు** – వీరు వైద్యశాస్త్రీయాలైన ముఖ్యగ్రంథాలు రచించిన వారు. వీరు అగ్ని వేశుడు, భేలుడు, జతూకర్ణుడు, పరాశరుడు, హారీతుడు, క్షారపాణి – ఇత్యాదులు.

**తంత్రయుక్తి** – పరదుర్వాదం ఖండించి, స్వకీయవాదం పోషించుకునే శాస్త్రీయమైన యుక్తి.

**తంద్ర** – నిద్రలో వున్నప్పుడు లాగే శబ్దస్పర్శాది ఇంద్రియ పరిజ్ఞానం వుండదు. శరీరం బరువుగా వుంటుంది. ఆవలింతలు వస్తాయి. బడలిక యెక్కువగా వుంటుంది. ఆ స్థితి పేరు తంద్ర.

**తక్రం** – అంటే చల్ల – మజ్జిగ. ఇది మస్తు, మథితం, ఉదశ్విత్తు, ఘోలం అని నాలుగు రకాలు.

రెండు రెట్లు నీళ్లుకలిపి చిలికినది మస్తు. నీళ్ళుకలపకుండా చిలికి వస్త్రంతో వడపోసింది మథితం. సగం నీళ్ళు కలిపి చిలికినది ఉదశ్విత్తు. నాలుగోవంతు నీళ్ళు కలిపి చిలికి, వెన్న తియ్యకుండా వుంచేసినది ఘోలం. మరిన్నీ యీ మజ్జిగ ఉద్ధృతం, అనుద్ధృతం, స్వల్పోద్ధృతం – అని మరిమూడు విధాలుగా వుంటుంది. వెన్న తీసేసినది ఉద్ధృతం. తీసివెయ్యనిది అనుద్ధృతం. కొంచెం మాత్రమే తీసినది స్వల్పోద్ధృతం.

**తక్రకూర్చిక** – పాలలో మజ్జిగ కలిపి కాచితే విరిగిపోయి సారం అంతా ముద్దగానూ, ద్రవం అంతా నీరుగానూ విడిపోతుంది. ఇదే తక్రకూర్చిక.

**తక్రపిండం** – పాలలో మజ్జిగ కలిపి కాచితే విరిగిపోయి ముద్దగా విడిపోయినది తక్రపిండం.

**తటాకం** – ప్రశస్తమైన భూమిలో తవ్విన చెరువు.

**తన్మాత్రలు** – తామసాహంకారంవల్ల తల్లక్షణాలయిన తన్మాత్రలు పుట్టాయి. ఇవి శబ్దతన్మాత్ర, స్పర్శతన్మాత్ర, రూపతన్మాత్ర, రసతన్మాత్ర, గంధతన్మాత్ర – అని అయిదు.

**తన్మాత్రవిశేషాలు** – శబ్దం, స్పర్శ, రూపం, రసం, గంధం – ఇవి తన్మాత్రవిశేషాలు. ఇవి స్థూలంగా సుఖదుఃఖాలకు కారణం అవుతాయి.

**తరుణదధి** – పశువు ఈనిన తరువాత పదిహేను దినాలు గడిచాక సిద్ధం చేసిన పెరుగు.

**తరుణి** – 16–32 ఏళ్ళ వయసుగల స్త్రీ.

**తర్పణం** – తృప్తికరం.

**తర్పణకషాయం** – అయిదు రెట్లు నీళ్ళుపోసి, ఒక భాగం మిగిలేటట్టు కాచిన కషాయం.

**తాటాకోదకం** – తటాకం అంటే చెరువు. ఆ చెరువులో ఎన్నాళ్ళు ఉండినా చెడిపోక కషాయమధురంగా వుండే జలం తాటాకోదకం.

**తాపస్వేదం** – స్వేదకర్మలలో ఇదొకటి. వస్త్రం, ఫాలం (అంటే యినపకారు) అరిచెయ్యి – ఇవీ, ఇలాంటివీ నిప్పుమీద వెచ్చచేసి రోగి శరీరం తాకితే చెమట పుడుతుంది. ఇదీ తాపస్వేదం.

**తామసగుణాలు** – ఎప్పుడూ దుఃఖిస్తూవుండడం, నాస్తికత, అధర్మశీలత్వం, బుద్ధిమాంద్యం, అజ్ఞానం, దుర్బుద్ధి, సోమరితనం, నిద్రమత్తు – ఇవి తామస గుణాలు.

**తిక్తవర్గం** – చేదురుచి కల ద్రవ్యాలు. ఇవి సరస్వతీతీగ, వెదురుబొరు, పసుపు, మానుపసుపు, కొడిశపాలవిత్తులు, ఉలిమిరి, కాండ్రేగు, సప్తపర్ణి, వాకుడు, పెద్దములక, చోరపుష్పిక, ఎలుకచెవి ఆకు, తెగడ, చేదుబీర, కాకర, జాపత్రి, శంఖపుష్పి, ఉత్తరేణి, కామగు, కోకరోహిణి, జయంతి, సువర్చల, గలిజేరు, వృశ్చికాలి, జ్యోతిష్మతిన్నీ.

**తిక్తాద్వయం** – తిక్త, కాకతిక్త.

**తిరస్కరణి** – తెర.

**తిర్యక్పాతనం** – రసశుద్ధిక్రియలలో ఇదొకటి.

**తిర్యగ్యంత్రం** – పాదరసశుద్ధి చేసేటప్పుడు తిర్యక్పాతన క్రియకు ఉపయోగించే యంత్రం.

**తిలచూర్ణం** – నెయ్యి మొదలైన చమురులతోనూ, పాణితంతోనూ కలిసిన నువ్వులపిండి.

**తిలపిష్టకం** – తెలకపిండి.

**తీక్ష్ణాగ్ని** – జఠరాగ్నులు నాలుగింటిలోనూ ఒకటి.

**తుండాహతదష్టకం** – పళ్ళతో కాటు వెయ్యక్కరలేదు. కొన్ని జంతువుల తొండపడితే చాలు, శరీరంమీద ఆ భాగాన దంశం కనపడుతుంది. ఇది అది.

**తుల** – మానపరిభాష. నూరు పలాలు. ఎనిమిదివందల తులాలు.

**తులసిచెట్టు** – ఇది క్షుద్రపత్రతులసి, గంధతులసి, కృష్ణతులసి, బిల్వగంధతులసి, శ్వేతతులసి, బర్బరీతులసి – అని ఆరు విధాలు.

**తులాబీజం** – గురివిందగుంజ.

**తులాయంత్రం** – గుండ్రని రెండు మూసలు. వాటికి ఒక్కొక్క రంధ్రం. ఒకదానిలో గంధకచూర్ణం, మరోదానిలో పాదరసమూ ఉంచి రెండూ ఒక సన్నని గొట్టంతో కలిపి, గొట్టం కలిసినచోట చీలమన్ను పూసి వాలుకాయంత్రంలో వుంచి గంధకం వున్న మూసకింద మంటపెట్టేది. ఇది తారం, గంధకం, లోహం – వీటి జారణం కోసం ఏర్పడినది.

**తుష్టి** – చిత్తపరితోషం.

**తూలవతి** – దూది పరుపు.

**తృణపంచమూలం** – పంచమూలాలలో ఇదొక రకం. అవి – కుశదర్భ, రెల్లుదర్భ, కాకివెదురు, దర్భ, చెరుకున్ను.

**తృణరాజవర్గం** – పోకచెట్టు, తాడిచెట్టు, హింతాలవృక్షం, తాలవృక్షం, మొగలిచెట్టు, ఖర్జూరవృక్షం, కొబ్బరిచెట్టున్ను.

**తృణవృక్షాలు** – తృణరాజవర్గంలోని చెట్లే.

**తృణసంజ్ఞకం** – తృణపంచమూలాలు.

**తృణౌకం** – గడ్డియిల్లు.

**తృతీయత్రిఫలం** – జాజికాయ, ఏలకులు, లవంగాలున్ను. వీటికే సుగంధి త్రిఫలాలనిన్నీ పేరు.

**తృతీయమదం** – మద్యపానంవల్ల కలిగే అవస్థలకే మదాలని పేరు. అవి నాలుగు. ఇది మూడో మదం. ఈ మదం వచ్చేదాకా మద్యపానం చేసినవాడు – అగమ్యాలకు వెరవడు. గురుదార గమనానిక్కూడా జంకడు. అభక్ష్యాలు విడిచిపెట్టడు. తన రహస్య విషయాలన్నీ పైకి చెప్పేస్తాడు. కృత్యాకృత్య వివేక శూన్యుడై, అస్వతంత్రుడయిపోతాడు.

**తృప్తిఘ్నవర్గం** – కఫం ప్రకోపించి కడుపు నిండివున్నట్టుండే అవస్థను తొలగించే వస్తువులు. అంటే, కఫహరద్రవ్యాలు. అవి – సొంటి, చవ్యం, చిత్రమూలం, వాయువిడంగాలు, చాగనార, తిప్పతీగ, వస, తుంగముస్తలు, పిప్పళ్ళు, పాదిరిన్నీ.

దూలగొండి, తుంగగడ్డలు, పర్పాటకం, చందనం, నేలవేము, తిప్పతీగ, కురువేరు, ధనియాలు, చేదుపొట్లు.

**తేజోయంత్రం** – దీనికే లందికాయంత్రం అనీ, అర్కయంత్రం అనిన్నీ పేరు. ద్రావకం తీయవలసిన వస్తువులు ఒక పెద్దకుండలో సగం వరకు చేర్చి యుక్తప్రమాణం నీళ్ళుపోసేది. దాని ముఖాన కింది కుండకు సంబంధం గల ఒక గొట్టమూ, బయటికి సంబంధంగల ఒక గొట్టమూ ఏర్పాటుచేసివున్న యంత్రం బిగించి చీలయిచ్చేది. పై యంత్రంలో చన్నీళ్ళుపోసి అవి వేడెక్కితే తీసివేసి మళ్ళీ చన్నీళ్ళు పోస్తూవుండాలి. కింది కుండకింద మంట పెడితే మూలికలు ఉడికి, ఆవిరి కింది గొట్టములోనుంచి బయట అమర్చిన సీసాలో ప్రవేశించి ద్రావకం అయిపోతుంది.

**తైజసం** – త్రివిధ అహంకారాలలో ఇదొకటి. ఇది రాజసం.

**తైలం** – అంటే నూనె. ఇది పద్దెనిమిది రకాలు. అవి – నువ్వులనూనె, ఆవనూనె, కుసుమనూనె, అవిశనూనె, ధనియాలనూనె, ఆముదం, కానుగనూనె, ఇంగుదీనూనె, నిమ్మనూనె, తానికాయనూనె, వావిలినూనె, జ్యోతిష్మతీనూనె, కరకనూనె, ఇప్పనూనె, కోశామ్రనూనె, చిత్రానూనె, కర్పూరతైలం, ములుదోస నూనె – అని.

**తైలకిట్టం** – తెలకపిండి.

**తైలద్రోణి** – అంటే నూనెతో నిండిన కర్ర తొట్టె. ఇది మనిషి పొడుగునా వుంటుంది. ఓషధులు వేసి తయారుచేసిన నూనె ఇందులో నింపుతారు. అందు రోగిని పడుకోబెడతారు. ఇదొక చికిత్సాపద్ధతి. ఇది మలయాళదేశంలో ఎక్కువగా వాడుకలో వున్నట్టు తెలుస్తుంది.

**తైలమూర్ఛ** – ఔషధాలలో వాడేనూనెకి ముందు మూర్ఛన సంస్కారం చేసి మరీ వాడాలి. అలాచేస్తే దుర్గంధంపోయి పరిమళం వస్తుంది. గుణకారిన్నీ అవుతుంది.

**తోదనం** – సూదులతో గుచ్చుతున్నట్టూ, కత్తితో కోస్తున్నట్టూ కలిగే బాధ.

**తోలకం** – మానపరిభాష. ఒక తులం.

**త్రయోదశస్వేదాలు** – చరకమతంలో స్వేదకర్మ పదమూడు విధాలు. అవి – సంకరస్వేదం, ప్రస్తరస్వేదం, నాడీస్వేదం, పరిషేకస్వేదం, అవగాహస్వేదం, జేంతాకస్వేదం, అశ్మఘనస్వేదం, కర్షూస్వేదం, కుటీస్వేదం, భూస్వేదం, కుంభికాస్వేదం, కూపస్వేదం, హోలకస్వేదమున్ను.

**త్రసరేణువు** – మానపరిభాష. ముప్ఫయి పరమాణువులు ఒక త్రసరేణువు.

**త్రింశపత్రం** – కలవపువ్వు. ముప్ఫయి రేకలు కలది.

**త్రికంటకం** – వాకుడు, దూలగొండి, పల్లేరున్ను.

**మతాంతరం:** పెద్దములక, చిన్నములక, దూలగొండిన్ని.

**త్రికటుకం** – సొంటి, పిప్పలి, మిరియాలున్ను.

**త్రికత్రయం** – త్రికటుకాలు, త్రిఫలాలు, త్రిమదాలు – వీటి సమభాగాలు.

**త్రికర్షికం** – సొంటి, అతివస, తుంగముస్తలున్ను.

**త్రిగంధం** – దాల్చిని, ఆకుపత్రికం, ఏలకులున్ను.

**త్రిగుణాలు** – సత్వ రజ స్తమోగుణాలు.

**త్రిజాతకం** – దాల్చిని, ఏలకులు, ఆకుమోద మున్ను.

**త్రిదోషం** – వాత పిత్త కఫాలు.

**త్రిదోషసమం** – వాతపిత్తకఫాలు ఎచ్చుతక్కువలు లేకుండా సమస్థితిలో వుండడం. ఇది ఆరోగ్యస్థితి.

**త్రిపటు** – బిడాలవణం, సైంధవలవణం, కాచలవణమున్ను.

**త్రిఫల** – కరక తాడి ఉసిరికలు.

**త్రిఫల** – మహాత్రిఫల, లఘుత్రిఫల, సుగంధ త్రిఫల, మధురత్రిఫల అని నాలుగు విధాలు. కరకతాడి ఉసిరికలకే మహాత్రిఫల అనిన్నీ పేరు. పెగ్గుమ్ముడు, ఖర్జూరం, చిట్టీతపండు – ఇది లఘుత్రిఫల. ద్రాక్షపండు, ఖర్జూరపండు, దానిమ్మపండు – ఇది మధురత్రిఫల. జాజికాయ, ఏలకులు, లవంగాలు – ఇది మతాంతర సుగంధత్రిఫల.

**త్రిబల** – పచ్చపువ్వులబల, నాగబల, తెల్ల పువ్వులబల.

**త్రిమదం** – వాయువిడంగాలు, తుంగముస్తలు, చిత్రమూలం.

**త్రిమదద్వితయం** – త్రిమదాలూ, త్రిఫలాలూ కలిసినది.

**త్రిమధు** – తేనె, నెయ్యి, చక్కెర.

**త్రిమధురం** – నెయ్యి, చక్కెర, తేనె. దీనికే మధురత్రయ మనిన్నీ పేరు.

**త్రిలవణం** – సౌవర్చలవణం, సైంధవలవణం, బిడాలవణమున్ను.

**త్రిలోహం/త్రిలోహకం** – బంగారం, వెండి, రాగిన్ని.

**త్రివర్గం** – త్రికటుకాలు, త్రిఫలాలు, త్రిమదాలున్ను.

**త్రివర్గం** – ధర్మం, అర్థం, కామమున్ను.

**త్రివర్గద్వితయం** – త్రిఫలాలు, త్రిమదాలున్ను.

**త్రివర్ణకం** – త్రికటుకాలు, త్రిఫలాలు, త్రిజాతకాలున్ను.

**త్రివిధాయతనం** – రోగకారణాలు మూడు. అవి – ఇంద్రియార్థాతియోగం, కర్మాతియోగం, కాలాతియోగమున్ను. ఇంద్రియములకూ ఇంద్రియార్థాలైన శబ్దస్పర్శరూప రసగంధాలనే ఇంద్రియాలకు అతియోగం ఇంద్రియార్థాతియోగం. శరీరానికే వాక్కులకూ మనస్సుకూ సంబంధించిన వ్యాపారరూపమైన కర్మకు అతియోగం కర్మాతియోగం. శీతోష్ణరూపమైన కాలానికి అతియోగం కాలాతియోగం.

**త్రివిధద్రవ్యాలు** – జంగమాలు, పార్థివాలు, ఔద్భిదాలు అని ద్రవ్యాలు మూడు విధాలు.

**త్రివిధనస్యాలు** – విరేచననస్యం, బృంహణనస్యం, శమననస్యం – అని నస్యకర్మ మూడు విధాలు.

**త్రివిధబలం** – సహజం, కాలజం, యుక్తికృతం అని బలం మూడు విధాలు.

**త్రివిధరోగమార్గాలు** – రోగమార్గాలు మూడు. అవి – శాఖలు, మర్మాస్థిసంధులు, కోష్ఠమున్ను.

**త్రివిధరోగాలు** – నిజరోగాలు, ఆగంతురోగాలు, మానసికరోగాలు – అని రోగాలు మూడు విధాలు.

**త్రివిధవస్తికర్మలు** – చికిత్స ప్రారంభించడానికి ముందు వస్తికర్మ తప్పకుండా చెయ్యాలి. అది నిరూహవస్తి, అనువాసనవస్తి, ఉత్తరవస్తి అని మూడు విధాలు.

**త్రివిధవైద్యులు** – వేషధారి, సిద్ధిసాధితుడు, వైద్యగుణయుక్తుడు – అని వైద్యులు మూడు రకాలు.

**త్రివిధౌషధాలు** – దైవవ్యపాశ్రయం, యుక్తివ్యపాశ్రయం, సత్వావజయం – అని ఔషధాలు మూడు రకాలు.

**త్రివృతస్నేహం** – నెయ్యి, నూనె, మజ్జ (మూలుగు), వస (కొవ్వు) మొదలైన చమురు దినుసులలో ఏ మూడైనా కలిస్తే దానికి త్రివృత స్నేహం అని పేరు.

**త్రివృతాదిగణం** – తెగడ, సుగంధి, నేపాళాలు, ద్రవంతి, సప్తల, శంఖిని, విషాణిక, కవాక్షి, ఛగలాంత్రి, స్నుక్కు, సువర్ణక్షీరి, చిత్రమూలం, కిణిహి, కుశ, కాశ, తిల్వకం, కంపిల్లకం, పాటల, పోక, హరీతకి, ఆమలకం, తాడికాయ,

నీలివి, చతురంగుళం, ఆముదం, కానుగు, మహావృక్షం, సప్తపర్ణి, జిల్లేడు, జ్యోతిష్మతిన్నీ.

త్రివేణి – గంగ, యమున, సరస్వతి – ఈ మూడు నదులూ సంగమించే స్థలం.

త్రిశర్కర – గుడోత్పన్న, హిమోత్పన్న, మధుర – అని శర్కర మూడు విధాలు.

త్రిసమం – కరక, సొంటి, తిప్పతీగ.

త్రిసవనం – ప్రాతస్సంధ్య, మాధ్యాహ్నికసంధ్య, సాయంసంధ్య – ఈ త్రికాలాలలోనూ చేసిన స్నానం

త్రిసుగంధం – దాల్చిని, ఏలకులు, ఆకుపత్రిక మున్ను.

త్రిసూత్రం – హేతులింగ ఔషధజ్ఞానం.

త్రిస్కంధం – హేతులింగ ఔషధజ్ఞానం.

త్రిహిమం – చందనం, రక్తచందనం, పీతచందనమున్ను.

త్రిక్షారం – యవక్షారం, సర్జిక్షారం, టంకణ (వెలిగారం) క్షారమున్ను.

త్రుటిద్వయం – చిన్నఏలకులు, పెద్దఏలకులున్ను.

త్ర్యంజనం – కాలాంజనం, పుష్పాంజనం, రసాంజనమున్ను.

త్ర్యూషణం – సొంటి, పిప్పళ్ళు, మిరియాలున్ను.

త్వక్పంచకం – మర్రి, మేడి, రావి, జువ్వి, వేతస పట్టలు.

త్వక్శూన్యత – స్పర్శజ్ఞానం లేకపోవడం.

త్వక్సారాలు – తెగడ, సన్నరాష్న, చిత్రమూలం, నీలి, సుగంధిన్ని ఇత్యాదులు.

త్వచ్యం – చర్మానికి హితకరం.

## ద

దండాహతం – ఒక పాలు నీళ్ళు, మూడు పాళ్ళు పెరుగున్ను కలిపి చిలికిన చల్ల.

దంతధావనకాష్ఠం – ఇది 12 అంగుళాల పొడుగు ఉండాలి. చిటికెన వేలంత లావుగా వుండాలి. సాఫుగా – కణువులు లేకుండా పురుగు నాకవిదిగా వుండాలి. వేప, చండ్ర, యష్టిమధుకం, కానుగు, జిల్లేడు, మద్ది – ఇత్యాది చెట్ల చిగురుకొబ్బలు వాడవచ్చు. కరవీరం, చింత, పొగడ, వేగిసపుల్లలున్నూ వాడవచ్చుననీ, ముళ్ళుగలవి అన్నీ వాడవచ్చువనిన్నీ మతాంతరం. ఏ పుల్లలైనా వగరు, తీపి, చేదు, కారం – ఈ రసాలు గలవి శ్రేష్ఠం. వగరుగల వాటిలో చండ్ర, చేదున్నవాటిలో వేప, తీపిగలవాటిలో యష్టిమధుకం, కారపువాటిలో కానుగు చాలా మంచిది. కాని – పోక, తాల, హింతాల, ఖర్జూర, మొగలి, కొబ్బరి, తాడి – ఈ చెట్ల ఈనెలతో మాత్రం ఎప్పుడూ పళ్ళు తోముకోగూడదు.

దధి – అంటే పెరుగు. ఇది మందకదధి, మధురదధి, మధురామ్లదధి, అమ్లదధి, అత్యమ్లదధి – అని అయిదు రకాలు.

దధికూర్చిక – పెరుగుకలిపి కాచినపాలు, విరిగిపోయి సారం అంతా ముద్దగానూ, ద్రవం అంతా నీరుగానూ విడిపోతుంది. అదే దధికూర్చిక.

దధిచారం – కవ్వం.

దధిద్రప్సం – పలచని పెరుగు.

దధిమండం – మజ్జిగతేట.

దధిమండతాకం – పెరుగుమీద తేట.

దధిసరం – పెరుగుమీద కట్టిన మీగడ.

దధిసక్తులు – పెరుగులో నానబెట్టిన అటుకులు.

దధిస్నేహం – మీగడ.

దధిస్వేదం – చల్ల.

దశమూత్రకం – ఏనుగు, దున్నపోతు, లొట్టిపిట్ట, ఆవు, మేక, మేషం, గుర్రం, గాడిద, నర, నారి – మూత్రం.

దశమూలం – మారేడు, దుండిగం, పెగ్గుమ్ముడు, కలిగొట్టు, తక్కోల, ములుమ్యాకుపొన్న, కోలపొన్న, వాకుడు, పెద్దములక, పల్లేరున్ను.

దశశాకం – పట్ట, ఆకు, వేరు, పండు, కాడ, మొలక, పువ్వు, కపికచ్ఛు, పర్పటకం, కలబంద – ఇవి.

దక్షిణాయనం – సూర్యుడు కర్కటకరాశిలో ప్రవేశించినది మొదలు మకరంలో ప్రవేశించే దాకా వుండినకాలం.

దానం – చెట్టుతొర్రలో పుట్టిన తేనె.

దారకర్మ – వివాహం.

దారుణకర్మ – మెత్తని కురువులను గట్టిపరచడం.

దాలం – ఎనిమిది రకాల తేనెలలో ఇదొకటి.

దాకప్రశమనవర్గం – వరిపేలాలు, చందనం, నేలగుమ్ముడు, యష్టిమధుకం, చక్కెర, నల్లకలువ, వట్టివేరు, సుగంధిపాల, తిప్పతీగ, కురువేరున్ను.

**దాక్షిణాత్యం** – కొబ్బరిచెట్టు – ఇది దక్షిణదేశీయవృక్షం.

**దినచర్య** – పగటిపూట చెయ్యవలసిన కార్యక్రమం వివరాలు – బ్రాహ్మముహూర్తంలో నిద్రమేలుకోవాలి. ఇష్టదేవతాపూజ చేసుకోవాలి. పెరుగు, నెయ్యి, అద్దం, మారేడు, గోరోచనం – ఇత్యాదులు చూడాలి. తాకాలి. నేతిలో తనముఖం చూసుకోవాలి. దంతధావనం, నాలుక గీసుకోవడం, మొగం కడుక్కోవడం, తైలాభ్యంగం, స్నానం, భోజనం – ఇత్యాదులున్ను.

**దివసభోజనం** – అంటే పగటి భోజనసమయం. ఔషధం, పుచ్చుకోవలసిన సమయాలలో ఇదొకటి. అపానవాతం ఎక్కువగా వుండినా అరోచకం వుండినా భోజనం ప్రారంభించగానే ఔషధం పుచ్చుకోవాలి. సమానవాతం ప్రకోపించివుండినా, అగ్నిమాంద్యం వుండినా భోజనం సగం అయిన తరవాత ఔషధం పుచ్చుకోవాలి. వ్యానవాతం ప్రకోపించివుంటే భోజనం కాగానే ఔషధం పుచ్చుకోవాలి. ఎక్కిళ్ళు, ఆక్షేపకవాతం, కంపవాతం – ఇవి ఉంటే భోజనానికి ముందూ వెనకా కూడా ఔషధం పుచ్చుకోవాలి.

**దివాస్వాపం** – అంటే పగటినిద్ర. ఒక్క గ్రీష్మకాలంలోతప్ప తక్కిన సర్వకాలాల యందూ ఇది నిషిద్ధం. అయితే, దేశకాలాల ననుసరించి కొందరికి పగటినిద్ర అలవాటయి వుంటుంది. వారికి రాత్రి చాలాసేపు మేలుకున్న వారికీ మాత్రం పగటినిద్ర నిషేధం కాదు. ఇంతేకాక – స్త్రీ లంపటులు, ఎక్కువగా నడిచేవారు, వాహనాలెక్కి తిరిగేవారు, అతిసారరోగులు, దప్పికకలవారు, శ్రమపడ్డవారు, శూల, శ్వాసవ్యాధి, ఎక్కిళ్ళు, వాతవ్యాధులున్నా కలవారు, క్షీణించివుండినవారు, కఫం క్షీణించినవారు, పిల్లలు, మత్తులు, వృద్ధులు, రసాజీర్ణం కలవారు, భోజనం చెయ్యనివారు – వీరికిన్నీ పగటినిద్ర నిషిద్ధంకాదు.

**దివ్యపంచామృతం** – సమభాగాలుగా గ్రహించిన ఆవు నెయ్యి, ఆవు పెరుగు, ఆవు పాలు, తేనె, చక్కెరలు.

**దివ్యోదకం** – ఆకాశజలం.

**దీనారం** – మానపరిభాష. నాలుగు మాషాల యెత్తు.

**దీపనం** – రససంస్కారాలలో వొకటి.

**దీపనం** – ఆరోభాగం మిగిలేటట్టు కాచిన కషాయం.

**దీపనం** – అగ్నిదీప్తికరం. ఆకలిపుట్టించేది.

**దీపనవస్తి** – తేనె, నెయ్యి, పాలు, మానె – ఇవి ఒక్కొక్కటి రెండేసి పలాలు. బోడతరం, సైంధవలవణం – ఇవి ఒక్కొక్క కర్షం – వీటితో చేసేది దీపనవస్తి. దీనికే యాపనవస్తి అనిన్నీ పేరు.

**దీపనీయం** – అగ్నిదీప్తికరం.

**దీపనీయవర్గం** – అంటే అగ్నిదీప్తికర ద్రవ్యాలు. అవి – పిప్పళ్ళు, పిప్పలిమోడి, చవ్యం, చిత్రమూలం, సొంటి, అమ్లవేతసం, మిరియాలు, అజామోదం, వల్లితీడిగింజల పప్పు, ఇంగువ.

**దీపనీయౌషధం** – అగ్నివృద్ధి కరౌషధం.

**దీపనౌషధం** – తిన్నది జీర్ణం కాకుండానే మళ్ళీ ఆకలి పుట్టించే సదాపమొదలైనవి దీపనౌషధాలు.

**దీర్ఘిక** – మూడువందల ధనుస్సుల పరిమాణంగల చెరువు.

**దుఃఖత్రయం** – ఆధ్యాత్మికం, ఆధిభౌతికం, ఆధిదైవికం అని దుఃఖం మూడు విధాలు.

**దుగ్ధకందగణం** – అంటే దుగ్ధప్రధానాలైన దుంపలు. అవి – పెన్నేరు, నేంతాడి, నేలగుమ్ముడు, పిల్లితేగలు, పాలగుమ్ముడున్ను.

**దుగ్ధత్రయం** – ఆవుపాలు, బర్రెపాలు, మేకపాలున్ను.

**దుగ్ధక్షైరిక** – పాలు, బియ్యం, నెయ్యి, చక్కెర చేర్చి చేసిన పాయసం.

**దుర్దినం** – ఆకాశం అంతా మబ్బుకమ్మిన దినం.

**దుశ్చికిత్స్యుడు** – చికిత్సకు లొంగని జబ్బుగల రోగి.

**దూత** – రోగినిమిత్తం వైద్యులను పిలుచుకు రావడానికి వెళ్ళే మనిషి.

**దూర్వాదివర్గం** – దూర్వలు, సుగంధి, వేప, అడ్డసరం, దూలగొండి, దర్భ, పిల్లితేగలు, కాకోలి, ప్రేంకణాలున్ను.

**దూష్యజలం** – మల మూత్రాలు కలిసినది. ఎర్రబడ్డది, నీలికగలది, చిక్కనిది, నురగవచ్చేది, పళ్ళుబిగిసేటంత చల్లనిది, ఉప్పగావున్నది, నాచుకమ్మినది, పురుగులున్నది, చెత్తచెదారంతో కుళ్ళినది, ఎండా, వెన్నెలా తగలనిది – ఇవి దుష్టజలాలు.

**దృష్టిపర్యయం** – శాస్త్రనిషిద్ధ దృష్టి.

దృఢరజస్క – ప్రౌఢాంగన.
దృష్టరజస్క – మధ్యమాంగన.
దృష్టిదూషణం – కళ్ళకు చెరుపుచేసేది.
దేవకర్దమం – అంటే అయిదు సుగంధ ద్రవ్యాలు. అవి – శ్రీఖండం (పచ్చచందనం), చందనం, అగురుచెక్క, పచ్చకర్పూరం, కుంకుమ పువ్వున్ను.
దేవఖాతకం – కృత్రిమం కాని – స్వభావసిద్ధమైన పెద్ద జలాశయం. మడుగు వంటిది.
దేవగిరి – హిమాలయ పర్వతం.
దేవమాతృకం – వర్షాధారంవల్ల పంటలు పండే భూమి.
దేవమాసం – గర్భాష్టమ మాసం.
దేవసృష్ట – మద్యవిశేషం.
దేహనాంప్రియ – మేక.
దేశం – ఆనూపం, జాంగలం, మిశ్రం అని దేశం మూడు విధాలు.
దేహం – శరీరం. స్థూలం, కృశం, మధ్యమం అని యిది మూడు విధాలు. ఏ పని చెయ్యాలన్నా దేహధారికి బలం ప్రధానం. కనక, వైద్యుడు కృశించినవారిని బలిపించాలి. స్థూలంగా వున్నవారిని కృశింపచెయ్యాలి. మధ్యములను ఆ స్థితి చెడకుండా కాపాడుతూ వుండాలి. ఒక్కొక్కచోట కృశించివుండిన వారు బలవంతులూ, పుష్టిగా వుండినవారు దుర్బలులున్నూ అయివుంటారు. ఎలాగయినా శరీరం బలపడి వుండడం ఆగత్యం.
దేహకోశం/దేహత్వక్కు – చర్మం.
దేహధారకం – ఆహారం, ఎముకలు.
దేహదృక్కు – వాయువు.
దేహయాత్ర – మృత్యువు, అన్నం.
దేహవల్కాలం – వస.
దేహసారం – మజ్జ (మూలుగు).
దేహక్షయం – రోగం.
దైన్యం – అసామర్థ్యం.
దైవం – పురాకృతకర్మ.
దైవవ్యపాశ్రయం – ఇది త్రివిధౌషధాలలో వొకటి. మణిమంత్రాలు, పూజలు, హోమాలు, ప్రాయశ్చిత్తాలు, సూర్యనమస్కారాలు, మొక్కులు – ఇలాంటివాటితో దైవానుగ్రహం సంపాదించుకుని తద్వారా ఆరోగ్యభాగ్యం అనుభవించడం.
దైవి – త్రివిధ చికిత్సలలో ఇదొకటి. పాదరసం ప్రధానంగాగల చికిత్స దైవి.
దోగ్ధ్రి – పాలిచ్చే ఆవు.
దోషం – వాతం, పిత్తం, కఫం అని యిది మూడు విధాలు. వీటికే ధాతువులనీ మలాలనిన్నీ పేరు. ధాతువులూ మలాలూ యీ వాత పిత్త కఫాలవల్ల దూషితా లవుతాయి. కనక వీటికిన్నీ దోషాలని పేరు. దేహధారణం చేస్తాయి. కనక అవి ధాతువులు. రసాదులకు మలినీ భావం (కరణం) కలిగిస్తాయి. కనుక అవి మలాలు. శరీరం దోషధాతు మలమూలం. ప్రస్పందనం, ఉద్వహనం, పూరణం, వివేకం, ధారణం అని వాయువు అయిదుగా విభక్తమై శరీరధారణం చేస్తుంది.

సంధి సంశ్లేషణ, స్నేహన, రోపణ, పూరణ, బలస్థైర్యకృత్ – అని శ్లేష్మం అయిదుగా విభక్తమైన ఉదకకర్మతో అనుగ్రహం కలిగిస్తుంది. రాగ, పక్తి, ఓజస్సు, తేజస్సు, మేదోష్మకృత్ – అని పిత్తమున్నూ అయిదుగా విభక్తం అయి అగ్నికర్మతో అనుగ్రహం కలిగిస్తుంది. కనక, వీటిని జాగ్రత్తగా కాపాడుకుంటూ వుండాలి.
దోషజ్ఞుడు – వైద్యుడు.
దోషత్రయం – వాతమూ, పిత్తమూ, కఫమున్ను.
దోషలం – దోషప్రకోపం కలిగించేది.
దోషహరవస్తి – వస్తికర్మలలో ఇదొకటి. పిల్లితేగలు. యష్టిమధుకం, మారేడుపండు, కొడిశపాలపండు – ఇవి సమభాగాలుగా చేర్చి కాంజకంతో మెత్తగా నూరి, గోమూత్రంకూడా కలిపి, వస్తిప్రయోగం చేసేది. ఇది దోషహరవస్తి.
దోహదం – గర్భిణీ దోహదం.
దోహదవతి – గర్భవతి.
దోహనం – స్తనాలనుంచి పాలు తియ్యడం.
దౌహృద – గర్భవతి.
దౌహృదం – గర్భం.
దౌహృదవాంఛలు – గర్భవతి అయివున్న స్త్రీ హృదయానికీ, గర్భంలో వున్న శిశువు హృదయానికీ సంబంధం వుంది. అంచేతనే గర్భవతులు అనేకరకాల కోరికలు కోరతారు. ఆ కోరికలన్నీ తీర్చవలసినవే. లేకపోతే, శిశువులకు అనేక వికారా లేర్పడతాయి.

**దౌహృదిని** – రెండు హృదయాలు కలది. గర్భవతి.

**ద్రంక్షణం** – మానపరిభాష. రెండు టంకాల యెత్తు.

**ద్రవస్వేదం** – స్వేదకర్మలలో ఇదొకటి. మునగపట్ట, వట్టివేరు, చిట్టాముదపు ఆకులు, కానుగు ఆకులు, తులసి ఆకులు, గగ్గిర ఆకులు, దిరిసెన ఆకులు, అడ్డసరపాకులు, వెదురాకులు, జిల్లేడాకులు, జాజిఆకులు, పెదమాను ఆకులు, వచాదిగణంలో చెప్పిన ద్రవ్యాలు, అనూపజంతువుల మాంసం, జలజంతువుల మాంసం, దశమూలాలు – ఇవి వేరువేరుగా అయినా, ఏ రెండయినా, అన్నీ అయినా, ఆయాదోషాలు హరించే ఘృతం మొదలైన చమురు దినుసులలో ఒకదానిలో కలిపి, దానిలో సుర, శుక్తం, జలం, పాలు – వీటిలో ఒకటికూడా కలిపి కషాయం కాచాలి. అది వడబోసి ఒక కుండలో వుంచుకునేది. రోగి శరీరంమీద బట్టకప్పి, వెచ్చవెచ్చని ఆ కషాయంతో ఆ బట్ట తడుపుతూ వుంటే చెమట పుడుతుంది. ఇది ద్రవస్వేదం.

**ద్రవ్యం** – ఇది షడ్రసయుక్తం. శమనం, కోపనం, స్వస్థహితం అని ద్రవ్యం మూడు విధాలు.

**ద్రవీకరణం** – కరిగేటట్టు చెయ్యడం.

**ద్రవ్యత్రైవిధ్యం** – దోషప్రశమనం, దోషదూషణం, స్వస్థహితం అని ద్రవ్యం మూడువిధాలు – ఇది మతాంతరం.

**ద్రావకపంచకం/ద్రావకవర్గం** – ద్రవించే వస్తువులు. ఇవి అయిదు. గుంజ, వెలిగారం, తేనె, నెయ్యి, బెల్లమున్ను.

**ద్రాక్షం** – ద్రాక్షపండుతో చేసిన మద్యం.

**ద్రుతమాంసం** – చెవుల పిల్లులు, జింకలు మొదలైనవి మిక్కిలీ వడిగా నడిచే జంతువులు. వాటిమాంసం ద్రుతమాంసం.

**ద్రుమగం** – స్వల్పజలప్రదేశం.

**ద్రోణం** – 400 ధనుస్సుల పరిమాణం గల జలాశయం.

**ద్రోణం** – మానపరిభాష. 4 ఆఢకాల పరిమితి.

**ద్వంద్వజం** – రెండు దోషాలవల్ల పుట్టిన వ్యాధి.

**ద్వికటుకం** – పిప్పళ్ళు, మిరియాలున్ను.

**ద్వికాకోలీ** – కాకోళి, క్షీరకాకోళిన్నీ.

**ద్విచిత్రకం** – తెల్లచిత్రమూలం, ఎర్రచిత్రమూలం.

**ద్విజభక్తుడు** – వైద్యుని యెడల భక్తిగలరోగి.

**ద్వితిక్త** – కటుకరోహిణి, కామునున్ను.

**ద్వితీయత్రిఫల** – ద్రాక్షపండు, ఖర్జూరపుపండు, గంభారిన్ని.

మతాంతరం: ద్రాక్షపండు, ఖర్జూరపుపండు, పెగ్గుమ్మ్ముడున్ను. వీటికే స్వాదుత్రిఫలాలనీన్నీ పేరు.

**ద్వితీయమదం** – మద్యపానంవల్ల కలిగే అవస్థలలో ఇది రెండోది. ఈ అవస్థ వచ్చేటట్టు మద్యపానం చేసినవాని మాటలు, బుద్ధి, స్మృతి అస్పష్టంగా వుంటాయి. పిచ్చివాడిలా ప్రవర్తిస్తాడు. ఉంటే శాంతం – లేకపోతే కోపమున్నూ వుంటుంది. అలసభావమూ, నిద్రమత్తూ వుంటాయి.

**ద్వినిశ** – పసుపు, మానుపసుపున్ను.

**ద్విపంచమూలం** – అంటే దశమూలాలు.

**ద్విపర్ణి** – శాలిపర్ణి, పృశ్నిపర్ణి.

**ద్విపాఠ** – రెండు రకాల పాఠలు.

**ద్విపునర్నవం** – తెల్లగలిజేరు, ఎర్రగలిజేరున్ను.

**ద్విబృహతి** – వాకుడు, పెద్దములక.

**ద్విబ్రాహ్మి** – సరస్వతీతీగ, పొట్టేది పొడుగుదిన్ని.

**ద్విమధుకం** – యష్టిమధుకం, జలయష్టిమధుకమున్ను.

**ద్విమాషం** – ముద్గపర్ణి, మాషపర్ణి.

**ద్విరజని** – పసుపు, మానుపసుపు.

**ద్వివార్తాకి** – వాకుడు, పెద్దములక.

**ద్వివిధవీర్యం** – ద్రవ్యాలకు గల వీర్యం, ఉష్ణవీర్యం (వేడి చేసేది), శీతవీర్యం (చలవచేసేది) అని రెండు రకాలని కొందరు చెప్పారు.

**ద్వివిషం** – అతివస – ఇది తెలుపు, నలుపు అని రెండు రకాలు.

**ద్విహరిద్ర** – పసుపు, మానుపసుపు.

**ద్విహృదయ** – గర్భవతి.

**ద్విక్షారం** – సర్జిక్షారం, యవక్షారమున్ను.

**ద్విక్షీరం** – ఆవుపాలు, మేకపాలున్ను.

## ధ

**ధనపిశాచి** -- ఆశ.

**ధనైషణ** – మూడు ఏషణలలో వొకటి. ధనం ఆర్జించే సాధనం. మనిషికి ప్రాణం తరవాత ధనమున్ను అతి అగత్యం. ఆరోగ్యానికి భోగానికిన్నీ మాత్రమే కాక, పరలోకసాధన కున్ను ధనం కావాలి. ఆ ధనం లేనివాడికి దీర్ఘకాలజీవితంకంటే బాధాకరమైనది మరొక టిలేదు. కావి, ప్రాణం కాపాడుకుంటూ, ఆ వెంటవెంటనే ప్రతీవాడూ ధనార్జన కూడా ఆవశ్యకమూ చేసుకోవాలి. దీనికి మార్గాలు – వ్యవసాయం, పశుధనం, వాణిజ్యం, రాజసేవ – ఇవి ముఖ్యాలు. సజ్జనులు గర్హించని యితరపద్ధతులున్ను అవలంబించవచ్చును. అలా చేసినవారు సుఖవంతుడే కాక గౌరవ్యుడున్నూ అయివుంటారు.

**ధన్వంతరి** – ఆయుర్వేద శాస్త్రప్రణేత.

**ధన్వమాంసం** – నిర్జనప్రదేశంలో వుండే పశువుల మాంసం.

**ధన్వామిషం** – ధన్వమాంసం.

**ధమని** – శిరావికారమే ధమని. ఇది నాభి మొదలు శరీరం అంతటా వుండి, వాతం వ్యాపింపచేసే బోలునరాలు.

**ధరణం** – మానపరిభాష. నాలుగుమాషాల మెత్తు.

**ధవిత్రం** – మృగచర్మంతో చేసిన వీవన.

**ధాతుఘనం** – శరీరంలో వుండే రసధాతువు.

**ధాతుచేతనకరం** – పాలు.

**ధాతుపాకం** – రసాది ధాతువుల క్షీణత.

**ధాతువాది** – ఖనిజశాస్త్రజ్ఞుడు.

**ధాతువు** – వాత పిత్త కఫ రూపాలైన దోషం.

**ధాతువు** – గైరికం, మణిశిల ఇత్యాది ఖనిజాలు.

**ధాతువు** – రసం, రక్తం, మాంసం, మేదస్సు, అస్థి, మజ్జ, శుక్రం అనే శరీర ధాతువులు.

**ధాతువు** – ఖనిజాలైన స్వర్ణాదులు. సప్తవిధాలూ, అష్టవిధాలూ, నవవిధాలూ అయిన లోహాలు స్వర్ణం, రజతం, రాగి, వంగం, సత్తు, సీసం, లోహం– ఇవి సప్తధాతువులు, బంగారం, వెండి, రాగి, కంచు, ఇత్తడి, నాగం, వంగం, లోహం – ఇవి అష్టలోహాలు. స్వర్ణం, రజతం, ఇత్తడి, రాగి, వంగం, లోహం, కాంస్యం, కాంతం, మాండూరం – ఇవి నవధాతువులు. వీటిలో బంగారం మూడు రకాలు. రజతం ఎనిమిది రకాలు. రాగి అయిదురకాలు. వంగం రెండు రకాలు. సత్తు మూడు రకాలు. నాగం ఆరు రకాలు. లోహం ఎనిమిది రకాలు.

**ధాతువైషమ్యం** – వాతపిత్తకఫాలు విషమంగా వుండడం. అంటే వ్యాధి.

**ధాతుసామ్యం** – వాతపిత్తకఫాలు సమంగా – ఉండవలసినట్టుండడం. అంటే ఆరోగ్యం.

**ధాన్యపంచకం** – ధనియాలు, సొంటి, తుంగ ముస్తలు, కురువేరు, మారేడున్ను – వీటి కషాయం ఆమశూలహరం.

**ధాన్యామ్లం** – రసస్వేదనకర్మలో ఉపయోగించే కాంజికం.

**ధార** – వీటిలో ఇదొకరకం. ధార అంటే వర్షోదకం. ఆకాశమునుంచి ధారగాపడే జలం. రాతిమీదనో, నేలమీదనో పడే యీ జలం స్వీకరించి, తెల్లనిబట్టతో వడబోసుకుని, స్వర్ణం, వెండి, స్ఫటికం వీటితో చేసిన పాత్రలలో ఉంచుకునేది.

**ధారాంకురం** – స్వల్పవర్షం.

**ధారాయంత్రం** – నీళ్ళు చల్లేపాత్ర.

**ధారి** – ఆయువు.

**ధారోష్ణాలు** – పితికేటప్పుడు పాలు వెచ్చగా ఉంటాయి. ఇవి మిక్కిలీ మంచివి. వీటికే గుమ్మపాలు అని పేరు.

**ధూమనేత్రం** – అంటే ధూమపానం చెయ్యడాని కుపయోగించే గొట్టం. ఎవరు ధూమపానం చేస్తారో వారి అంగుళాల కొలతతో ఈ గొట్టం – శిరోవిరేచనధూమపానావి కయితే ఇరవైనాలు గంగుళాల పొడుగూ, స్నైహిక ధూమపానాని కయితే ముప్పయిరెండంగుళాల పొడుగూ వుండాలి. ఇది వంకరగా వుండగూడదు. దీనికి మూడే గణుపులుండాలి. చివరి రంధ్రం రేగుగింజ దూరేటంత వుండాలి. ఇది వస్తియంత్రం తయారుచేసే వస్తువులతోనే తయారుచేసుకోవచ్చు.

**ధూమపానం** – ప్రాయోగికం, స్నైహికం, వైరేచనికం అని యిది మూడు విధాలు.

**ధూమమహిషి** – మంచు.

**ధూమమర్తి** – ధూమపానద్రవ్యాలు మెత్తగా నూరి, ఆ ముద్ద, బొటన వేలంత లావూ, ఎనిమిది అంగుళాల పొడుగూ ఉండేటట్టు సన్నని రెల్లుపుల్లకు పట్టించేది. రంధ్రం చెడకుండా ఆ పుల్ల తీసివేసి ఎండించేది. ఇది

ధూమపానవర్తి. ఇది ధూమపానయంత్రంలో వుంచి కొసను నెయ్యి పూసి, నిప్పంటించి పొగ పీల్చేది.

**ధూళిధ్వజం/ధ్వజప్రహరణం** — గాలి.

**ధేనుయంత్రం** — సూనే తీసేయంత్రం.

**ధ్వంసి** — మానపరిభాష. త్రసరేణువు.

**ధ్వనిగ్రహం** — చెవి.

## న

**నక్తాంధ్యం** — రేచీకటి.

**నఖచ్ఛేదనం** — గోళ్ళు కత్తిరించుకోడం. ఇది చాలా అగత్యం. దీనివల్ల పుష్టి, బలం, ఆయుష్యం, శుచి, సౌందర్యం కలుగుతాయి. మీసమూ, గడ్డమూ, తీసివేసుకోడంవల్లనూ ఇవన్నీ కలుగుతాయి.

**నఖాయుధం** — గోళ్ళతో పీడించే సింహం, పులి, కోడి మొదలైనవి.

**నదీజలం** — తూర్పుదిక్కుగా ప్రవహించే అన్ని నదుల నీరూ గురుత్వ విశిష్టంగానూ, పశ్చిమాభిముఖంగా ప్రవహించే అన్ని నదుల నీరూ లఘుత్వవిశిష్టంగానూ వుంటుంది. దేశ స్థల విశేషాలను బట్టిన్నీ కొన్ని నదుల నీటికి ఈ గురుత్వ లఘుత్వాలు సంక్రమిస్తూ వుంటాయి. వింధ్యగిరిమీద పుట్టి తూర్పుగా ప్రవహించే నదుల నీరు వాతాటోపం కలిగిస్తుంది. పశ్చిమంగా ప్రవహించే నదుల జలం పిత్తశ్లేష్మాలు తగ్గిస్తుంది. దక్షిణాభిముఖంగా ప్రవహించే నదుల ఉదకం పిత్తోద్రేకం కలిగిస్తుంది. ఉత్తరాభిముఖంగా ప్రవహించే నదుల జలం పథ్యపాకం చేస్తుంది. హిమవద్వింధ్యమలయ సహ్యాద్రులమీద పుట్టిన నదులు శిరోరోగాదులు పుట్టిస్తాయి. పారియాత్ర పర్వతం మీద పుట్టిన నదులు శిరోరోగాదులు పోగొడతాయి.

సామాన్యంగా నదీజలగుణం — స్వచ్ఛం, లఘువు, పాచనం, దీపనం, రుచ్యం, తృష్ణాఘ్నం, పథ్యం, మధురం, ఈషదుష్ణమున్నూ.

కాలభేదం అనుసరించి నదీజలగుణం — వర్షాకాలపు నదీజలం పుచ్చుకుంటే పీనస, కఫం, శ్వాసకాసలు పుడతాయి. శరదృతు కాలీన నదీజలం పథ్యం, వాతక ఫఘ్నమున్నూ. హేమంతనదీజలం. బుద్ధిప్రదం. శిశిర వసంతకాలీన నదీజలం సంతాపశమనమూ, తృష్ణా, దాహ, వమి, శమ ప్రశమనమున్నూ. గ్రీష్మనదీజలం సద్గుణాలే కలిగిస్తుంది.

**పాషాణనదీజలగుణం** — కొన్ని నదులు రాళ్ళ మీద ప్రవహిస్తాయి. వాటిజలం లఘువు. శీతలం, నాత్యుష్ణం ఘనమున్నూ. వాతపిత్తాలు హరిస్తుంది. కఫకారి.

ఇసుకతిప్పలు గల నదుల జలం — విమలం, అఘనం, గురువు, శ్లేష్మకారి, పిత్తశమనం, మధురం, కించిదుష్ణం, కషాయం, వాతజనకం, శోషమూర్ఛాహరమున్నూ.

ఉత్తరాభిముఖంగా ప్రవహించే నదుల జలం — వాతపిత్తహరం, త్రిదోషఘ్నం, శ్రమగ్లానిహరం, వృష్యమున్నూ.

పశ్చిమాభిముఖంగా ప్రవహించే నదులజలం — ఘనం, పిత్తఘ్నం, కఫకారి, వాతహరం. హృద్యం, కండూకుష్ఠ నాశకమున్నూ.

గోదావరీజలం — శీతం, కఫవాతవికారాలు పోగొడుతుంది. పిత్తప్రకోపి, శమనం, బల్యం, మూత్రదోషహరమున్నూ.

**నదీమాతృకం** — నదుల జలంతో పంటలుపండే ప్రదేశం.

**నందనజం** — చందనం.

**నభఃకేతువు** — ధూళి.

**నభోరేణువు** — మంచు.

**నభోలయం** — ధూమం, పొగ.

**నమస్కారం** — విషవిశేషం.

**నయనచింతకుడు** — దృష్టివిజ్ఞాన కుశలుడు.

**నయనోర్ధ్వగరోమరాజి** — కనుబొమలు.

**నరనామిక/నరమానిని** — మీసాలుగల ఆడది.

**నరవల్లభం** — పావురం

**నర్కుటకం** — ముక్కు.

**నర్తనప్రియం** — నెమలి.

**నల్వణం** — మానపరిభాష. ఒక ద్రోణం.

**నవనీతం** — వెన్న. ఇది గవ్యం, మాహిషం, ఆజం, ఆవికం, గర్దభజం, ఔష్ట్రం, ఐణకం, హాస్తికం, మానుష్యం, ఆశ్వీజం అని పదిరకాలు.

**నవయౌవన** — యువతి.

**నవరత్నం** — వ్రజం, మౌక్తికం, మాణిక్యం, నీలం, మరకతం, గోమేధికం, పద్మరాగం, వైడూర్యం, ప్రవాళమున్నూ.

**నవవిధానం** — సూపశాకవ్యంజన మిష్టాదనోప దంశ వితర్దిశ సంధావ రోచనాలు.

నవవిధోపవిషాలు – ఉపవిషాలు తొమ్మిది అని మతాంతరం: అవి జెముడుపాలు, జిల్లేడుపాలు, పొత్తిదుంప, గురివిందగింజ, గన్నేరు, విషముష్టి, వేపాళం, ఉమ్మెత్త, వల్లమందున్ను.

నవోద్ధృతం – అప్పుడు తరిచిన వెన్న.

నశ్యత్ప్రసూతిక – పిల్లలు బతకని స్త్రీ.

నశ్యకర్మ – నశ్యం ముక్కుతో పీల్చవలసిన ఔషధం. నస్యం రేచనం, స్నేహనం అని రెండు విధాలు. రేచనం కర్షణం. స్నేహనం బృంహణం. మరిన్నీ ఇది ప్రతిమర్శం, అవపీడనం, నశ్యం, ప్రధమనం, శిరోవిరేచనం అని అయిదు విధాలనిన్నీ చెప్పబడ్డది. ఇది యెనిమిదేళ్ల వయస్సు నిండకపూర్వమూ, ఎనభై సంవత్సరాలు దాటాకా వాడగూడదు.

నక్షత్రకాంతి విస్తారం – తెల్లజొన్నలు.

నక్షత్రవృక్షాలు – ఇవి ఇరవైయేడు వృక్షాలు. వీటికి వరసగా అశ్విన్యాది నక్షత్రాలు అధిదేవతలు. అంచేతనే వీటికి నక్షత్ర వృక్షాలని పేరు. వివరాలు – విషముష్టికి అశ్విని అధిదేవత. ఇదే క్రమాన – ఉసిరికకు భరణి. అత్తికి కృత్తిక. నేరేడుకు రోహిణి. చండ్రకు మృగశీర్ష. కృష్ణాగురుకు ఆర్ద్ర. వెదురునకు పునర్వసు. అశ్వత్థానికి పుష్య. సంపంగికి ఆశ్లేష. మర్రిచెట్టుకు మఘ. మోదుగు చెట్టుకు పూర్వఫల్గుని. జువ్వికి ఉత్తరఫల్గుని. జాజికి హస్త. మారేడుకు చిత్త. మద్దికి స్వాతి. పుల్లవెలగకు విశాఖ. పొగడ చెట్టుకు అనూరాధ. లొద్దుగుచెట్టుకు జ్యేష్ఠ. సర్జవృక్షానికి మూల. అశోకానికి పూర్వాషాఢ. వీటి ప్రబ్బలికి ఉత్తరాషాఢ. జిల్లేడుకు శ్రవణం. జమ్మికి ధనిష్ఠ. కడిమిచెట్టుకు శతభిషం. మామిడికి పూర్వాభాద్ర. వేపచెట్టుకి ఉత్తరాభాద్ర. విప్పచెట్టుకు రేవతి.

నాకులిద్వయం – రాస్న, గంధరాస్న.

నాగజీవనశత్రువు – నాగజీవనం అంటే వంగం. దీనికి శత్రువు తాళకం.

నాగపుటభావన – పదాహారు పలాలతో భావన చెయ్యడం.

నాడింధముడు – స్వర్ణకారుడు.

నాడీస్వేదం – ఇది స్వేదకర్మలలో ఒకటి. రెల్లుబద్దలు, వెదురుబద్దలు, గానుగు ఆకులు, జిల్లేడాకులు – వీటిలో ఏది దొరికితే దాంతో ఒక గొట్టం తయారు చేసుకోవాలి. అది ఏనుగు తొండంలాగ ఆరోకగా వుండాలి. దాని పొడుగు బారెడు లేక సగం వుండాలి. దాని రంధ్రాలు ఒక వైపుది మూరెడు వెడల్పూ, రెండోవైపుది జానెడు వెడల్పూ వుండాలి. వాతహరాలైన ఆకులతో ఆ రంధ్రాలు కప్పాలి. అది నిదానంగా వుండక, రెండు మూడు తిప్పులు తిరిగి వుండాలి. ఇది నాడి. ఇక ద్రవ్యాలు, వేళ్ళు, కాయలు, ఆకులు, కాళ్ళు – ఇవి, ఉష్ణవీర్యాలు కలవై ఉండాలి. వీటిలో ఏదయినా పుల్లని గంజి, ఉప్పు, చమురులు, మూత్రాలు, పాలు – వీటిలో ఒకదానిలో వేసి ఆవిరి బైటికిపోకుండా కషాయం కాచాలి. ఇది క్వాథం.

తరవాత, రోగికి శరీరం అంతా వాతహరతైలం పట్టించాలి. ఉడుకుతున్న క్వాథం గల కుండ మూతికి ఆ నాడి అతికి, దాని రెండో రంధ్రమునుంచి వచ్చే ఆవిరి రోగి శరీరానికి తగిలేటట్టు చేస్తే బాగా చెమటపట్టి, వ్యాధి తగ్గిస్తుంది.

నాథహరి – పశువు.

నాభిలాష – అనిచ్ఛ.

నాభ్యభ్యంగం – నాభిలో తైలం యింకించడం.

నారాయణప్రియం – పచ్చని చందనం.

నారికేళజం – మద్యవిశేషం.

నార్యతిక్తం – నేలవేము.

నావనం – నశ్యకర్మ.

నాసత్యులు – అశ్వినీకుమారులు. దేవవైద్యులు.

నాసికంధముడు – ముక్కుతో గాలి పీల్చుకునే వాడు.

నాసికంధయుడు – ద్రవపదార్థాలు ముక్కుతో పానం చేసేవాడు.

నింబపంచకం – వేపచెట్టు ఆకు, పట్ట, పువ్వు, కాయ, వేరున్ను.

నికషం – ఒరపిడిరాయి.

నికారణం – మారణం.

నిఖర్వుడు – పొట్టివాడు.

నిగరణం – భోజనం.

నిగారం – భక్షణం.

నిగ్రహం – చికిత్స.

నిగ్రహస్థానం – భిషక్కులకు వాదమార్గ జ్ఞానార్థాదిగంతవ్యపదం.

నిఘనం – భక్షణం.

నిచికి – ఉత్తమగోవు.
నిత్యగం – ఆయువు.
నిత్యగతి – వాయువు.
నిదానం – రోగలక్షణం, రోగనిర్ణయం, రోగకారణం. ఇది సన్నికృష్టం, విప్రకృష్టం – అని రెండు విధాలు. సన్నికృష్టం – వాతప్రకోపాదికం. విప్రకృష్టం – విరుద్ధాహారాదికం.
నిదానార్థకరం – రోగజనకం.
నిదిగ్ధికాగణం – అంటే స్వల్పపంచమూలాలు. అవి – ముయ్యాకు పొన్న, కోలపొన్న, వాకుడు, పెద్దములక, పల్లేరున్నూ.
నిద్రాభేదాలు – నిద్ర ఆరు రకాలు. ఇవి 1. తమోగుణాధిక్యం వల్ల కలిగేది. 2. శ్లేష్మప్రకోపంవల్ల వచ్చేది. 3. శ్రమవల్ల సంభవించేది. 4. దెబ్బలు, గాయాలు మొదలైన ఆగంతుక కారణాలవల్ల సంభవించేది. 5. జ్వరాది వ్యాధులవల్ల వచ్చేది. 6. సహజంగానే రాత్రివచ్చేది. సుశ్రుత మతానుసారంగా తామసి, స్వాభావికి, వైకారికి అని నిద్ర మూడు విధాలు. యథాకాలంలో నిద్ర లెస్సగా అనుభవిస్తే ధాతుసామ్యం ఏర్పడుతుంది. తంద్ర తగ్గిపోతుంది. పుష్టి, శరీరానికి మంచి రంగు, బలం, ఉత్సాహం, అగ్నిదీప్తి – ఇవి కలుగుతాయి.
నిద్రాగౌరవం – నిద్రాబాహుళ్యం.
నిద్రాసంజననం – శ్లేష్మం.
నిధువనం – సురతం.
నిధ్యానం – దర్శనం.
నినందువు – పిల్లలు బతకని స్త్రీ.
నిపానం – పాలుపితికే చెంబు.
నిపానం – నూతి దగ్గిర రాతితో కట్టిన నీటితొట్టి.
నిపుణుడు – చికిత్సకుడు
నిపాలనం – దర్శనం.
నిబంధనం – హేతువు.
నిభాలనం – దర్శనం.
నిమజ్జనం – అవగాహస్నానం.
నియోగం – ఇలా చెయ్యమని ఆదేశించడం.
నియోద్ధ – కోడి.
నిరగ్నికస్వేదకర్మలు – అగ్నిసంబంధంలేకుండా స్వేదం పుట్టించే పనులు. అవి – వ్యాయామం, దళసరిగోడలతో గవాక్షాలు లేనియిల్లు. కంబళ్ళు కప్పుకోవడం, ఆకలి, అతిమద్యపానం, భయం, క్రోధం, కట్టుకట్టడం, ఎండ, మల్లయుద్ధమున్నూ.
నిరన్నత – ఉపవాసం.
నిరశనం – అభోజనం.
నిరసనం – నిష్ఠీవనం.
నిరాతంకుడు – రోగముక్తుడు.
నిరాపశాలి – మెట్టపంట ధాన్యం.
నిరామయం – ఆరోగ్యం.
నిరింద్రియుడు – ఇంద్రియశూన్యుడు.
నిరీహుడు – నిర్వ్యాపారుడు.
నిరుత్థీకరణం – మృతలోహానికి మిత్రపంచకంతో పాకంచేసి మారణం కలిగించడం.
నిరూహవస్తి – కషాయం, పాలు, తైలం వీటితో చేసేది.
నిరోధం – మరణం.
నిర్గంధపుష్పి – బూరుగుచెట్టు.
నిర్ఘాతనం – అటూ యిటూ కెలికి శల్యోద్ధరణం చెయ్యడం.
నిర్ఝరం – కొండవాగు.
నిర్ణేజనం – కడగడం.
నిర్దిగ్ధుడు – కొవ్వువున్నవాడు.
నిర్దేశం – విస్తరవచనం.
నిర్భక్తం – ఔషధం పుచ్చుకోవలసిన కాలంలో ఇదొకటి. ఎలాంటి ఆహారమూ పుచ్చుకోకుండా – అంటే, లంఘనం చేస్తూ ఔషధం పుచ్చుకునే కాలం పేరు నిర్భక్తం.
నిర్మలోపలం – స్ఫటికం.
నిర్మాల్యం – శివనిర్మాల్యం. అంటే శివునకు నివేదించినది. శివోచ్ఛిష్టం – పూలదండలు – ఇత్యాది.
నిర్యాతనం – మారణం.
నిర్యాసం – చెట్టుపాలు. ఇదే జిగురు. బంక.
నిర్యాససారాలు – కొన్ని చెట్ల జిగురులే ఔషధాలలో వాడుకోవాలి. ఆ చెట్లు – స్థౌణేయకం, సర్జ, దేవదారు, దేవధూపకం, తురుష్కం, మోదుగు, బూరుగు, గుగ్గిలంచెట్టు, వేప, గారచెట్టున్నూ.
నిర్వచనం – నిరుక్తి.
నిర్హారం – మలమూత్రాలు విడిచే ఇల్లు.
నిర్హారగృహం – శల్యాలు తీసేస్థానం.
నిర్హారి – చాలాదూరానికి వ్యాపించే పరిమళం.

నిలింప – పాలుపితికే పాత్ర.
నివాతం – గాలి లేకపోవడం.
నివాతం – గాలిచొరనియిల్లు.
నిశాకరం – కోడి.
నిశాణశిల – కత్తులు మొదలైనవాటికి పదును వచ్చేటట్టు నూరడానికుపయోగించే రాయి.
నిశాద్వయం – పసుపు, మామపసుపున్ను.
నిశాంతం – ప్రాతఃకాలం.
నిశాపుష్పం – కలువపువ్వు.
నిశామృగం – నక్క.
నిశావేది – కోడి.
నిశాహాసం – కలువపువ్వు.
నిశిక్రందం – పిల్లలు రాత్రిళ్ళు చాలా చాలా యేడుస్తారు. అదొక వ్యాధి.
నిశుంభనం – మారణం.
నిష్కం – మానపరిభాష. నాలుగు మాషాలు.
నిష్కలుడు – వీర్యహీనుడు.
నిష్కల – వృద్ధ స్త్రీ.
నిష్ఠ – చికిత్స.
నిష్ఠీవనం – ఉమ్మివేయడం.
నిష్ప్రత్యనీకం – ఉపపచారయోగ్యం.
నిస్తర్హణం – మారణం.
నిస్త్వక్క్యులు – సొంటి, తిప్పతీగ, మారేడు, తక్కోల, దుందిలం. గుమ్ముడు, కలిగొట్టు, పిల్లిపీచర, పసుపు – ఇవి పైతోలుతీసి ఉపయోగించవలసినవి.
నీచభోజ్యం – నీరుల్లి.
నీలకంఠం – ముల్లంగి.
నీలకంఠాక్షం – రుద్రాక్ష
నీలపీతం – మహావిషంగల తేలు.
నీలాంజనం – రసాంజనం.
నీలోదరం – మహావిషం గల తేలు.
నేత్రకర్మ – అంటే నేత్రోపచారం. ఇది సేకం, ఆశ్చ్యోతనం, సంపిండి, బిడాలం, తర్పణం, పుటపాకం, అంజనం అని యేడు విధాలు.
నేత్రపిండం – పిల్లి.
నేత్రరంజనం – కాటుక.
నేత్ర్యవర్గం – నేత్రాలకు హితకరాలైన ద్రవ్యాలు. ఇవి – రసాంజనం. త్రిఫలాలు, లొద్దుగు, కలబంద, విమల.
నైదానికుడు – రోగనిదానంలో చాలా కౌశలంగలవాడు.
న్యగ్రోధపరిమండల –అందగత్తె అయిన స్త్రీ.
న్యగ్రోధాదిగణం – మర్రి, రావి, మేడి, లొద్దు గుచెక్క, రాజనేరేడు, కాకినేరేడు, తెల్లమద్ది, దిరిసెన, తెల్లచంద్ర, జువ్వి, మామిడి, ప్రబ్బలి, మొరళి, మోదుగు, నందీవృక్షం, రేగు, కడిమి, తిందుకం, యష్టిమధుకం, ఇప్పపువ్వున్ను.
న్యాదం – భోజనం.
న్యూనపంచాశద్భావం – పుట్టినదాది ఉన్మాదుడైనవాడు.

## ప

పంచకద్వయం – జీవనపంచ మూలమూ, హ్రస్వపంచమూలమున్ను.
పంచకపిత్థం – వెలగచెట్టు తాలూకు వేరు, పట్ట, ఆకులు, పువ్వు, పండున్ను.
పంచకర్మలు – వమనం, విరేచకం, నశ్యం, నిరూహవస్తి, అనువాసవ వస్తిన్ని, శరీరంలో వుండే మలాదులు బయటికి వెడలించి శరీరం పరిశుద్ధం అయేటట్టు చేసేక్రియలు ఇవి.
పంచకర్మేంద్రియం – హస్తపాద పాయూప స్థజిహ్వలు.
పంచకషాయం – వస, అడ్డసరం, చేదుపొట్ల, ప్రేంకణం, వేప – ఇవి.
పంచకషాయాలు – కషాయం అయిదు రకాలు: స్వరసం, కల్కం, శృతం, శీతం, ఫాంటం అని.

మతాంతరం: స్వరసం, కల్కం, క్వాథం, హిమం, ఫాంటం అని.

పంచకోలం – అయిదు ద్రవ్యాలతో చేసిన కషాయం. ఆ ద్రవ్యాలు – పిప్పళ్ళు, పిప్పలి మూలం, చవ్యం, చిత్రమూలం, సొంటిన్ని. ఇవి ఒక్కొక్క కోలప్రమాణంగా గ్రహించి కషాయం చెయ్యాలి. అంచేతనే దీనికి పంచకోల కషాయం అనిపేరు.
పంచగణం – నేలగుమ్ముడు, పెద్దములక, కోలపొన్న, వాకుడు, పల్లేరున్ను.
పంచగవ్యం – గోమూత్రం, గోమయం, ఆవు పాలు, ఆవుపెరుగు, ఆవునెయ్యిన్ని. వీటిలో పాలు ఒక పలం. గోమూత్రం ఒక పలం,

నెయ్యి ఒక పలం, గోమయం మూడుతులాలు, పెరుగు ప్రస్తుతపరిమాణం గ్రహించేది. మరిన్నీ, బంగారపు రంగుగల ఆవుపాలు, తెల్లని ఆవు గోమయం, ఎర్రని ఆవు మూత్రం, నీలవర్ణపు ఆవు నెయ్యి, నల్లని ఆవు పెరుగున్ను గ్రహించేది.

**పంచగుప్తం** – తాబేలు.

**పంచజట** – అంటే పంచమూలాలు. ఇవి తొమ్మిది రకాలు. ఒక్కొక్క దానిలో అయిదేసి మూలికలుంటాయి.

**పంచజ్ఞానేంద్రియం** – స్పర్శనం, రసనం, ఘ్రాణం, దర్శనం, శ్రవణం అని.

**పంచతత్త్వం** – పృథివి, ఆపం, తేజస్సు, వాయువు, ఆకాశమున్ను.

**పంచతత్త్వం** – తాంత్రికుల పంచతత్త్వాలు. అవి – మద్యం, మాంసం, మత్స్యం, ముద్ర, మైథునమున్ను. వీటికి పంచముద్రలనిన్నీ పేరు.

**పంచతిక్తం** – అయిదురకాల చేదువస్తువులు. అవి రెండు రకాలు. ఒకటి వాకుడు, తిప్పతీగ, సొంటి, చెంగల్వకోష్టు, వేలవేమున్ను, రెండోది – వేప వేరుపట్ట, చేదుపొట్ల ఆకు, అడ్డసరప్పట్ట, వాకుడు, తిప్పతీగ.

**పంచతృణం** – కుశ, కాశ, శర, దర్భ, ఇక్షులు. తృణపంచమూలమనిన్నీ దీనికిపేరు. శాలి, ఇక్షు కుశ, కాశ, శర – ఇది మతాంతర పంచతృణం.

**పంచత్వం** – మృత్యువు.

**పంచదీర్ఘం** – మనిషికి అయిదు అవయవాలు దీర్ఘంగావుంటే అది శుభలక్షణం. అవి చేతులు, నేత్రాలు, కుక్షి ముక్కు, స్తనాల మధ్యభాగమున్ను.

**పంచనఖం** – అయిదేసి గోళ్లుగల జంతువులు. అవి – వ్యాఘ్రం, శరభం, శార్దూలం, ఉడుము, తాబేలు, శరటం, సింహమున్ను. ఇవికాక భక్ష్యపంచనఖాలు వేరు. అవి కుందేలు, శల్లకం, ఉడుము, ఖంగీ, కూర్మమున్ను.

**పంచనింబం** – వేపచెట్టుకు సంబంధించిన అయిదు భాగాలు. అవి: పట్ట, ఆకులు, పువ్వు, పళ్ళు, వేరున్ను.

**పంచనిదానం** – రోగనిర్ణయం చెయ్యడానికి అయిదు ఉపాయాలు. అవి:– నిదానం, పూర్వ రూపం, రూపం, ఉపశమం, సంప్రాప్తిన్ని.

**పంచపటు** – అయిదు లవణాలు.

**పంచపల్లవం** – మామిడి, నేరేడు, వెలగ, మాదీఫలం, మారేడు – వీటి చిగుళ్ళు. ఇవి గంధకర్మలో ఉపయోగించతగ్గవి.

**పంచపిత్తం** – పంది, మహిషం, చేప, నెమలి, మేక – వీటి చేదుకట్లు.

**పంచప్రాణాలు** – ప్రాణం, అపానం, వ్యానం, ఉదానం, సమానమున్ను.

**పంచబల** – అయిదు రకాల బలలు, అవి – బల, అతిబల, నాగబల, రాజబల, మహాబల అని.

**పంచబీజం** – దోస, ములుదోస, దానిమ్మ, తామర, దూలగొండి, వీటి గింజలు.

*మతాంతరం:* తెల్ల ఆవాలు, అజామోదం, జీలకర్ర, నువ్వు, వట్టివేరుగింజలున్ను.

**పంచబుద్ధేంద్రియం** – చెవులు, ముక్కులు, కళ్లు, నాలుక, త్వక్కున్ను.

**పంచభద్రం** – తిప్పతీగ, పర్పాటకం, తుంగ ముస్తలు, నేలవేము, సొంటిన్ని.

**పంచభూతం** – పృథివ్యప్తేజోవాయురాకాశాలు.

**పంచభృంగం** – దేవతాళం, జమ్మి, భృంగ, తాళీసం, వావిలిన్ని.

**పంచమకారం** – మద్యం, మాంసం, మత్స్యం, ముద్ర, మైథునమున్ను.

**పంచమహావిషాలు** – శృంగి, కాలకూటం, ముస్తకం, వత్సనాభం, సక్తుకమున్ను.

**పంచమూత్రం** – మూత్ర పంచకం. గాడిద, ఆవు, మేక, ఛాగం, మహిషం – వీటి మూత్రాలు.

**పంచమూలం** – అయిదు రకాల మూలికల వేళ్లు. ఇవి తొమ్మిది రకాలు. 1. బృహత్పంచ మూలం, 2. స్వల్పపంచ మూలం, 3. తృణపంచమూలం, 4. శతావర్యాది పంచమూలం, 5. జీవకాది పంచమూలం, 6. బలాదిపంచ మూలం, 7. గోక్షురాది పంచమూలం, 8. వల్లీపంచమూలం, 9. కంటకపంచమూలం – అని.

**పంచరత్నం** – బంగారం, రత్నం, నీలం, పద్మరాగం, ముత్యమున్ను.

**పంచలవణం** – కాచలవణం, సౌవర్చలవణం, సైంధవలవణం, సాముద్రలవణం, బిడాలవణమున్ను.

**పంచలక్షణం** – వ్యాధిలక్షణా లయిదు. అవి – వాత, పిత్త, కఫ, సన్నిపాత, ఆగంతుకాలు.

**పంచలోహం** – బంగారం, వెండి, తామ్రం, వంగం, నాగమున్ను.

**పంచలోహం** – ఇది గ్రహాంగ పంచలోహం. అవి – బంగారం, వెండి, రాగి, వంగం, తీక్షణలోహమున్ను.

**పంచవటి** – మర్రిజాతికి చెందిన అయిదు వృక్షాలు. మారేడు, రావి, మర్రి, అశోకం, మేడిచెట్టున్ను.

**పంచవల్కాలం** – అయిదు రకాల పట్టలు. అవి – మర్రిపట్ట, రావిపట్ట, మేడిపట్ట, జువ్విపట్ట, ప్రబ్బలిపట్ట.

**పంచవిధమర్మలు** – శరీరంలో వున్న మర్మస్థానాలు. ఇవి అయిదు రకాలు. అవి – సద్యః ప్రాణహరమర్మలు, కాలాంతర ప్రాణహరమర్మలు, విశల్యఘ్నమర్మలు, వైకల్యకరమర్మలు, రుజాకరమర్మలున్ను.

**పంచవేతసం** – పంచవల్కాలమే పంచవేతసం.

**పంచశస్యం** – ధనియాలు, నువ్వులు, పెసలు, యవలు, తెల్ల ఆవాలున్ను.

**పంచశిరీషం** – దిరిసెనచెట్టు తాలూకు ఆకు, పువ్వు, కాయ, పట్ట, వేరున్ను.

**పంచశూరణం** – కంద అయిదురకాలు. అవి – అత్యమ్లపర్ణి, కాండీరం, మాలాకంద, కంద, అడవికంద.

**పంచశైరీషం** – పంచశిరీషం.

**పంచసిద్ధౌషధి** – సిద్ధౌషధి చూడు.

**పంచసుగంధికం** – అయిదు సుగంధద్రవ్యాలు. అవి – పచ్చకర్పూరం, తక్కోలాలు, లవంగాలు, జాజికాయ, పోకచెక్క.

**పంచక్షారం** – యవక్షారం, పలాశక్షారం, తిలక్షారం, ముష్కకక్షారం, సర్జక్షారమున్ను.

**పంచక్షీరివృక్షం** – పాలు కారే చెట్లు అయిదు. అవి – మర్రి, రావి, మేడి, జువ్వి, ప్రబ్బలిన్ని.

**పంచాంగం** – ఏదయినా ఒక వృక్షం తాలూకు అయిదు అంగాలు. అవి – పట్ట, ఆకులు, పువ్వు, పండు, వేరున్ను.

**పంచాంగికపంచగణం** – బృహత్పంచమూలాలు, లఘుపంచమూలాలు, తృణపంచమూలాలు, వల్లీ పంచమూలాలు, కంటకపంచమూలాలున్ను.

**పంచాజ్యం** – మేక తాలూకు పాలు, పెరుగు, నెయ్యి, మూత్రం, పురీషమున్ను.

**పంచాత్మ** – శరీరాంతర్గత వాయువులు. అవి ప్రాణం, అపానం, వ్యానం, ఉదానం, సమానమున్ను.

**పంచామృతం** – ఇది పూజాదికానికి సంబంధించిన దొకటి. ఔషధరూపం వొకటిన్ని. వీటిలో ఔషధం పంచామృతం – తిప్పతీగ, పల్లేరు, నేలతాడి, బోడతరం, పిల్లితేగలున్ను. ఇవి సమభాగాలు గ్రహించుకోవాలి.

**పంచామ్రం** – రావి, వేప, మర్రి, దానిమ్మ, మాదీఫలమున్ను.

**పంచామ్లం** – రేగు, దానిమ్మ, చింతపండు, చుక్కకూర, అమ్లవేతసమున్ను.

*మతాంతరం:* నిమ్మ, నారింజ, అమ్లవేతసం, చింతపండు, మాదీఫలమున్ను.

**పంచారవిందం** – తామరదుంప, తామరతూడు, తామరాకు, తామరపువ్వు, కింజల్కాలున్ను.

**పంచావికం** – మేక తాలూకు పాలు, పెరుగు, నెయ్యి, మూత్రం, పురీషమున్ను.

**పంచేంద్రియం** – వాక్పాణి పాదపాయూపస్థలు.

**పంచోషణం** – పిప్పళ్ళు, పిప్పలిమోడి, చవ్యం, చిత్రమూలం, సొంటిన్ని. ఇదే పంచుకోలం.

**పంచోపవిషం** – జెముడుపాలు, జిల్లేడుపాలు, కరవీరం, పొత్తిదుంప, ముషిణి.

**పంచోష్మలు** – శరీరంలోవున్న పంచవిధ పాచకాగ్నులు. అవి – భౌమం, ఆప్యం, ఆగ్నేయం, వాయవ్యం, నాభసమున్ను.

**పక్త** – స్వయంగా ఔషధాలు వండేవాడు.

**పక్వం** – ఉడికినది. పండినది. కాగినది.

**పక్వరసం** – మద్యం.

**పక్వాన్నం** – నెయ్యి మొదలైనవాటితో సిద్ధమైన అన్నం.

**పక్వాశయం** – ఇది నాభికి పైనీ, ఆమాశయానికి కిందా వుంటుంది.

**పచనం** – పాకం.

**పటుత్రయం** – మూడు లవణాలు. అవి బిడా లవణం, సైంధవలవణం, సౌవర్చలవణమున్ను.

**పటుపంచకం** – అయిదు రకాల ఉప్పులు. అవి – కాచలవణం, సౌవర్చలవణం, బిడాలవణం, సైంధవ లవణం, సాముద్రలవణమున్ను.

**పటూత్తమం** – ఉప్పులలో ఉత్తమమైనది. ఇది సైంధవలవణం.

**పతికావేరం** – ఇత్తడి.

**పత్రయౌవనం** – చిగురుటాకు.

**పత్రవిషం** – ఆకుకూరలు, కాకమాచి, కసివింద, గలిజేరు, పూతిక, చేదుపొట్ల ఆకు, మేఘనాదం, శాలి, హిలమోచిక, బచ్చలి, సునిషణ్ణకమున్ను.

**పత్రసారాలు** – గుంటకలగర, తెల్లజిల్లేడు, దూలగొండి, మణుగుదామర, కుప్పింట, ఇలివెంద, ఉపానదంష్ట్రి, ఉమ్మెత్త, కాకర, పొట్ల, వావిలి, పొన్నగంటి, బోడతరం, ఉప్పి, అడ్డసరం, దుండిగం, ఊడుగు, తంగేడు, జిల్లేడు, మోదుగు, తక్కోల, కూరనెల్లి, పులిచింత, గినియ, తెల్లగలిజేరు, ఎర్రగలిజేరు, సరస్వతి, గోరింట, ప్రేంకణం, సహదేవి, విష్ణుక్రాంతం, బుద్ధి, వృద్ధి, పాల, గరుక, బావంచి, చెంచలి, సదాప, ఎలుకచెవి ఆకు, పుచ్చ, వేప – వీటి ఆకుల్లోనే సారం వుంది. ఔషధయోగాలలో వీటి ఆకులే వాడాలి.

**పత్రసూచి** – ముల్లు.

**పత్రోల్లాసం** – పువ్వు తాలూకు మొగ్గ.

**పథ్యం** – హితభోజనం.

**పథ్యాపథ్యం** –రోగాలలో హితమూ అహితమూ అయిన ద్రవ్యం.

**పదరథి** –పాదుకలు.

**పదార్థం** –ద్రవ్యగత రస వీర్యాదులు. ఇవి అయిదు. అవి – రసం, వీర్యం, విపాకం, గుణం, శక్తిన్ని.

**పద్మమధువు** – తామరపువ్వులలో పుట్టిన తేనె. ఇది అరుదుగా దొరుకుతుంది.

**పద్మాలయ** – లవంగతీగ.

**పన్నద్ధ** – చర్మంతో చేసిన చెప్పులు.

**పయఃపాలిని** – కురువేరు.

**పయఃపేటి** – కొబ్బరికాయ.

**పయఃప్రసాదం** – నీరు శుభ్రపరచేది. ఇందుపుకాయ.

**పయస్సాల్మల్యం** – మజ్జిగ.

**పయస్విని** – పాలున్నది.

**పయోగలం** – వడగళ్ళు.

**పయోఘనం** – వడగళ్ళు.

**పయోహేతువు** – పెరుగు.

**పరపుష్టమహోత్సవం** – మామిడిచెట్టు.

**పరమాణువు** – కిటికీలోనుంచి వచ్చే సూర్యకాంతిలో మెరిసే సూక్ష్మధూళిలో ముప్పయ్యోభాగం.

**పరమాన్నం** – పాయసం.

**పరమాయువు** – మాటయిరవై సంవత్సరాల అయిదు రాత్రులు. నరులకూ, ఏనుగులకూ ఇది సమానం.

**పరమృత్యువు** – కాకి.

**పరమేశ్వరం** – పాదరసం.

**పరలోకైషణ** – ఏషణత్రయంలో ఇదొకటి. పరలోకైషణ అంటే ఈ జన్మ విడిచినతరవాత పరలోకాలలో ఉత్తమమైనది సంపాదించుకోడానికి చేసే సాధన అన్నమాట. ఇందుకు మార్గం – శుశ్రూష చేసి గురువుల అనుగ్రహం సంపాదించుకోవాలి. వేదవేదాంగాలు క్షుణ్ణంగా చదువుకోవాలి. శాస్త్ర విహితాలైన వ్రతాలు చెయ్యాలి. బ్రహ్మచర్యం సక్రమంగా ముగించుకుని, తరవాత వివాహం చేసుకుని తన ధర్మపత్నియందు కొడుకులను కనాలి. తన పరివారాన్ని పోషించాలి. అతిథులను పూజించాలి. శక్తివంచన లేకుండా దానధర్మాలు చెయ్యాలి. పరద్రవ్యం ఆశించకూడదు. తపస్సు చెయ్యాలి. అసూయ, ఈర్ష్య – ఇవి దగ్గరికి రాకుండా చూసుకోవాలి. శాస్త్రీయాలైన కాయిక వాచిక మానసిక కర్మలు దీక్షగా నిర్వహిస్తూ వుండాలి. ప్రతిదినము తన ప్రవర్తనం పరీక్షించుకుంటూ ఉండాలి. మనస్సు స్వాధీనంలో వుంచుకోవాలి. ఏకాగ్రత చెరుపుకోరాదు. పెద్దలు చెప్పిన యితర సత్కార్యాలున్నూ చేస్తూవుండాలి. ధన వృద్ధినిగురించి చాలా జాగ్రత్తగా వుండాలి. ఇలా చేస్తే ఈ లోకంలో మంచికీర్తి లభిస్తుంది. పరలోకం సిద్ధిస్తుంది.

**పరాచీనుడు** – పరాఙ్ముఖుడు.

**పరాదిగుణాలు** – పరం, అపరం, యుక్తి, సంఖ్య, సంయోగం, విభాగం, పృథక్త్వం, పరిమాణం, సంస్కారం, అభ్యాసమున్ను. ఇవి పంచభూత సామాన్యంతో చేరినా అంతగా ఉపయుక్తంకానివి.

**పరాసన** – ఔషధప్రయోగం. అంటే చికిత్స.

**పరామృతం** – వడగళ్ళు.

**పరార్థం** – చందనం, కుంకుమపువ్వు ఇవి సమభాగాలుగా కలుపుకుంటే పరార్థం అని పేరు.

పరికర్మ – అభ్యంగం, తలంటు.

పరికర్మి – సకలవిధాలా ఉపచారాలు చేసే పరిచారకుడు.

పరిగ్రహరూపమాత్ర – ఔషధమాత్ర రెండు విధాలు. అందులో ఇదొకటి. మొత్తం ఆహారంలో వుండే వ్యంజనాదుల షడ్రసాల పరిమాణం పరిగ్రహరూపమాత్ర.

పరిచరుడు – సేవకుడు.

పరిచర్య – సేవ.

పరిచ్ఛదం – కట్టుబట్ట.

పరిణామం – పరిపాకం.

పరిణాహం – విస్తారం.

పరితాపం – రోగం.

పరిమోక్షం – మలోత్సర్గ.

పరివాపం – ముండనం.

పరివేషకుడు – రాజులకు వంటచేసి వడ్డించేవాడు. ఈ మనిషి చక్కగా స్నానంచేసి గంధం పూసుకుని వుండాలి. మంచిబట్టలు కట్టుకోవాలి. పూలదండలు ధరించివుండాలి. ప్రసన్నముఖుడై వుండాలి. ప్రసన్న హృదయుడూ, స్పష్టాత్ముడూ అయివుండాలి. శ్రీహరి పూజాపరాయణుడూ, యజమాని యెడల అనురక్తుడూ, వంటలలో నిపుణుడూ, వదాన్యుడూ, శుచీ, విప్రుడూ, కులీనుడున్నూ అయివుండాలి.

పరివేషణం – అన్నాదులు వడ్డించడం.

పరిశుష్కం – పక్వమాంసవిశేషం. చాలా యెక్కువగా నెయ్యిపోసి మాంసం వేయించాలి. మాటిమాటికీ దానిమీద నీళ్ళు చల్లుతూ వుండాలి. జీలకర్ర మొదలైనవి చేర్చాలి. దీనిపేరు పరిశుష్కం.

పరిశ్రుతం – సుర.

పరిషత్తు – సభ. జ్ఞానవతి, మూఢపరిషత్తు అని యిది రెండు విధాలు. సుహృత్పరిషత్తు, ఉదాసీనపరిషత్తు, ప్రతినివిష్టపరిషత్తు అని యిది మరో మూడు విధాలున్నూ.

పరిషేకం – స్నానం. శిరస్సున ధారగా నీళ్ళు పోసుకోడం.

పరిషేకం – వ్రణబాధ ఉపశమించడానికి దానిమీద ధారగా ఉష్ణకషాయం పోసుకుంటూ వుండడం.

పరిషేకస్వేదం – స్వేదకర్మలలో ఇదొకటి. వాతహరాలూ, వాతప్రధానమైన కఫం హరించేవీ అయిన ద్రవ్యాలతో క్వాథం తయారుచేసి, అది సుఖోష్ణంగా వున్నప్పుడు వార్షులికలోనూ, వెదురు గొట్టంవంటి దానిలోనూ పోసి, రోగికి వాతహరతైలంతో శరీరం అంతా మర్దనా చేసి గుడ్డ కప్పి, ఆ కషాయం బాధగల చోట పడేటట్టు పోస్తే చెమటపట్టుతుంది. ఇది పరిషేకస్వేదం.

పరిస్రావం – వమన విరేచన వ్యాపద్విశేషం.

పరిస్రుతదధి – వస్త్రగాలితం చేసిన పెరుగు.

పరిశ్రుత –ద్రాక్షఫళ్ళతో చేసిన మద్యం.

పరీష్టి – . పరిచర్య.

పరుషం – కఠినవాక్కు.

పర్ణభోజనం – మేక.

పర్ణినీద్వయం – శాలిపర్ణి, పృశ్నిపర్ణి.

పర్ణచతుష్కం – శాలిపర్ణి, పృశ్నిపర్ణి, ముద్గపర్ణి, మాషపర్ణిన్నీ.

పర్దనం – అపానవాయువు విడిచిపెట్టడం.

పర్యయం – క్రమోల్లంఘనం, వ్యతిక్రమం.

పర్యస్తిక – మంచం.

పర్యాప్తి – తుష్టి.

పర్యాయం – అనుక్రమం.

పర్యుషితం – పాసిపోయినది. ఒకపూట వండి మరోపూటకి నిలవచేసిన అన్నాదికం.

పర్యుషితాన్నం – నీళ్ళలో వేసివుంచిన నిన్నటి అన్నం. అంటే తరవాణీ అన్నం.

పర్వ – వేలి కణుపు.

పలం – మానపరిభాష. ఎనిమిది తులాలు, 4. తులాలని కొందరు.

పలం – మాంసం.

పలంకారం – రక్తం.

పలాగ్ని – పిత్తం.

పలార్థం – రెండు కర్షాలు. 4. తులాలు. మానపరిభాష.

పలాశతరుశోణితం – మోదుగు జిగురు.

పలికాంశం – ఒక పలం పరిమాణం.

పలితం – జుట్టు నెరియడం. తెల్లబడడం.

పవనద్విషం – గుగ్గులు.

పవనాశనాశం – నెమలి.

పవనేంద్రియుడు – గర్భవికృతివల్ల శుక్రహీనుడైన పురుషుడు. పురుషుడు గర్భంలోవుండగా

దుష్టమైన వాయువు శుక్రస్థానం అంతా పాడు చేసి, ఆ పురుషుణ్ణి శుక్రహీనుణ్ణి చేస్తుంది. ఆ పురుషుడే పవనేంద్రియుడు.

**పశుక్రియ** – మైథునం.

**పశువు** – జంతుభేదం. ఇది గ్రామ్యపశువు అనీ, ఆరణ్యపశువు అనీ రెండు విధాలు. ఆవు, గొర్రె, మేక, గుర్రం, కంచరగాడిద, మనిషి, గాడిద – ఇవి గ్రామ్యపశువులు. మహిషం, కోతి, ఎలుగు, సరీసృపం, రురువు, పృషతం, లేళ్ళు – ఇవి ఆరణ్యపశువులు.

**పాంచప్రసృతికి** – నెయ్యి, నూనె, వస, మజ్జ, బియ్యం – ఇవి ఒక్కొక్క ప్రసృతి కలిపి చేసిన పేయ. ఇది స్నేహపానం.

**పాండుకర్మ** – నల్లనివాళ్ళను తెల్లనివాళ్ళుగా చేసేక్రియ.

**పాచకద్రవ్యగణం** – ఆమపచనం చేసే ద్రవ్యాలు. అవి – కొండపిండి చెట్టు, మిరియాలు, వాము, సొంటి, కొబ్బరి, చవ్యం, గజపిప్పలి, కర్కాటక శృంగి – ఇత్యాదులు.

**పాచనం** – ఆమపచనం చేసేది.

**పాచనదీపనం** – ఆమపచనం చేసి ఆకలి పుట్టించేది. చిత్రమూలం ఈ గుణం కలది.

**పాచనౌషధం** – ఆమపచనం చేసేది. కాని ఆకలి పుట్టించలేదు. నాగకేసరం గుణం యిది.

**పాటనం** – ఛేదనం.

**పాటవం** – పటుత్వం – ఆరోగ్యం.

**పాటలోపలం** – మాణిక్యం.

**పాఠాదశకం** – చనుబాలు శోధించే వస్తువులు. అవి – పార, సొంటి, దేవదారు, తుంగముస్తలు, చాగ, తిప్పతీగ, కొడిశపాలవిత్తులు, నేలవేము, కటుకరోహిణి, సుగంధిన్ని.

**పాఠాద్వయం** – పార, కలిగొట్టున్ను.

**పాణి** – మానపరిభాష. ఒక కర్షం.

**పాణితలం** – మానపరిభాష. ఒక కర్షం.

**పాణిమానికం** – మానపరిభాష. ఒక కర్షం.

**పాణీతలం** – మానపరిభాష. ఒక కర్షం.

**పాతనం** – ఊర్ధ్వపాతనం, తిర్యక్పాతనం, అధఃపాతనం అని మూడు రసశుద్ధిక్రియలు.

**పాతనయంత్రం** – రసశుద్ధిచేసే ఒక యంత్రం.

**పాతాళయంత్రం** – ఔషధాలు వండే ఒక యంత్రం.

**పాత్రం** – మానపరిభాష. ఒక ఆఢకం.

**పాదచతుష్టయం** – ఆయుర్వేద వైద్యానికి వైద్యుడు, ఔషధాది ద్రవ్యం, ఉపస్థాత (పరిచారకుడు), రోగి అని నాలుగు పాదాలు.

**పాదత్రాణం** – చెప్పులజోడు.

**పాదపోత్పలం** – కర్ణికారం.

**పాదవల్మీకం** – శ్లీపదరోగం.

**పాదవిరజ** – చర్మంతోచేసిన పాదుక.

**పాదశిష్టం** – నాలుగోవంతు మిగిలేటట్టు కాచినది.

**పాదసుప్తి** – పాదాలు ముట్టుకుంటే స్పర్శ తెలియకపోడం.

**పాదహీనం** – నాలుగోవంతు మరిగిన నీరు.

**పాదాభ్యంగం** – అరికాళ్ళకు నూనె, నెయ్యి, ఆముదం – వీటిలో ఏదయినా బాగా ఇనికేటట్టు మర్దించుకోడం. దీనివల్ల స్రోతస్సులు మృదుత్వం పొందుతాయి. కఫవాతాలు హరిస్తాయి. ధాతువులకు పుష్టి కలుగుతుంది. కాంతీ, బలమూ కలుగుతాయి. నిద్ర పడుతుంది. పాదచర్మానికి మృదుత్వమున్నూ కలుగుతుంది. అభ్యంగంలో ఇదొక భాగం.

**పానకం** – చక్కెర, నిమ్మకాయరసం యథోచితంగా నీళ్ళలో కలిపి చేసిన పానద్రవ్యం. నిమ్మకాయకు బదులు మరేదయినా ఆమ్లద్రవ్యం చేర్చుకోవచ్చు.

**పానగోష్ఠిక** – కల్లుపాక.

**పానపాత్ర** – సురాపానం చేసే పాత్ర.

**పానవణిక్కు** – కల్లు అమ్మేవాడు.

**పానమాత్ర** – సురాపానం మోతాదు. దృష్టి చెడనంత వరకూ, మనస్సు క్షుభితం కానంతవరకూ – ఇది మద్యపానం మోతాదు.

**పాపం** – పాపకర్మ. కాయికం, వాచికం, మానసికం అని యిది మూడు విధాలు. ఒకరివ్వకుండా చూసిన వస్తువులు దొంగలించడం, పరహింస, పరస్త్రీసంగమం – ఇవి కాయికాలు. పరుషంగా మాట్లాడడం, అబద్ధాలాడడం, పైశున్యం, అసంబద్ధాలాపం – ఇవి వాచికాలు. పరద్రవ్యవాంఛ, మనసా ఇతర్లకు కీడు తలపెట్టడం, మొండి పట్టుదల – ఇవి మానసికాలు. మొత్తం పది.

**పాపఘ్నం** – నువ్వులు.

**పాపఘ్ని** – తులసిచెట్టు.

**పాపోదకం** – మలమూత్రాలూ, పురుగులూ ఇలాంటి వాటితో నిండి వుండిన జలం.

**పాయసం** – అంటే క్షీరాన్నం. బియ్యం నేతితో దోరగా వేయించి పాలు చక్కెర చేర్చి వండినది.

**పారతంత్ర్యం** – పరాధీనత.

**పార్థివచూర్ణం** – ధూళి.

**పార్థివ ద్రవ్యాలు** – గురు, ఖర, కఠిన, మంద, స్థిర, విశద, సాంద్ర, స్థూల, గంధగుణాలు అధికంగా కలవి.

**పార్థివాలు** – త్రివిధద్రవ్యాలలో ఒకరకం. అవి – బంగారం, లోహాలు, లోహమలాలు, ఇసుక, సున్నం, మణిశిల, తాళకం, మణులు, ఉప్పు, కావిరాళ్ళు, సౌవీరాంజనం – ఇత్యాదులు.

**పాలనం** – కొత్తగా ఈనిన ఆవుపాలు.

**పావనధ్వని** – శంఖం.

**పాశవపాలనం** – గడ్డి.

**ప్రాణాభిసరుడు** – వైద్యుడు. వెళ్ళిపోయే ప్రాణాలు మళ్ళించేవాడు.

**పిండిక** – గుండ్రముగా ఉండే అరుగు.

**పిండిస్వేదం** – ఇదే సంకరస్వేదం.

**పికానందం** – వసంతకాలం.

**పికురసం** – మద్యం.

**పిచ్ఛిలం** – జిడ్డుకలది.

**పిచ్ఛిలవస్తి** – నిరూహవస్తి.

**పితృజం** – తన శరీరానికి తండ్రివల్ల సంక్రమించినవి. అవి – కేశాలు, మీసాలు, గోళ్ళు, దంతాలు, ఎముకలు, రోమం, స్నాయువులు, ధమనులు – ఇత్యాది.

**పితృప్రసువు** – సాయంకాలం.

**పితృభోజనం** – మినుములు.

**పిత్తపంచకం** – పాచకపిత్తం, రంజకపిత్తం, సాధకపిత్తం, ఆలోచనకపిత్తం, భ్రాజకపిత్తం అని పిత్తం అయిదు రకాలు.

**పిత్తవర్గం** – పిత్తాలు అంటే చేదుకట్లు. ఇవి అయిదు – చేప, ఆవు, గుర్రం, రురువు, నెమలి – వీటి చేదుకట్లు.

*మతాంతరం:* పంది, మేక, ఎనుము, చేప, నెమలి – వీటి చేదుకట్లు.

**పిత్తసంశమనవర్గం** – పిత్తశాంతికర ద్రవ్యాలు. అవి – చందనం, రక్తచందనం, వట్టివేరు, కురువేరు, మంజిష్ఠ, కాకోళి, నేలగుమ్మడు, పిల్లితేగలు, నాచు, కలువ, తామరపువ్వులు, నల్లకలువపువ్వులు, అరటి, పద్మబీజాలు, దూర్వలు, చాగ – ఇత్యాదులు.

**పిత్తస్థానాలు** – చెమట, రసధాతువు, లసీక, ఆమాశయం – ఇవి పిత్తస్థానాలు. వీటిలో ఆమాశయం ప్రధాన స్థానం.

**పిప్పలీద్వయం** – పిప్పళ్ళు, గజపిప్పళ్ళున్ను.

**పిప్పల్యాదిగణం** – ఇది వాతరక్తం హరించి అగ్నిదీప్తి కలిగిస్తుంది. ద్రవ్యాలు – పిప్పళ్ళు, పిప్పలిమోడి, చవ్యం, చిత్రమూలం, అల్లం, మిరియాలు, గజపిప్పళ్ళు, రేణుకలు, ఏలకులు, అజామోదం, కొడిశపాలవిత్తులు, పార, జీలకర్ర, ఆవాలు, వెనవేప, ఉమ్మెత్త పండు, ఇంగువ, గంట భారంగి, చాగ, అతివస, వస, వాయు, విడంగాలు, కటుకరోహిణిన్ని.

**పిప్పిక** – దంతమలం.

**పిశితం** – మాంసం.

**పిశితోదకం** – కుంకుమ.

**పిష్టసౌరభం** – చందనం.

**పీయూషం** – కొత్తగా యీనిన ఆవుపాలు. జున్ను చేసే ముర్రుపాలు.

**పుటం** – ఔషధాలు వంటచేసే ఒక విధానం. ఈ పుటాలు – మహాపుటం, గజపుటం, వరాహపుటం, కుక్కుటపుటం, కపోతపుటం, కోవరపుటం, భాండపుటం – అని యేడు రకాలు.

**పుటపాకం** – పత్రపుటంతో స్వరసద్రవ్యకల్కం పుటం పెట్టడం. ఔషధ ద్రవ్యం నీటితో మెత్తగా నూరి, ఉండచేసి, దానికి నేరేడాకులయినా, మర్రిఆకు అయినా చుట్టి దారంతో కట్టి, అప్పుడు దానికి రెండంగుళాల దళసరిగా మట్టిపూసేది. అంటే కవచం యిచ్చేది. తరవాత, ఆమట్టి యెర్రబడేటట్టు పుటంవేసి చల్లారిన తరవాత లోపలి మందు యుక్తిగా తీసుకునేది.

**పుటోదకం** – కొబ్బరిచెట్టు.

**పురాణఘృతం** – కుండలోపోసి పది సంవత్సరాల కాలం నిలవచేసిన నెయ్యి. కొందరు ఒక్క సంవత్సరం ఉంచినదిన్నీ పురాణమే అంటారు.

**పురాతనధాన్యం** – ఏడాది కిందటి పంట.

**పురీషనిగ్రహవర్గం** – కచోరం, పుష్కరమూలం, రేగువిత్తులు, ములక, వాకుడు, బదనిక, కరక,

పిప్పళ్ళు, దూలగొండి, కర్కాటక శృంగిన్ని.

**పురీషవిరజనీయవర్గం** – నేరేడు, అందుగు పట్ట, దూలగొండి, యష్టీమధుకం, బూరుగు, శ్రీవేష్టకం, పాలగుమ్ముడు, వేయించిన మట్టి, కలువ, నువ్వులపొడిన్ని.

**పురీషసంగ్రహణవర్గం** – ప్రేంకణం, సుగంధి, మామిడిజీడి, దుందిలం, లొద్దుగు, బూరుగు బంక, మణుగుదామర, ఆరెపువ్వు, భారంగి, పద్మకేసరాలున్ను.

**పురుషత్వం** – మైథునసామర్థ్యం.

**పురోగతి** – కోడి.

**పుష్కరవ్యాఘ్రం** – గద్ద.

**పుష్కరిణి** – చిన్న చెరువు, కోనేరు.

**పుష్టి** – శరీరపుష్టి.

**పుష్పమాసం** – వసంతకాలం.

**పుష్పసాధారణం** – వసంతకాలం.

**పుష్పసారాలు** –పువ్వులే సారం కల ద్రవ్యాలు. అవి – సంపంగి, మొగిలి, అశోకం, పాదిరి, పొన్న, భుజప్రతి, పొగడ, కురువిందం, జాజి, మల్లె, వావిలి, మొల్ల, మునగ, సదాప, రేల, లవంగం, ఆరె, నందివర్ధనం, కలువ, దాసాని ఇత్యాదులు.

**పుష్పహాస** – ఋతుమతి అయిన స్త్రీ.

**పుష్పాండకం** – అన్నం.

**పుష్పేంద్రం** – బంగారం.

**పూగపీఠం** –నిష్ఠీవనపాత్ర, పీకిదాన్.

**పూజాపంచామృతం** – పంచామృతాలలో ఇదొకటి. ఇది దేవపూజాకాలంలో వాడేది. ద్రవ్యాలు – నెయ్యి, తేనె, చక్కెర, పెరుగు, పాలున్ను.

**పూతీకద్వయం** – కరంజద్వయం.

**పూత్యండం** – కస్తూరిమృగం.

**పూర్వకర్మ** – రోగోత్పత్తి, కాకముందు ఆ విషయమై చేసే చికిత్సా కర్మలు. అవి – పూర్వకర్మ, పశ్చాత్కర్మ, ప్రధానకర్మ అని మూడు. వాటిలో ఇది మొదటిది.

**పూర్వరూపం** – భావిరోగసూచకం. ఇది సామాన్య పూర్వరూపం, విశేష పూర్వ రూపం అని రెండు విధాలు.

**పూర్వాభిభాషి** – ఇతరులను కలుసుకున్న ప్పుడు, వారిని తానే ముందుగా పలకరించి సంభాషించేవాడు. సభ్యత కిది మంచిగుర్తు. ఎవరి మట్టుకి వారే యీ సూత్రం అవలం బించి నడుచుకుంటే సంఘంలో చక్కని మర్యాద ద్యోతకం అవుతుంది. అది జాతి బాగుపడడానికి చాలా ఉపకరిస్తుంది.

**పృథివీగుణాలు** – అస్థులు, చర్మం, గోళ్ళు, మాంసం, రోమాలున్ను.

**పృథుకాలు** – అటుకులు.

**పృషదాజ్యం** – పెరుగు కలిసిన నెయ్యి.

**పృష్ఠచక్షువు** – పీత – ఎండ్రకాయ.

**పృష్ఠదృష్టి** – ఎలుగుగొడ్డు.

**పృష్ఠశృంగం** – అడవిమేక.

**పేయం** – అష్టవిధ అన్నాలలో ఒకటి. బియ్యం చమురుతో వేయించి నీళ్ళుపోసి వండిన (ఆ మెతుకులతో వున్న) గంజి – చిక్కనిది.

మతాంతరం: పెరుగుమీది తేటలో బెల్లం కలిపి, అది, నెయ్యి నూనె వస మజ్జ బియ్యమున్ను ఒక్కొక్క ప్రసరం చేర్చి వండినది.

మరొకపద్ధతి – తాగవలసినది. ఇది ద్రవపదార్థం. చతుర్విధాహారాలలో ఇదొకటి.

**పేయూషం** – కొత్తగా యీనిన ఆవు, ఈనిన దినం మొదలు ఏడు దినాలలో ఇచ్చే పాలు.

**పేశలం** – మనోజ్ఞమైన మాట.

**పేశీలు** – దేహానికి బింకమూ బలమూ కలిగించే మాంసకోశాలకు పేశీలని పేరు.

**పైతృకగుణాలు** – శిశువులకు తండ్రిగుణాలు కొన్ని సంక్రమిస్తాయి. అవి – వెంద్రుకలు, మీసాలు, శరీరంమీద రోమాలు, ఎముకలు, గోళ్ళు, దంతాలు, శిరలు, స్నాయువులు, ధమనులు, శుక్రమున్ను.

**పైశున్యం** – ఇతర్లలో భేదం కలిగించే మాట.

**పోత్రాయుధం** – పంది.

**పోతవం** – పరిమాణం.

**పౌత్రికం** – పుత్రికలు అనే తేనెటీగలు గూర్చిన తేనె. ఇది నేతిరంగుగా ఉంటుంది.

**పౌపికుడు** – అప్పాలు చెయ్యడంలో చాలా నేర్పుకలవాడు.

**పౌరోగవుడు** – వంటయింటి అధిపతి.

**పౌష్టికం** – పుష్టి చేసే ద్రవ్యం.

**ప్రకాండం** – కొమ్మలవరకూ ఉండే చెట్టు మాను.

**ప్రకాశజ్ఞాత** – కోడి.
**ప్రకుంచం** – మానపరిభాష. ఒక పలం.
**ప్రకులం** – సుందరమైన దేహం.
**ప్రకృతి** – ధాతుసామ్యం. అంటే వాతపిత్తక ఫాలు, రసరక్తాదులూ, సత్త్వరజస్తమస్సులూ యథార్థంగా వుండడం. ఇది సుఖహేతువు. ఇదే ఆరోగ్యం.
**పకృతి భోజనం** – స్వాభావికాహారం.
**ప్రకృతిగురువులు** – కొన్ని పదార్థాలు పంట మొదలైన సంస్కారాలవల్ల కాక, సహజసి ద్ధంగానే గురువులయి వుంటాయి. ఇవి పృధివ్యాపోగుణబహుళాలు.
**ప్రకృతిలఘువులు** – పదార్థాలు కొన్ని స్వతస్సి ద్ధంగా లఘువులయి వుంటాయి. శాలిధాన్యం, అరవై దినాల పంట ధాన్యం, జింక మాంసం, కుందేలుమాంసం ఇత్యాదులు – ఇవి వాయగ్నిగుణ బహుళాలు.
**ప్రకోపం** – వాతాది దోషాలు స్వస్థానాలు విడిచి ఇతరత్రా సంచరించడం.
**ప్రక్రియ** – చికిత్స. ఒక విధానమున్ను.
**ప్రచ్ఛర్దనం** – వమనం.
**ప్రచ్ఛాదనం** – ఉత్తరీయం.
**ప్రజ** – సంతతి.
**ప్రజననం** – గర్భధారణం.
**ప్రజల్పం** – అతిగా మాట్లాడడం. ఇదే వాగడం.
**ప్రజాత** – బాలెంతరాలు.
**ప్రజాదానం** – వెండి.
**ప్రజావాతం** – నీరు.
**ప్రజ్ఞాపరాధం** – అహితసేవనం. అతివ్యవాయం మొదలైనవి. బుద్ధి భ్రంశం. దీనివల్లనే రోగకార ణాలైన అతియోగ అయోగ మిథ్యాయోగాలు సంభవిస్తాయి.
**ప్రజ్ఞాస్థాపనవర్గం** – వెర్రిపాపర, సరస్వతీ ఆకు, గరిక, తెల్లగరిక, లక్ష్మణపంజి, తిప్ప తీగ, కరక్కాయ, వేము, ముత్తవపులంగం, ప్రేంకణమున్ను.
**ప్రణాళిక** – నీరుపోయేమార్గం.
**ప్రతికర్మ** – ప్రతిక్రియ.
**ప్రతిఘ** – మూర్ఛ.
**ప్రతిచ్ఛాయ** – నీళ్ళు, అద్దం, ఎండ మొదలై నవాటిలో ప్రతిఫలించిన ప్రతిరూపం.
**ప్రతిజ్ఞాహాని** – చేసినప్రతిజ్ఞ విడిచిపెట్టడం.
**ప్రతినివిష్టపరిషత్తు** – ఇది పరిషత్తులలో ఒక విధం. ఒక పట్టుదల పెట్టుకుని ఆలోచన ప్రారంభించినవాళ్ళ కూటమి.
**ప్రతిమర్శం** – శిరోవస్తివిశేషం. ఇది చిన్ననాటి నుంచి ప్రయోగిస్తూ వుండవలసినది.
**ప్రతియత్నం** – రచన.
**ప్రతిరంభం** – సంతాపం.
**ప్రతిబింబదర్శకం** – అద్దం.
**ప్రతిసమాధానం** – రోగవిముక్తి కలిగించడం.
**ప్రతిసారణం** – లవణాలతోనూ, కటుచూర్ణా లతోనూ వ్రణాలు ఘర్షించడం.
**ప్రతీకారం** – చికిత్స.
**ప్రతీవాపం** – కషాయంలో చూర్ణాదులు కలపడం.
**ప్రతుదాలు** – ప్రతుదం అంటే పురుగులను పొడుచుకుని తినేవి. వెన్నెలపులుగు, కూతు రుగుడంగి, కూకటిమూగ, చిలుక, గోరువంక, ఊరబిచ్చుక, కోయిల, పసరి, గువ్వ, పిచిక ఇత్యాదులు ప్రతుద పక్షులు.
**ప్రత్యంగం** – అంగాలూ, అవయవాలూను. శిరస్సు, ఉదరం, పృష్ఠం, నాభి, లలాటం, నాసిక, గడ్డం, వస్తి, కంఠం – ఇవి ఒక్కొ క్కటే. చెవులు, నేత్రాలు, ముక్కుపుటాలూ, శంఖాలూ, మూపురాలూ, గండస్థలాలూ, కక్షలూ, స్తనాలూ, వృషణాలూ, పక్కలూ, పిరుదులూ, భుజాలూ, మోకాళ్ళూ, చేతులూ, తొడలూ మొదలైనవి రెండేసి, వేళ్ళు ఇరవై. ఇది ప్రత్యంగ విభాగం. ఇవికాక చర్మం, కలలు, ధాతువులు, మలాలు, దోషాలు, యకృత్తు, ప్లీహ, పుప్ఫుసం, ఉండుకం, హృదయం, ఆశయాలు, అంత్రాలు, వృక్కలు, స్రోతస్సులు, కండరాలు, జాలాలూ, కూర్చలు. రజ్జువులు, సేవనులు. సంఘాతాలు, సీమంతాలు, అస్థులు, సంధులు, స్నాయువులు, పేసులు, మర్మలు, శిరలు, ధమనులు, యోగవాహినులున్ను. వివరాలు అన్యత్రా చూసుకునేది.
**ప్రత్యంజనం** – కాటుకతో కళ్ళు అలంకరిం చుకోడం.
**ప్రత్యనీకం** – ప్రతికూలం, అసాధ్యమున్ను.
**ప్రత్యనుయోగం** – అనుయోగాని కనుయోగం.
**ప్రత్యయం** – హేతువు.
**ప్రత్యవసానం** – భోజనం.
**ప్రత్యక్షం** – ఇంద్రియగ్రాహ్యం. చాక్షుషాదిభే దంవల్ల ఇది ఆరువిధాలు. ఇది ఆత్మకూ

పంచేంద్రియాలకున్నూ తెలుస్తుంది. సుఖం, దుఃఖం, ఇచ్ఛ, ద్వేషం – ఇత్యాదులు ఆత్మకు కలిగే ప్రత్యక్షాలు. శబ్దాదులు ఇంద్రియ ప్రత్యక్షాలు.

ప్రత్యక్షం – ఇది ప్రమాణచతుష్టయంలో వొకటి. ఆత్మ, ఇంద్రియాలు, మనస్సు – ఇవి మూడున్నూ చేరిక అవుతూ వుండగానే కలిగే బుద్ధి ప్రత్యక్షం. అంటే, ఆత్మ మనస్సుతోకూడి, ఆ మనస్సు చక్షుస్సు మొదలైన ఇంద్రియాలను ప్రేరేపిస్తుంది. అవి పదార్థాలతో సంయోగం పొందుతాయి. అది ప్రత్యక్ష ప్రమాణం.

ప్రత్యాఖ్యేయరోగాలు – ఎంత గొప్పగా చికిత్స చేసినా కుదరవని విడిచిపెట్టతగ్గ వ్యాధులు.

ప్రత్యూషం – ప్రభాతకాలం.

ప్రథమనవనీతం – పశువు ఈనినది మొదలు నూరుదినాల వరకూ వచ్చే వెన్న.

ప్రథమనశ్యం – ఆరంగుళాల పొడుగూ, ఒక చివర రెండు కొమ్ములూ, వాటికి రంధ్రాలూ గల ఒక గొట్టంలో సొంటి, వస, పిప్పళ్ళు మొదలైన తీక్ష్ణద్రవ్యాల చూర్ణం ఒక తులం పోసి, అది రెండు ముక్కులతోనూ పీల్చడం ప్రథమనశ్యం.

ప్రథమమదం – మోతాదుగా మద్యపానం చేస్తే కలిగే మదావస్థలలో ఇది మొదటిది. ఈ మదం కలిగేవరకూ మాత్రమే మద్యపానం చెయ్యడం చాలా మంచిది. ఇలా చేస్తే బుద్ధి వికసిస్తుంది. స్మృతి అంటే జ్ఞాపకశక్తి వృద్ధి అవుతుంది. ప్రీతి కలుగుతుంది. సుఖంగా వుంటుంది. అన్నపానాదులయందూ, నిద్రయందూ ప్రీతి పుట్టేస్తుంది. చదవడానికీ, పాడడానికీ ఉత్సాహం కలిగిస్తుంది. కంఠస్వరం సరిచేస్తుంది. ఇది చాలా మంచిది. మనిషికి చాలా మేలు చేసేదిన్ని.

ప్రదీపం – ఇదొక స్థావర విషం. ఎర్రగా వుంటుంది. అగ్నిలాగ మెరుస్తుంది. చాలా దారుణమైనది.

ప్రదేశం – ఒక చోట ఉపయోగించింది కనక మరొక చోటా ఉపయోగిస్తుందన్న సాధనం.

ప్రదేహం – అనులేపనం, అభ్యంగనం మొదలైనవి.

ప్రధమనం – నశ్యవిశేషం.

ప్రప – చలివేంద్ర.

ప్రపాణం – మీదిపెదవి.

ప్రపానకం – పానకం.

ప్రపురాతనఘృతం – అతిపురాతనమైన నెయ్యి. ఇది మెర్రగానూ, చల్లగానూ వుంటుంది.

ప్రవాళచందనం – రక్తచందనం.

ప్రభవం – కారణం. జన్మహేతువున్ను.

ప్రభాతం – అంటే ప్రాతఃకాలం. తెల్లవారగానే, తనకు శ్రేయస్సు కావాలని కోరుకునే ప్రతీ వాడూ ముందుగా వైద్యుడు, పురోహితుడు, మంత్రి, సిద్ధాంతి – వీరి దర్శనం చేసుకోవాలి.

ప్రభావం – రెండు ద్రవ్యాలు ఒకచోట చేరి నప్పుడు, వాటి రసవీర్య విపాకాలు సమానాలే అయినా కృత్యాలు వేరు కావచ్చు. అదీ ప్రభావం.

ప్రభువు – పాదరసం.

ప్రమథనం – విలోడనం.

ప్రమథితం – వెన్న. నీళ్ళు కలియని మజ్జిగ అనిన్ని.

ప్రమధ్య – మందభేదం.

ప్రమాథి – సూక్ష్మతీక్ష్ణభావాల వల్ల వ్యాపక ధర్మం కలది. అంటే, తన వీర్యంవల్ల శరీరంలో వుండే కఫాదిదోషాలను చెవులు, ముక్కులు, కళ్ళు, నోరు మొదలైన స్రోతోరంధ్రాలనుంచి బయటికి వెడలించే మిరియాలు, వస – మొదలైనవి ప్రమాథులు.

ప్రమితాశనం – అత్యల్పభోజనం.

ప్రమోహం – మూర్ఛ.

ప్రయోగవస్తి – రసాయనాలూ, వాజీకరౌషధాలూ పుచ్చుకోడానికి ముందుగా చేసుకోవలసిన వస్తికర్మ. ఇది యెనిమిది రకాలు. మొదట ఒక స్నేహవస్తి చెయ్యాలి. తరవాత మూడు నిరూహవస్తులు. చివరికి నాలుగు స్నేహవస్తులున్ను చెయ్యాలి. దీని పేరు ప్రయోగవస్తి.

ప్రరూఢం – జఠరం.

ప్రలీనత – ప్రళయం.

ప్రళయం – ఇంద్రియస్వాపం.

ప్రలాపం – అనర్థకవచనాలు.

ప్రవరసత్వుడు – సత్వవంతుడు. అనగా, ఎంతెంత పీడ కలిగినా ఓర్చుకుంటూ, కంగారుపడకుండా, నిదానంగా వుండగలవాడు.

ప్రవాతం – ప్రబలమైన గాలి.

ప్రవృత్త్యుపరమం – మరణం.

ప్రవేణి – ఆస్తరణం.

ప్రశమం – శాంతి.
ప్రశమనం – శాంతికరం.
ప్రష్ఠౌహి – తొలిచూలి ఆవు.
ప్రసహాలు – ప్రసహం అంటే ఆహారం బలవంతంగా గుంజుకుని భుజించేది. గోవులు, గాడిద, కంచరగాడిద, ఒంటె, గుఱ్ఱం, చిరుతపులి, సింహం, ఎలుగుబంటి, కోతి, పిల్లి, పెద్దపులి, తోడేలు, ముంగిస, సివంగి, వరదునక్క, నక్క, డేగ, పాలపిట్ట, వాంతాదం, కాకి, శతఘ్ని, భాసపక్షి కురరం (కలహంస), గద్ద, గుడ్లగూబ, వల్లవి పిచిక, ధూమిక, మధుహ – ఇవన్నీ ప్రసహాలు.
ప్రసాదనం – అన్నం.
ప్రసాదనగండూషం – ఇదే శమనగండూషం.
ప్రసుప్తి – అతిగాఢనిద్ర.
ప్రసువు – అరటిచెట్టు.
ప్రసూక – గుఱ్ఱం.
ప్రసూత – బాలెంతరాలు.
ప్రసృతం – మానపరిభాష. రెండు పలాలు.
ప్రసృతదధి – వస్త్రగాలితం చేసిన పెరుగు.
ప్రసృతి – మానపరిభాష. రెండు పలాలు.
ప్రసేకం – చొంగకారడం.
ప్రస్కందనం – విరేచనం. అతిసారమున్ను.
ప్రస్తరస్వేదం – స్వేదకర్మలలో ఇదొకటి. వరిధాన్యం అయినా, కాయధాన్యం అయినా వండి, ఆ అన్నం అయినా – వాటితో చేసిన వేసవారం, కృసరం, ఉత్కారిక మొదలైన వాటితో నయినా పురుష ప్రమాణంగా రాతిపలకమీద పరిచి దానిమీద పట్టుబట్ట, కంబళి, ఆముదపాకులు, జిల్లేడాకులు – వీటిలో వొకదానితో కప్పి, రోగిని శరీరం అంతటా వాతహరతైలం పట్టించి, దానిమీద పడుకోబెడితే చెమట బాగా పుడుతుంది. ఇది ప్రస్తరస్వేదం.
ప్రస్తరోద్భూతం – రాతిలోపుట్టిన నీరు.
ప్రస్తాన్నం – పాతబియ్యం.
ప్రస్తారం – శయ్య.
ప్రస్థం – మానపరిభాష. రెండు శరావాలు.
ప్రస్ఫోటనం – పచనం.
ప్రస్రవం – పాలు.
ప్రస్రవణజలం – సెలయేటి నీరు.
ప్రస్వేదం – అతిచెమట.

ప్రహనేమి – చంద్రుడు.
ప్రక్షాళనం – కడగడం.
ప్రక్షేపం – కషాయాదులలో చేర్చే చూర్ణాదికం.
ప్రాకృతం – సుఖసాధ్యం.
ప్రాకృతదోషం – ప్రకృతిసంపన్నాలైన వాతాదులు. వర్షశిశిరాలలో వాయువు ప్రకోపిస్తుంది. గ్రీష్మశరత్తులలో పిత్తం ప్రకోపిస్తుంది. హేమంత వసంతాలలో కఫం ప్రకోపిస్తుంది.
ప్రాగ్భక్తం – భోజనానికి ముందుగా చేసే ఘృతపానం.
ప్రాగ్రాటం – పలచని పెరుగు.
ప్రాణం – శరీరంలో పంచవాయువులలో ఇదొకటి. ఇది నోటిలో సంచరిస్తూ వుంటుంది. దేహధారణ కిదే ఆధారం. తిన్న ఆహారాదికాన్ని ఇదే లోపల ప్రవేశపెడుతుంది. ఇది దుష్టం అయితే, ఎక్కిళ్ళు, శ్వాస మొదలైన వ్యాధులు పుడతాయి.
ప్రాణం – జీవనం.
ప్రాణవాయువు – ఇది హృదయంలో వుండే వాయువు.
ప్రాణసంయమం – శ్వాసనిరోధం. అంటే ఊపిరి బిగపట్టడం.
ప్రాణసద్మం – శరీరం.
ప్రాణహరం – విషం. నాభి మొదలైన విషాలు ప్రాణం హరిస్తాయి. ఈ ద్రవ్యాలకు వ్యవాయి, వికాసి, సూక్ష్మం, ఛేదనం, మందకారి, ఉష్ణవీర్యం – ఈ గుణాలున్నాయి. వీటికి యోగవాహిద్రవ్యాలనిన్నీ పేరు.
ప్రాణాచార్యుడు – చికిత్సకుడు.
ప్రాణాపానీ – అశ్వినీకుమారులు.
ప్రాణాభిసరుడు – శాస్త్రం బాగా చదువుకుని, తెలుసుకుని, చికిత్సలో స్వతంత్రుడూ, నిపుణుడూ అయి, పోతూవున్న రోగి ప్రాణాలు నిలబెట్టే వైద్యుడు.
ప్రాణాయతనాలు – ప్రాణాలకు ముఖ్యమైన స్థానాలు. కణతలు, శిరస్సు, హృదయం, వస్తి, కంఠం, శుక్రం, ఓజస్సు, గుదస్థానం అనియివి పది.
ప్రాణాయామం – ప్రాణవాయునిరోధం.
ప్రాణహిత – చెప్పులు.
ప్రాణైషణ – ఏషణాత్రయంలో ఇదొకటి. వాటిలో మొదటిదిన్ని. ప్రాణైషణ అంటే

ప్రాణరక్షణసాధన అన్నమాట. ప్రాణపరిత్యాగం సంభవిస్తే సకల వ్యాపారాలు నిలిచిపోతాయి. కనక, ప్రతీవాడూ యీ విషయమై బాగా శ్రద్ధపట్టాలి. దీనికి మార్గం – స్వస్థవృత్తం అనుసరించి నడుచుకోవడం, వ్యాధి సంభవిస్తే సరి అయిన చికిత్స చేయించుకోడమున్నూ. ఈ రెండింటి విషయమూ శ్రద్ధగా వుండే వాడు దీర్ఘాయుష్మంతుడై సకల సుఖాలూ అనుభవిస్తాడు.

**ప్రాతఃకృత్యం** – ప్రాతఃకాలం అనుష్ఠించవలసిన కృత్యాలు.

**ప్రాతఃస్నానం** – ప్రాతఃకాలంలో చేసే స్నానం. ఇది అవగాహనస్నానం అయివుంటే మంచిది. అంటే నీటిలో మునిగి చేసే స్నానం.

**ప్రాతర్భోక్త** – కాకి.

**ప్రాతిక** – వార్ధక్యం.

**ప్రాబోధికం** – ఉషఃకాలం.

**ప్రాయోగికం** – ధూమపానాలలో ఇదొకటి. ఇది శమనం. ఇది నిత్యమూ ఆచరించతగ్గది. ఇందులో ఉపయోగించే ధూమవర్తి రేణుకలు, ప్రేంకణం, నల్లజీలకర్ర, నాగకేసరాలు, నఖంచిప్పలు, కురువేరు, చందనం, లవంగపత్రి, లవంగపట్ట, ఏలకులు, వట్టివేళ్ళు, పద్మకం, కామంచిగడ్డి, అతిమధురం, జటామాంసి, గుగ్గిలం, అగరు, చక్కెర, మట్టిపట్ట, అత్తిపట్ట, రావిపట్ట, జువ్విపట్ట, లొద్దుగపట్ట, అడవితుంగగడ్డలు, మర్దిపాలు, రాతిపువ్వు, తామరపువ్వులు, నల్లకలవలు, దేవదారుబంక, అందుగుబంక, గ్రంధిపర్ణం (మాచిపత్రి) – వీటితో తయారుచెయ్యాలి.

**ప్రావరణం** – ఉన్నిబట్ట.

**ప్రావారం** – ఉత్తరీయం.

**ప్రావృషికం** – నెమలి.

**ప్రాశం** – అవలేహం.

**ప్రాసాదకుక్కుటం** – పావురం.

**ప్రాస్రవణోదకం** – పర్వతాలమీద పుట్టి, పర్వతాలమీదే నిలిచిన నీరు. దీనికి గాలి, వెలుతురు, ఎండ – ఇవి స్వేచ్ఛగా తగులుతూ వుంటాయి. చల్లగానూ, స్వచ్ఛంగానూ, తియ్యగానూ వుంటుంది. లఘుగుణ విశిష్టం.

**ప్రియవాదిని** – గోరువంక.

**ప్రీణనం** – మనఃప్రీతికరం. తృప్తికరమున్నూ.

**ప్రేమపాతనం** – కన్నీరు.

**ప్రైషం** – ఉన్మాదం.

**ప్రోజ్ఝనం** – మారణం.

**ప్రోచ్ఛనం** – లేపనం

**ప్రోల్లాఘితుడు** – రోగముక్తుడు.

**ప్రోషం** – సంతాపం.

**ప్రౌఢ** – 30 – 55 సంవత్సరాల మధ్య వయస్సు కల స్త్రీ.

**ప్లవగతి** – కప్ప.

**ప్లవంగమం** – కోతి.

**ప్లవనం** – ఈదడం.

**ప్లావగం** – కోతి.

**ఫణిప్రియం** – గాలి.

**ఫలకేసరం** – కొబ్బరిచెట్టు.

**ఫలత్రయం** – త్రిఫలాలు.

**ఫలపంచామ్లం** – నిమ్మ, నారింజ, అమ్లవేతసం, చింతపండు, మాదీఫలమున్నూ.

**ఫలముండం** – కొబ్బరిచెట్టు.

**ఫలవర్తి** – మలం బయటికి వెడలించడానికి గుదమార్గాన నెయ్యిపూసి ఎక్కించే వత్తి. ఇది బొటనవేలి లావున వుంటుంది.

**ఫలవిరేచనం** – ద్రాక్షపండు, వాయువిడంగాలు, ఖర్జూరపుపండు, చిట్టీత, రేల, ఉసిరిక, కరక, తానికాయ, కంపిల్లకం, నేపాళం, దోసకాయ, నలిక, పొగడ, వరగోగు – ఇది ఫలవిరేచన వర్గం.

**ఫలషాడవం** – దానిమ్మ.

**ఫలసారాలు** – ద్రాక్ష, దానిమ్మ, ఖర్జూరం, అరటి, పనస, మామిడి, తాడి, మారేడు, కొబ్బరి, విరిగిచెట్టు, వెలగ, నారింజ, మాదీఫలం, నిమ్మ, అంబాళం, చారపప్పు, దేవదారు, రేగు, గురివింద, గంగరేగు, తోరణం – ఇవన్నీ ఫలసారాలు.

**ఫలామ్లపంచకం** – నిమ్మ, నారింజ, అమ్లవేతసం, చింతపండు, మాదీ ఫలమున్నూ.

**ఫలాస్థి** – కొబ్బరిచెట్టు.

**ఫలిని** – పళ్లుగలది ఫలిని. వీటిలో తెల్లదింటెన, వాయు విడంగాలు, కరదోస, మంగకాయ, నీటి యష్టిమధుకం, మెట్ట యష్టిమధుకం, నెమలియడుగు, కానుగు, ఉత్తరేణి, కరక, నల్లదింటెన, శరత్కాలంలో కాసిన మోరట ఫలం, కంపిల్లకం, పెద్దరేల, కొడిశపాల, చేదు పుచ్చ, వెర్రిసార, దేవదాళి, చేదుబీర – ఈ

పందొమ్మిదీ మిక్కిలి ప్రశస్తాలు.

వీటిలో చేదుపుచ్చకాయ, చేదుపొరకాయ, దావరడంగి, చేదు బీర, మంగకాయ, కొడి శపాల, కీరదోస, మోరటఫలం – ఇవి వమనకర్మకూ, ఆస్థాపనానికీ (నిరూహవస్తికీ) ఉపయోగించతగ్గవి.

**ఫల్యం** – పుష్పం, మొగ్గ.

**ఫాంటం** – కషాయాలలో ఒకరకం.

**ఫాణితం** – అర్థావర్తితమైన ఇక్షురసం. అంటే సగం కాచిన చెరుకురసం. దీనినే గోదావరిజిల్లాలో తేనెపానకం అంటారు.

**ఫాలం** – నాలుబట్ట.

**ఫాల్గునప్రియం** – శంఖం.

**ఫాల్గునానుజం** – వసంతర్తువు.

**ఫింగకం** – మొసలి.

**ఫిరంగిణి** – ఫరంగిదేశీయ స్త్రీ.

**ఫుల్లఫాలం** – చేటగాలి.

**ఫేరవం** – నక్క.

## బ

**బకదర్శి** – పావురం.

**బదరత్రయం** – పెద్దరేగు, చిన్నరేగు, నక్కరేగు.

**బద్ధవిణ్మూత్రం** – మలమూత్రబంధం.

**బలదీనత** – గ్లాని.

**బలదేవుడు** – వాయువు.

**బలవల్లభ** – సుర.

**బలవ్యాపత్తు** – బలక్షయం.

**బలహం** – కఫం.

**బలక్షయం** – వాయువు.

**బలాత్రయం** – శ్వేతబల, పీతబల, నాగబల.

**బలాద్వయం** – బల, అతిబల.

**బలాపంచకం** – బల, అతిబల, నాగబల, మహాబల, రాజబల.

**బలాదిపంచమూలం** – బల, గలిజేరు, ఆముదపువేరు, ముద్గపర్ణి, మాషపర్ణిన్ని.

**బలార్థం** – దేహార్థబలం. హృదయంలోవున్న వాయువు ముఖానికి వస్తుంది. అంటే నోరు మూసుకోడానికి వీలులేనంత ఆయాసం వస్తుంది. అది అర్థబలస్థితి.

**బలాశం/బలాసం** – కఫం.

**బలి** – గంధకం.

**బలిచందనం** – రక్తచందనం.

**బలిపుష్టం** – కాకి.

**బలిముఖం** – వానరం.

**బలిష్ఠం** – లొట్టిపిట్ట.

**బలి** – సింహం.

**బలీనం** – తేలు.

**బల్యం** – బలకరం.

**బల్యవర్గం** – బలకర మహాకషాయ వర్గం. ద్రవ్యాలు – పాపరబుడమ, దూలగొండి, పిల్లితేగలు, కారుమినుము, పాలగుమ్మడు, పెన్నేరు, ముయ్యాకుపొన్న, మాంసరోహిణి, చిట్టాముట్టి, పేరాముట్టిన్ని.

**బల్యాఖ్యపంచమూలం** – బల, పెన్నేరు, మునగకాయ, కొండపిండి, అతిబల.

**మతాంతరం:** పసుపు, తిప్పతీగ, నేలగుమ్మడు, సుగంధి, మేషశృంగి.

**బహిఃకుటీచరం** – పీత.

**బహిఃపరిమార్జనం** – తలంటు.

**బహిఃపరిమార్జనం** – ప్రకారాంతర త్రివిధౌషధాలలో ఇదొకటి. శరీరం పైభాగాన అభ్యంగం, స్వేదం, ప్రదేహం, పరిషేకం, ఉన్మర్దనం – ఈ రూపంగా స్పర్శ కలిగించి వ్యాధి పోగొట్టి ఆరోగ్యం కలిగించేది.

**బహిర్మృజ** – స్నానాదికంతో సిద్ధించే బహిశ్శుద్ధి.

**బహిరింద్రియం** – చెవులు, కళ్ళు, ముక్కు, నాశిక, నాలుక, చర్మం, చేతులు, పాదాలు, పాయువు, ఉపస్థ – ఇవి.

**బహుధ్వజం** – పంది.

**బహునాడికం** – శరీరం.

**బహునాదం** – శంఖం.

**బహుపత్రం** – అభ్రకం.

**బహుపర్వం** – వెదురు.

**బహుమంజరి** – తులసి.

**బహుశత్రువు** – పిచిక.

**బహ్వపత్యం** – కోడి, పంది, ఎలుక.

**బాణలవణం** – పంచలవణాలు.

**బాలుడు** – పదహారేళ్ళవయస్సు వచ్చేదాకా.

**బాలక్రీడనకం** – గవ్వ.

**బాలగర్భిణి** – మొదటిమాటు గర్భం ధరించిన స్త్రీ.

**బాలజీవనం** – పాలు.

**బాలతంత్రం** – కౌమారభృత్యం.

**బాలవైద్యుడు** – బాలబాలికలకు చికిత్స చేసే వైద్యుడు.

**బాహ్యద్రుతి** – రససంస్కారాలలో ఒకటి.

**బాహ్యరోగాయనం** – రక్తాదిశాఖలు, త్వక్కున్ను. వీటిలో వ్యంగం, అలజీ మొదలైన బాహ్యరోగాలు పుడతాయి.

**బిలేశయాలు** – బిలం అంటే కలుగు. కలుగుల్లో నివసించేవి బిలేశయాలు. కప్ప, ఉడుము, పాము, ఏదుపంది – ఇత్యాదులు బిలేశయాలు.

**బీజసారాలు** – వరిధాన్యం, పెసలు, మినుములు మొదలైన శింబీధాన్యం; చిట్టాముట్టి, పెద్దాముదం, పొన్న, పత్తి, తగిరిస, చారపప్పు, వేప, పొగడ, అవిసి, మునగ, కానుగ, మాల్కంగిని, గచ్చ, తెల్లగంటెన, నల్లగంటెన, మామిడి, జాజికాయ, తక్కోలం, మోదుగు, కుక్కవాయింట, పిప్పలి, మిరియాలు, సురుగుడు, ఓమం, ధనియాలు, ఆవాలు, చిల్లగింజలు, జీడి, జీలకర్ర, కరక, ఉసిరిక, తాడి, బావంచి, ఊడుగు, రేగు, వాయువిడంగాలు – ఇత్యాదులన్నీ బీజాలే (గింజలే) సారంగా కలవి.

**బుద్ధితత్త్వం** – ఇదే మహత్తు.

**బుద్ధీంద్రియం** – జ్ఞానేంద్రియాలు. ఇవి – మనస్సు, చెవులు, కళ్ళు, నాలుక, చర్మం, ముక్కున్ను.

**బుభుక్ష** – ఆకలి.

**బృంహణం** – కండపుష్టి కలిగించేది. బలవర్ధనమున్ను.

**బృంహణీయవర్గం** – కండపుష్టి కలిగించే వస్తువులు. ఇవి – పాలతీగ, చిరుబాల, చిట్టాముట్టి, కాకోళి, క్షీరకాకోళి, బల, పచ్చ పువ్వులబల, అడవిపత్తి, తెల్లనేలగుమ్ముడు, పాలగుమ్ముడున్ను.

**బృంహణవస్తి** – వస్తికర్మలలో ఇదొకటి. నేల తాడి, పల్లేరు, దూలగొండివిత్తులు మొదలైన వీర్యవృద్ధి కరద్రవ్యాలు కషాయం కాచి అందులో ద్రాక్షపండు మొదలైన మధుర ద్రవ్యాల కల్కం, నెయ్యి, మాంసరసమున్ను చేర్చివస్తి ప్రయోగం చేసేది.

**బృహతీద్వయం** – పెద్దములక, వాకుడు.

**బృహత్పంచమూలం** – బిల్వం, శ్యోనాకం, పాటల, గణికారిక, గంభారిన్ని.

**బృహత్యాదివర్గం** – పెద్దములక, పుష్కరమూలం, గంటుభారంగి, కచ్చూరాలు, కర్కాటకశృంగి, దూలగొండి, కొండిశపాలవిత్తులు, చేదుపొట్ల, కటుకరోహిణిన్ని.

**బోధనం** – రససంస్కారాలలో వొకటి.

**బ్రహ్మచర్యం** – అమైథునం. ఉపస్థనిగ్రహోదులు.

**బ్రాహ్మముహూర్తం** – అరుణోదయకాలం. రాత్రంతా నిద్రపోయి ఇది మేలుకోవలసిన సమయం.

**బ్రహ్మరంధ్రం** – శిరస్సున మస్తిష్కం పైని వుంటుంది.

**బ్రహ్మాంభస్సు** – గోమూత్రం.

## భ

**భక్తం** – అన్నం.

**భక్తచ్ఛదం** – ఆకలి.

**భక్తద్వేషం** – అరోచకవ్యాధి. అన్నద్వేషం.

**భగ్నాస్థిసంధానకరం** – వెల్లుల్లి.

**భద్రయోగదివసం** – పుష్యమీ నక్షత్రయుక్తమైన దినం.

**భద్రశ్రియం** – శ్వేతచందనం.

**భయానకం** – పులి.

**భయావహం** – రాత్రి.

**భర్జనం** – వేపుడు.

**భల్లాతకయూషం** – రసాయన ప్రకరణంలోని ఒక యూషం.

**భల్లాతకసర్పి** – నల్లజీడిగింజలు వేసి కాచిన నెయ్యి. రసాయనవిశేషం.

**భల్లాతకక్షీరం** – రసాయనవిశేషం.

**భషం** – కోడి.

**భస్మతూలం** – మంచు.

**భక్ష్యం** – అష్టవిధాన్నాలలో వొకటి.

**భాండరంజనమృత్తిక** – కుండమెరుగుమట్టి.

**భాండీ** – మంగలిపొది.

**భాతం** – ప్రభాతకాలం.

**భానుపల** – అరటిచెట్టు.

**భారం** – మానపరిభాష. రెండువేల పలాలు.

**భారవి** – తులసిచెట్టు.

**భావన** – ద్రవద్రవ్యాలతో ఔషధద్రవ్యం తరచు తడిపి, ఆరబెట్టడం. నూరడం కాదు. ద్రవ్యం అంతా ద్రవంతో కలిసిపోవాలి. పల్చగా అయిపోవాలి గాని, గట్టిగా వుంటే చాలదు.

**భిత్తిఖాతనం** – పెద్ద ఎలుక.

**భిషక్** – వైద్యుడు. ఆయుర్వేదీయ మతాను సారం చికిత్స చెయ్యడంలో నిపుణుడు. ఇతను పాదచతుష్టయంలో వాడు. ఇతనికిన్నీ నాలుగు యోగ్యత లుండాలి. అవి – దక్షత్వం. అంటే చికిత్సానైపుణ్యం. తీర్థాత్తశాస్త్రజ్ఞత – అంటే గురువు నాశ్రయించి చదువుకుని సంపాదించిన శాస్త్రజ్ఞానం. దృష్టకర్మ – అంటే గురువూ, వృద్ధ వైద్యులూ నిర్వహించే చికిత్సలు చూసి సంపాదించుకున్న అనుభవజ్ఞానం. శుచి – అంటే త్రికరణయా శుచిగా వుండేవాడు.

**భిషగ్జితం** – ఔషధం.

**భీమనాదం** – సింహం.

**భీమవిక్రాంతం** – ద్రాక్షామద్యం.

**భీషణం** – పావురం.

**భీష్మం** – అన్నం.

**భుక్తం** – భక్షణం, ఐక్షితమున్ను.

**భుక్తశేషం** – ఉచ్ఛిష్టం.

**భుక్తి** – ఉపభోగం.

**భుగ్నుడు** – రోగాదికంతో వంకరటింకర అయినవాడు.

**భుజగోపభోజి** – నెమలి.

**భుజాకంటం** – చేతిగోరు.

**భుజిష్యం** – రోగం.

**భూతగుణం** – శబ్దాదులు.

**భూతగ్రామం** – ప్రాణిసమూహం.

**భూతవిద్య** – ఆయుర్వేదీయాలైన యెని మిది తంత్రాలలో వొకటి. దేవగ్రహాలు, అసురగ్రహాలు, గంధర్వగ్రహాలు, యక్షగ్రహాలు, రక్షోగ్రహాలు, పిత్ృగ్రహాలు, పిశాచగ్రహాలు, శాకినీ గ్రహాలు, డాకినీ గ్రహాలు – మొదలైన గ్రహాలు ఆవేశించినప్పుడు చెయ్యవలసిన శాంతికర్మ. బలిహరణం మొదలైన ఉపశమనోపాయాలు వివరించే భాగం యిది. ఎవరిదగ్గిర అయినా వారికి అసహజాలైన జ్ఞాన విజ్ఞాన వాక్చేష్టా బలపౌరుషాలు కనపడ్డప్పుడు భూతావేశం జరిగినట్టు తెలుసుకోవాలి. ఈ గ్రహాలు 18 రకాలు. శుక్లపక్షంలో పాడ్యమి, త్రయోదశి – ఈ తిథులలో దేవగ్రహాలు ఆవహిస్తాయి. శుద్ధత్రయోదశి, కృష్ణచతుర్దశి – ఈ తిథులలో అసురగ్రహాలు, ద్వాదశి చతుర్దశులలో గంధర్వగ్రహాలు, పంచమినాడు నాగగ్రహాలు, శుద్ధసప్తమి, ఏకాదశులు కుబేరగ్రహాలు, శుక్ల పంచమి, అష్టమి, పౌర్ణమి, ఈ తిథులలో బ్రహ్మరాక్షసగ్రహాలు, కృష్ణనవమి ద్వాదశులు రక్షోగ్రహాలు, పిశాచగ్రహాలు, దర్శ అమావాస్య, అష్టమి నవములు పిత్ృగ్రహాలు, సాధారణంగా సంధ్యాకాలాలలో ఆవహిస్తాయి.

**భూతాత్మ** – శరీరం.

**భూతాది** – త్రివిధ అహంకారాలలో ఇదొకటి. ఇది తామసం.

**భూధరయంత్రం** – ఔషధ పాకాల కుపయోగించే యంత్రాలలో ఇదొకటి. రసపూర్ణమైన మూషకు సంబంధనంచేసి ఇసుకతో నిండిన బానకు మధ్యగా వుంచి ఇసుకమీద పిడకలు వేసి పుటం పెట్టాలి. ఇదే భూధరయంత్రం.

**భూమిలాభం** – మృత్యువు.

**భూమిలేపనం** – గోమయం.

**భూరిమాయు** – నక్క.

**భూస్వేదం** – స్వేదకర్మలలో ఇదొకటి. అశ్మ ఘనస్వేదానికి రాతిపలక వుండాలి. దీనికి చదునైన భూమి వుండాలి. ఇంతే భేదం. తక్కినదంతా అశ్మఘనస్వేదవిధిగానే జరిగించాలి. రాతిపలకమీద కాక, ఇది భూమిమీద జరిగించేది కనక, దీనికి భూస్వేదం అనిపేరు.

**భృంగవాంతం** – తేనె.

**భృష్టం** – వేయించినది.

**భృష్టతండులాన్నం** – వేయించిన బియ్యంతో వండిన అన్నం.

**భేడాచార్యుడు** – భేడసంహిత రచించిన ఆచార్యుడు.

**భేదనం** – ఇంగువ.

**భేదనకం** – జీలకర్ర.

**భేదనీయవర్గం** – తెగడ, జిల్లేడు, ఆముదపుచెట్టు, పొత్తిదుంప, దంతి, చిత్రమూలం, కానుగు, తెల్లదింటెన, కటుకరోహిణి, కంకుష్ఠమున్ను.

**భేదనౌషధం** – ప్రవాహంగావెళ్లే మలమూత్రాదులూ, మలాదులతో బంధించబడివుండే ఆహారపదార్థాలూ కూడా అధోభాగానికి చేర్చి బయటికి వెళ్ళించేది భేదనం. కటుకరోహిణి ఇత్యాదులు ఈ పని చేస్తాయి.

భేషజం – ఔషధం. ఇది రెండు రకాలు: ఆరోగ్యవంతునకు ఓజస్సు వృద్ధిచేసేవొకటి. వ్యాధిగ్రస్తునకు ఆరోగ్యం కలిగించేదింకొకటిన్ని.

భేషజాంగం – అనుపానం.

భైషజం – ఔషధం.

భోగం – సంపూర్ణాహారం.

భోగగృహం/భోగావాసం – వాసగృహం.

భోజనం – అన్నాదికం. వివరాలకు ఆహారం చూసుకునేది. భోజనం చేశాక నూరడుగు లయినా సంచరించాలి. తరవాత ఎడమ ప్రక్కగా పడుకోవాలి.

భోజనపాత్ర – భోజనం చేసే పాత్ర. బంగారం, వెండి – వీటితో చేయించుకోవాలి.

భోజనమాత్ర – మాత్ర అంటే పరిమాణం. ఇదే మోతాదు. దేనికయినా మోతాదు ఉండాలి. భోజనానికి తప్పకుండా వుండాలి. చతుర్విధాహారాలూ ఎంత మోతాదుగా తింటే సూర్యోదయం కాలానికి చక్కగా జీర్ణం అవుతాయో అదీ భోజనమాత్ర. ఇది జఠరాగ్ని బలం అనుసరించి వుంటుంది. ఎవరికివారికే ఇది ప్రత్యేకం. స్వయంగ్రాహ్యమున్ను. సామాన్యవిధి మాత్రం ఒకటి నిష్కర్షగా చెప్పవచ్చు. అన్నాశయం నాలుగు భాగాలు చేసుకునేది. రెండు భాగాలు ఘనపదార్థంతోనూ, ఒక భాగం ద్రవపదార్థంతోనూ నింపుకునేది. నాలుగో భాగం కాళీగా వుంచుకోవాలి. ఇది చక్కని భోజనమాత్ర.

భోజ్యం – అష్టవిధ అన్నాలలో వొకటి.

భోజ్యసంభవం – శరీరంలో వుండే రసధాతువు.

భౌమజలం – నేలమీది జలం. ఇది జాంగలమనీ, ఆనూపమనీ రెండు రకాలు.

భ్రమ – చక్రంమీదకూచుని గిరగిర తిరిగిపోతు న్నట్టనిపించే మనోవికారం.

భ్రమణం – పర్యటనం, తిరగడం.

భ్రమత్కుటి – గడ్డిగాదరలతో చేసిన గొడుగు.

భ్రమి – మూర్ఛ.

భ్రాంతి – భ్రమ.

భ్రాజకం – ఇదొక పిత్తం. ఇది చర్మంలో వుంటుంది. చర్మానికి నిగనిగ పుట్టిస్తుంది. అభ్యంగం మొదలైనవి దీనికి పోషకాలు.

భ్రామరం – తుమ్మెదలుకూర్చిన తేనె.

భ్రామితుడు – రోగి.

భ్రాష్టం – వేయించే పాత్ర.

భ్రూణం – గర్భస్థ పిండం.

## మ

మంగల్యం – పెరుగు, పుల్లని పెరుగు.

మంగళప్రద – పసుపు.

మండం – అన్నంవండి మెతుకులు తీసివేసిన గంజి.

మండయంతం – అన్నం.

మండయంతి – స్త్రీ.

మండలాగ్రం – ఆరంగుళాల పరిమితిగల ఒక శస్త్రవిశేషం.

మంథజం – నవనీతం, వెన్న.

మంథనం – కవ్వం.

మందోష్ణం – గోరువెచ్చన.

మకరందం – తేనె.

మక్కులం – శిలాజిత్తు.

మఘం – ఔషధం.

మఘోని – తూర్పుదిక్కు.

మజ్జకృత్తు – ఎముక.

మజ్జనం – మునిగి స్నానం చెయ్యడం.

మజ్జసముద్భవం – శుక్రం.

మజ్జారసం – శుక్రం.

మతివిభ్రంశం – మతివైపరీత్యం.

మతివిభ్రాంతి – ఉన్మాదం.

మత్కారణం – దేహం.

మత్తకాశిని – ఉత్తమస్త్రీ.

మత్తా – మద్యం.

మథితం – నీరుకలియని పెరుగు. వస్త్రగాలితం చేసినది.

మదకారి – తమోగుణ ప్రధానమై బుద్ధిలోపం కలిగించే మద్యం మొదలైనవి.

మదగమనం – మహిషం.

మదనకాకురవం – పావురం.

మదనపాఠకం – కోకిల.

మదనమృగం – కస్తూరిమృగం.

మదయిత్ను – మద్యం.

మదరాగం – కోడి.

మదస్థానం – కల్లుతాగే చోటు.

మదాంబరం – మత్తేభం.

మదారం – పంది.

మదాలాపి – కోకిల.

మదిర – మద్యసామాన్యం.

మదిష్ఠ – మద్యం.

మదోదగ్ర – స్త్రీ.

మద్యం – మత్తు కలిగించే ద్రవ్యం. గౌడి, మాధ్వి, పైష్టి అని యిది మూడు విధాలు. ఇవన్నీ పుల్లనివి. ఇవి అనేక విధాలుగా తయారుచేస్తారు. వీటి కంతులేదు.

మద్యనిత్యుడు – నిత్యమూ మద్యపానం చేసేవాడు.

మద్యమదం – కల్లు, సారాయి, బ్రాంది మొదలైనవి తాగడంవల్ల కలిగే మత్తు.

మద్యశ్రేష్ఠం/మద్యోత్తమం – ద్రాక్షాసుర.

మధు – తేనె, మాక్షికం, భ్రామరం, క్షౌద్రం, పౌత్తికం, ఛాత్రకం, అర్ఘ్యం, ఔద్దాలికం, దాలకం – అని యిది యెనిమిది రకాలు. అప్పటికప్పుడు తీసిన తేనె రసాయనం.

మధుకంఠం – కోకిల.

మధుకాశ్రయం – మైనం.

మధుకోదకం – యష్టిమధుకం వేసి కాచిన నీళ్లు.

మధుకోశం – తేనెపట్టు.

మధుగాయనం – కోకిల.

మధుఘోషం – కోకిల.

మధుతైలవస్తి – నిరూహవస్తి విశేషం.

మధుత్రయం – మూడు మధురద్రవ్యాలు. అవి నెయ్యి, తేనె, చక్కెర.

మధుమార్ద్వీకం – ఇప్పపువ్వుతో వండి తయారుచేసిన మద్యం.

మధురం – తీపి. షడ్రసాలలో ఇదొకటి. ఇది పరితోషం, తృప్తి, ఆహ్లాదం, ముఖావలేపం కలిగిస్తుంది. రసం, రక్తం, మాంసం, మేదస్సు, అస్థి – వీటిని వృద్ధిచేస్తుంది. స్నిగ్ధం, గురువు, శీతం, ధాతువర్ధనం. ఆయుర్బలవర్ణ కారి. కంఠ్యం. సంధానకారి. దీని విపాకమున్ను మధురమే. ఇది కేశవర్ధకం. కాని మిక్కిలిగా పుచ్చుకుంటే ప్రమేహం, జడత్వం కలిగిస్తుంది.

మధురగణం – ఇదే కాకోల్యాదిగణం. కాకోళి, క్షీరకాకోళి, జీవకం, ఋషభకం, ముద్గపర్ణి, మాషపర్ణి, మేద, మహామేద, గుడూచి, కర్కాటకశృంగి, తవాక్షీరి, పద్మకం, ప్రపౌండరీకం, ఋద్ధి, వృద్ధి, ద్రాక్ష జీవంతి, యష్టిమధుకమున్ను.

మధురజీవకాదివర్గం – జీవకం, ఋషభకం, మేద, మహామేద, ఋద్ధి, వృద్ధి, కాకోళి, క్షీరకాకోళి, మాషపర్ణి, ముద్గపర్ణి, జీవంతి, యష్టిమధుకమున్ను.

మధురజీవనీయం – జీవకం, ఋషభకం, మేద, మహామేద, కాకోళి, క్షీరకాకోళి, యష్టిమధుకం, జీవంతిన్ని.

మధురత్రయం – నెయ్యి, చక్కెర, తేనె.

మధురత్రిఫల – ద్రాక్ష పెగ్గుమ్మడు, ఖర్జూరమున్ను.

మధురస్కంధం – ఆరురకాల ఆస్థాపనలలో మధురవర్గీయ ద్రవ్యాలతో చేసిన ఆస్థాపనవిశేషం.

మధురాకరం – చెరుకు.

మధురాదిఫలత్రయం – ద్రాక్ష పెగ్గుమ్మడు, ఖర్జూరమున్ను.

మధురాలాప – గోరువంక.

మధురౌషధం – మధురగణం.

మధుశుక్తం – నిమ్మపళ్ళ రసం ఒక ప్రస్థం, తేనె ఒక కుడవం, పిప్పలి చూర్ణం ఒక పలం – ఇవి ఒక కుండలో కలిపి చీలయిచ్చి ఒక్క నెల దినాలు ధాన్యరాశిలో వుంచి, తీసి వడబోసుకునేది. మధుసూక్తమున్నూ ఇదే.

మధుశేషం – మైనం.

మధుసంధానం – మద్యం.

మధుసంభవం/మధుసిక్థకం – మైనం.

మధుసూదనం – తుమ్మెద.

మధుస్వరం – కోకిల.

మధూకపర్ణసాహస్రి – తులసిచెట్టు.

మధూచ్ఛిష్టం – మైనం.

మధ్యం – శమనధూమపానవిశేషం.

మధ్యందినం – మధ్యాహ్నం.

మధ్యపంచమూలకం – బల, గలిజేరు, ఆముదపుచెట్టు, శాలిపర్ణి, పృశ్నిపర్ణి.

మధ్యపాకం – తైలాదులు వండేటప్పుడు రావలసిన పాకం యిది. ఇది నాతిమృదువు. ఖరం కానిదిన్ని.

మధ్యమరోగాలు – రాజయక్ష్మ, పక్షవధ, అర్ది తవాతం, శిరోరోగాలు, సంధిశూల, అస్థిశూల, త్రికశూల ఇత్యాది రోగాలు. ఇవి శిరస్సు,

హృదయం, వస్తి, మర్మలు, అస్థిసంధులు, సిరలు, స్నాయువులు, కండరాలు, ధమనులు – వీటిలో వుంటాయి.

మధ్విజ – మద్యం.

మనోదోషాలు – రజోగుణం, తమోగుణమున్ను.

మనోరథం – ఇచ్ఛ.

మనోవిభ్రమం – చిత్తవిభ్రమం.

మన్మనం – గద్గదధ్వని.

మయూరచటకం – కోడి.

మయూరటభావన – నాలుగు పలాల రసంతో చేసే భావన.

మయూరాలాసకం – వర్షాకాలం.

మయూరాక్షేపియంత్రం – మద్యం తయారుచేసే ఒక యంత్రం.

మరకతం – అయిదు రకాల మహారత్నాలలో ఒకటి.

మరణం – శరీరప్రాణ వియోగం.

మరణం – వసనాభి.

మరీచి – మానపరిభాష. ఆరు వంశీల మొత్తం.

మరీచిక – ఎండమావులు.

మరుద్వాహం – పొగ.

మరుద్వీపం – లొట్టిపిట్ట.

మరుభూమి – నిర్జలభూమి.

మర్కటాస్యం – రాగి.

మర్దనం – రససంస్కారాలలో ఒకటి.

మర్దనం – శరీరం పట్టించుకోవడం.

మర్దనకం – మూనె.

మర్మచ్ఛేదం – మర్మవ్యధనం.

మర్మస్థానం – జీవస్థానం. ఈ ప్రదేశాన దెబ్బతగిలితే ప్రాణం పోతుంది. ఇలాంటి స్థానాలు శరీరంలో చాలా వున్నాయి. భ్రూమధ్యం, కంఠం, గళం, శంఖం, కటికం, పృష్ఠం, గ్రీవం, గుదం, అండం, పదయుగం, పాణియుగం, అస్థిసంధులు – ఇత్యాదులు.

మర్మలు – శరీరంలో మాంసం, సిరలు, స్నాయువులు, అస్థులు, సంధులు – వీటికి పరస్పరం సంబంధం కలిగించేవి మర్మలు. అవి మాంసమర్మలు సిరామర్మలు, స్నాయు మర్మలు, అస్థిమర్మలు, సంధిమర్మలు అని అయిదు విధాలు. మర్మల మొత్తం సంఖ్య 107. వీటిలో ప్రాణాలు సంచరిస్తూ వుంటాయి.

మర్మాస్థిసంధులు – రోగమార్గాలు మూడింటిలో ఇవి ఒకటి. వస్తి, హృదయం, శిరస్సు మొదలైనవి మర్మలు. కీళ్ళు, స్నాయువులు, కండరాలున్ను అస్థిసంధులు. ఆ మర్మలూ, యీ అస్థిసంధులూ కలిసి రోగాలకు రెండో మార్గం.

మర్యాద – హద్దు.

మర్శప్రతిమర్శనస్యాలు – ఇవి చమురుతో చేసే నశ్యకర్మలు. అయితే చమురు ప్రమాణంలో వుండే భేదంవల్ల మర్శం అనీ, ప్రతిమర్శనం అనీ ఇది రెండు విధాలు.

మలపాకం – దోషపాకం.

మలప్రవర్తినీవర్తి – గుదస్థానంలో నెయ్యి పూసి, అందులో ఎక్కించే వర్తి. ఇది బొటనవేలు లావున వుంటుంది. దీనితో విరేచనం అవుతుంది.

మలరోధనం – మలబంధం.

మలవేగం – అతిసారం.

మలాయనం – మలద్వారం.

మలిష్ఠ – ఋతుమతి అయి వుండిన స్త్రీ.

మస్తకస్నేహం – మస్తిష్కం.

మస్తు – తక్రం చూరు.

మహత్తత్వం – బుద్ధితత్వం.

మహత్తు – ఇది సత్వరజస్తమోగుణాత్మకం. అవ్యక్తంవల్ల పుట్టినది. బుద్ధితత్వ మనిన్నీ దీనికి పేరు.

మహత్తు – శరీరాధారకాలైన పది ధమనులు ఇక్కడ కలిసివున్నాయి.

మహాకపిత్థం – మారేడు చెట్టు.

మహాకషాయాలు – ఇవియాభై. వివరాలు: 1. జీవనీయం – ప్రాణధారణ కుపకరించేది. 2. బృంహణీయం – శరీరానికి బలమూ పుష్టీ కలిగించేది. 3. లేఖనీయం – శరీరం కృశింపజేసేది. 4. భేదనీయం – గట్టిపడిన మలాదులు భేదించేది. 5. సంధానీయం – విరిగిన యెముకలు అతికించేది. 6. దీపనీయం – జఠరాగ్ని పెంచి ఆకలి వృద్ధిచేసేది. 7. బల్యం – బలకరం. 8. వర్ణ్యం – శరీరానికి వర్చస్సు కలిగించేది. 9. కంఠ్యం – కంఠానికి మంచిది. 10. హృద్యం – హృదయానికి మేలు చేస్తుంది. 11. తృప్తిఘ్నం – కఫం పెరిగితే అప్పుడు భోజనం చేసినట్టెప్పుడూ తృప్తిగా వుంటుంది. క్రమంగా అది వ్యాధిగా

పరిణమిస్తుంది. ఈ కషాయం అలాంటి కఫం కరిగించేసి బుభుక్ష కలిగిస్తుంది. 12. అర్శోఘ్నం – మూలశంక పోగొట్టేది. 13. కుష్ఠఘ్నం – కుష్ఠువ్యాధి పోగొడుతుంది. 14. కండూఘ్నం – దురదలు పోగొట్టేది. 15. క్రిమిఘ్నం – క్రిములు హరించేది. 16. విషఘ్నం – విషాలు విరిచేసేది. 17. స్తన్యజననం – బిడ్డల తల్లులకు చనుబాలు వృద్ధిచేసేది. 18. స్తన్యశోధనం – చనుబాలలో వుండే సకల దోషాలూ హరించేది. 19. శుక్రజననం – పురుషులకు శుక్రం వృద్ధిచేసేది. 20. శుక్రశోధనం – శుక్రంలో వుండే సకల దోషాలూ హరించేది. 21. స్నేహోపగం – ఘృతాదిస్నేహ ద్రవ్యాలలో కలిసి స్నేహక్రియ కుపయోగించేది. 22. స్వేదోపగం – స్వేదకర్మ కనుకూలించేది. 23. వమనోపగం – వమనకర్మ కుపయోగించేది. 24. విరేచనోపగం – విరేచనకర్మ కుపయోగించేది. 25. ఆస్థాపనోపగం – ఆస్థాపనవస్తి కుపయోగపడేది. 26. అనువాసనోపగం – అనువాసనవస్తి కుపకరించేది. 27. శిరోవిరేచనోపగం – శిరోవిరేచనకర్మ కుపయోగించేది. 28. ఛర్ది నిగ్రహణం. వాంతులు నిలిపేది. 29. తృష్ణానిగ్రహం – దప్పిక తగ్గించేది. 30. హిక్కానిగ్రహం – ఎక్కిళ్ళు కట్టేది. 31. పురీష సంగ్రహణీయం – మలబంధం కలిగించేది. 32. పురీషవిరజనీయం – పురీషదోషాలు తగ్గించేది. 33. మూత్రసంగ్రహణీయం – అతిమూత్రం కట్టేది. 34. మూత్రవిరజనీయం – మూత్రదోషాలు తగ్గించేది. 35. మూత్రవిరేచనీయం – మూత్రం ధారాళంగా జారీ అయేటట్టు చేసేది. 36. కాసహరం – దగ్గు తగ్గించేది. 37. శ్వాసహరం – శ్వాస హరించేది. 38. శోథహరం – ఉబ్బు తగ్గించేది. 39. జ్వరహరం – జ్వరం కట్టేది. 40. శ్రమహరం – శ్రమ తగ్గించేది. 41. దాహప్రశమనం – మంటలూ, తాపమూ పోగొట్టేది. 42. శీతప్రశమనం – చలి తగ్గించేది. 43. ఉదర్దప్రశమనం – ఉదర్దవ్యాధి పోగొట్టేది. 44. అంగమర్ద ప్రశమనం – శరీరంలో కలిగే రకరకాల నొప్పులు హరించేది. 45. శూలప్రశమనం – శూలరోగం హరించేది. 46. శోణితస్థాపనం – చెడ్డరక్తం పోగొట్టి శుద్ధరక్తం పుట్టించేది. 47. వేదనాస్థాపనం – శరీరంలో ఏ భాగాన అయినా వేదన సంభవిస్తే అది తగ్గించేది. 48. సంజ్ఞాస్థాపనం – స్మృతి, జ్ఞానమూ మంచిస్థితిలో వుంచేది. 49. ప్రజాస్థాపనం – స్త్రీ పురుషుల శుక్రార్తవ దోషాలన్నీ పోగొట్టి సంతానం కలిగించి నిలిపేది. 50. వయస్థాపనం – ముదిమి రాకుండా నిలిపేది. శరీరదార్ఢ్యమున్ను నిలిపేది. వీటిలో ప్రతీదాన్లోనూ పదేసి ద్రవ్యాలు పడతాయి.

**మహాకాంత** – పృధివి.

**మహాగ్రీవం** – లొట్టిపిట్ట.

**మహాఘృతం** – నూటపదకొండు సంవత్సరాలనాటి నెయ్యి.

**మహాచ్ఛాయం** – మర్రిచెట్టు.

**మహాతేజం** – పాదరసం.

**మహాత్రిఫల** – కరకతాడి, ఉసిరికలు.

**మహాద్రుమం** – రావిచెట్టు.

**మహాధనం** – బంగారం.

**మహానసం** – వంటిల్లు, ఔషధాలు వండే యిల్లు.

**మహానసాధ్యక్షుడు** – వంటవాళ్ళమీది అధికారి.

**మహానసికవోఢ** – రాజుగారి పాకశాల అధికారి.

**మహానాదం** – శంఖం.

**మహానిద్ర** – మరణం.

**మహానేమి** – కాకి.

**మహాపంచమూలం** – మారేడు, నెల్లి, శ్యోనాకం, పాటల, గణికారిక.

**మహాపంచవిషం** – శృంగివిషం, కాలకూటవిషం, ముస్తకవిషం, వత్సనాభివిషం, సక్తుకవిషమున్ను.

**మహాపుటం** – ఔషధాలవంటలో ఇదొకరకం. నాలుగుమూరల వెడల్పు, పొడుగు, లోతున్నగల గోతిలో వెయ్యిపిడకలతో వేసే పుటం.

**మహాభూతాలు** – జగత్తుకంతకీ కారణాలైన మహాభూతాలు అయిదు అవి – పృథివి, జలం, తేజస్సు, వాయువు, ఆకాశమున్ను.

**మహామాంసం** – నరాదిమాంసం.

**మహామృగాలు** – పంది, ఎనుబోతు, జింకపోతు, నల్లని చారలు, తెల్లని మచ్చలున్నగల దుప్పి, రోహితం, ఏనుగు, పెద్ద చమరీ మృగం, చమరీమృగం, ఖడ్గమృగం, గవయం – ఇత్యాదులు.

**మహారత్నం** – మౌక్తిక, హీరక, వైడూర్య, పద్మరాగ, గోమేదిక, పుష్యరాగ, మరకత, ప్రవాళ, నీలాలు.

**మహారవం** – కప్ప.

**మహారసం** – కాంజికం.

**మహారసాలు** – పాదరసం, అభ్రకం, ఇంగిలీకం, వైక్రాంతం, స్వర్ణమాక్షికం, తారమాక్షికం, శంఖం, కాంతలోహమున్ను.

**మహార్ద్రం** – సొంటి.

**మహాలోభం** – కాకి.

**మహావిలం** – అంతఃకరణం.

**మహావిషాలు** – శృంగి, కాలకూటం, ముస్తకం, వత్సనాభం, సక్తుకమున్ను.

**మహావిహంగం** – గరుడపక్షి .

**మహాసుఖం** – మైథునం.

**మహాసుగంధం** – కుంకుమపువ్వు, అగురుచెక్క, పచ్చకర్పూరం, కస్తూరి, చందనమున్ను.

**మహాసూక్ష్మ** – ఇసుక.

**మహాస్నానీయపంచవిధకషాయద్రవ్యాలు** – నేరేడు, బూరుగు, జల, పొగడ, రేగున్ను.

**మహాస్నేహం** – చమురు దినుసులన్నింటిలోనూ నెయ్యి, నువ్వుల నూనె, వస, మజ్జ – ఇవి చాలా మంచివి. అంచేతనే వీటికి మహాస్నేహాలని పేరు.

**మహాద్రవం** – ధూళి.

**మహౌషధం** – సొంటి.

**మక్షికామలం** – మైనం.

**మక్షికావాంతం** – తేనె.

**మాణవకుడు** – ఏడేళ్ళ పిల్లవాడు.

**మాతృగుణాలు** – శిశువులకు తల్లిగుణాలు కొన్ని సంభవిస్తాయి. అవి – మాంసం, రక్తం, మేదస్సు, మజ్జ, హృదయం, నాభి, యకృత్తు, ప్లీహ, అంత్రాలు, గుదం – ఇత్యాది మృదుపదార్థాలు.

**మాత్ర** – అంటే పరిమాణం. మోతాదు. ఆహార విహారాల కిది మిక్కిలీ జాగ్రత్తగా చూసుకోవాలి. లేకపోతే ఆరోగ్యం చెడుతుంది. ఔషధం విషయంలో యిది మరీ ముఖ్యం. కొద్దిపాటి నీళ్ళతో దావాగ్నివంటిదాన్ని ఆర్పలేము. అలాగే ఔషధమాత్ర తక్కువయితే వ్యాధి కుదరదు. నీరెక్కువయితే సస్యం చెడిపోతుంది. అలాగ ఔషధమాత్ర ఎక్కువ అయినా రోగికి అపాయమే. ఈమోతాదు నిర్ణయించడంలో కూడా వైద్యునకు మిక్కిలీ ప్రజ్ఞ వుండాలి. ఔషధమాత్ర ముఖ్యంగా వయస్సు, బలం, అవస్థ – వీటినిబట్టి నిర్ణయం కావాలి. ఆహారం విషయమై యిది సర్వగ్రహరూప మాత్ర, పరిగ్రహరూప మాత్ర అని రెండు విధాలు.

**మాత్రకాలం** – పురుషుడు తన చేతిని తన మోకాలి చుట్టూ ఒక్క మాటు తిప్పడానికి పట్టేకాలం. ఇది రెప్పపాటులో జరిగిపోతుంది.

**మాత్రావస్తి** – హ్రస్వమాత్రతో – ఒకటిన్నర పలాల పరిమాణంగల స్నేహంతో చేసే వస్తి.

**మాధుతైలికవస్తి** – ఆముదపు వేళ్ళ కషాయం ఎనిమిది పలాలు, తేనె నాలుగు పలాలు, నూనె నాలుగు పలాలు, సదాప అరపలం, సైంధవలవణం అరపలం – ఇవన్నీ కలిపి కవ్వంతో చిలికి వస్తిక ప్రయోగం చేసేది. ఇది మాధుతైలికవస్తి.

**మానం** – పరిమాణం. ఔషధాలు చెయ్యడానికీ వాడడానికీ కూడా మానం మిక్కిలీ అగత్యం. ఇది కాళింగ అనీ, మాగధం అనీ రెండు విధాలు. వీటిలో మాగధం శ్రేష్ఠం.

**మానకం** – మానపరిభాష. ఒక శరావం.

**మానభాండం** – కొలపాత్ర.

**మానవకోత్తముడు** – శిశువు.

**మానసిక రోగాలు** – కామక్రోధాదులూ, వాటివల్ల కలిగినవిన్ని.

**మానికం** – మానపరిభాష. ఎనిమిది పలాలు.

**మానుషి** – మూడు రకాల చికిత్సలలో ఇదొకటి. ఓషధులలో (షడ్రసాలతో) చేసేది మానుషి. కలియుగంలో ఇదే ఉత్తమం.

**మాయువు** – చేదుకట్టు.

**మారకవర్గం** – పాదరసం మర్దించే ద్రవ్యాల వర్గం.

**మారజాతకం** – పిల్లి.

**మారణం** – ధాతువులను మృతిపొందించడం. అంటే భస్మం చెయ్యడం.

**మారారినారీరజస్సు** – గంధకం.

**మార్గవిశోధనం** – మూత్రపురీషాలు బంధించివున్నప్పుడు తన్మార్గాలు శోధించడం.

**మార్జనం** – కడగడం. తుడవడమున్ను.

**మార్జారకంఠం** – నెమలి.

**మార్జారిక** – కస్తూరి.

**మార్త్తికం** – మృణ్మయం.
**మార్ద్వీకం** – ద్రాక్షామద్యం.
**మార్ష్టి** – తైలమర్దనం.
**మాలతీజాతం** – వెలిగారం.
**మతంగమం** – ఏనుగు.
**మితాశనం** – పరిమితాహారం.
**మిత్రపంచకం** – నెయ్యి, తేనె, గురివిందగింజ, వెలిగారం, గుగ్గిలమున్ను.
**మిథ్యాచారం** – శాస్త్రోక్తమైన మార్గం విడిచి సంచరించడం.
**మిథ్యామతి** – భ్రమ.
**మిథ్యాయుక్తం** – అశాస్త్రీయంగా ప్రయోగించినది.
**మిథ్యాయోగం** – రూపాదుల విరుద్ధయోగం. వేగధారణాధికం శారీరమిథ్యాయోగం. పరుషవచానాదికం వాఙ్మిథ్యాయోగం. దుర్గంధాఘ్రాదికం ఘ్రాణమిథ్యాయోగం. ఉరుము మొదలైనవి అతిగా వినడం శబ్దమిథ్యాయోగం – ఇత్యాదులు. రోగకారణాలు మూడింటిలో ఇదొకటి.
**మిథ్యావిహారం** – బలవంతులతో విరోధం ఇత్యాది.
**మిథ్యాహారం** – అనుచితాహారం. సాత్మ్యవిపరీతమైన ఆహారం.
**మిథ్యాపచారం** – ఎదురుగాలిలో తిరగడంవంటి అనుచిత ప్రవర్తన.
**మిష్టం** – మధురసం.
**మిష్టరసం** – మధురపాకరసవద్ద్రవ్యం.
**మిష్టాన్నం** – పరమాన్నం ఇత్యాది మధురాన్నం.
**మీరం** – పానీయం.
**మీలనం** – కళ్ళు మూసుకోవడం.
**ముండనం** – తల గొరిగించడం.
**ముకుళం** – కొద్దిగా వికసించిన పూమొగ్గ.
**ముక్తచండ** – చింతచెట్టు.
**ముక్తచక్షువు** – సింహం.
**ముక్తసారం** – అరటిచెట్టు.
**ముఖచీరం** – నాలుక.
**ముఖజం** – దంతం.
**ముఖదూషి** – వెల్లుల్లి.
**ముఖధావనం** – ముఖప్రక్షాళనం.
**ముఖపూరణం** – గండూషం.
**ముఖప్రక్షాళనం** – చన్నీళ్ళతో మొగం కడుక్కోడం.
**ముఖభూషణం** – తాంబూలం.
**ముఖలాంగలం** – పంది.
**ముఖవల్లభం** – దానిమ్మచెట్టు.
**ముఖస్రావం** – చొంగ.
**ముఖాస్త్రం** – పీత.
**ముఖ్యధాతువు** – బంగారం.
**ముఖ్యలవణం** – సైంధవలవణం.
**ముద్గభుక్కు** – గుర్రం.
**ముద్గమోదకం** – పక్వాన్నాలలో ఒకరకం.
**ముద్రణి** – లక్క.
**ముద్రిక** – ఛేదనభేదనాల కుపయోగించే పదంగులాల శస్త్రం.
**మునిధాన్యం** – నీవారధాన్యం.
**మునిపిత్తలం** – రాగి.
**మునిభేషజం** – కరక్కాయ.
**మునిభోజనం** – చాములు.
**మునిశస్త్రం** – శ్వేతదర్భ.
**ముమూర్ష** – మరణేచ్ఛ.
**ముమూర్షువు** – మరణోన్ముఖుడు.
**మురజఫలం** – పనసపండు.
**మూర్భిణి** – కుంపటి.
**ముష్కకాదివర్గం** – ముష్కకస్నుగ్వరా ద్వీపి పలాశ ధృవ శింశపాలు.
**ముష్టం** – మర్దించబడ్డది.
**ముష్టింధయుడు** – బాలుడు.
**ముస్తద్వయం** – నాగరముస్త, కైవర్తముస్త.
**ముస్తాదిగణం** – తుంగముస్తలు, పర్పాటకం, వట్టివేరు, దేవదారు, సొంటి, కరకతాడి ఉసిరకలు, దూలగొండి, నీలిక, కంపిల్లకం, తెగడ, నేలవేము, పాఠ, బల, కటుకరోహిణి, యష్టిమధుకం, పిప్పలిమోడిన్ని.

**మతాంతరం:** ముస్తలు, పసుపు, మానుపసుపు, కరకతాడి ఉసిరికలు, చెంగల్వకోష్ఠు, హైమవతి, వస, పాఠ, కటుకరోహిణి, శార్ఙ్గష్ట, అతివస, ద్రావిడి, జీడిగింజ, చిత్రమూలమున్ను.

**ముహూర్ముహూవు** – ఔషధం పుచ్చుకోవలసిన కాలాలలో ఇదొకటి. అంటే, చాలామాట్లు ఔషధం పుచ్చుకోడం.

ముహూర్తం – రెండు గడియల కాలం.

మూఢం – మూర్ఖ.

మూఢపరిషత్తు – పరిషత్తులలో ఇదొక రకం. మూఢులంతా చేరి తీర్చిన సభ. అక్కడ పట్టుదలలే ప్రధానంగా వుంటాయి. కనక, తరచు అధర్మమే అక్కడ జయం పొందుతూ వుంటుంది. ధర్మం నెగ్గడమున్నూ వుంటుంది; కాని అరుదు.

మూత్రం – ఆహారం యొక్క సారహీన మలద్రవ్యం.

మూత్రదశకం – పదిరకాల మూత్రాలు. ఏనుగు, మేషం, లొట్టిపిట్ట, ఆవు, మేక, మహిషం, గుర్రం. గాడిద, నరమూత్రాలు.

మూత్రపంచకం – అయిదు రకాల మూత్రాలు. ఆవు, మేక, మేషం, మహిషం, గాడిద – వీటి మూత్రాలు.

మూత్రపరీక్ష – మూత్రం రంగునుబట్టే వాతాది దోషాలను నిర్ణయించే ఉపాయం. వాతాధిక్యంలో మూత్రం పాండురంగా వుంటుంది. పిత్తాధిక్యంలో ఎర్రగానూ, నల్లగానూ (మిశ్రమం) – వుంటుంది. కఫాధిక్యంలో తెల్లగానూ, నురగతోనూ వుంటుంది.

మూత్రపుటం – అంటే వస్తి. మూత్రపుతిత్తి.

మూత్రలం – మూత్రకారి.

మూత్రవర్గం – మూత్రదశకం. లేక – గొర్రె, మేక, ఆవు, ఎనుము, ఏనుగు, ఒంటె, గుర్రం, గాడిద – వీటిమూత్రం. దీనికి మూత్రాష్టకమనిన్నీ పేరు.

మూత్రవహనాడి – ఆమాశయం నుంచి వస్తిలోకి మూత్రం తీసుకువెళ్ళే నాడి.

మూత్రవిరజనీయవర్గం – తామరపువ్వు, నల్లకలువ, నల్లతామరపువ్వు, తెల్లకలువ, సౌగంధికం, తెల్లతామర, నూరురేకుల తామరపువ్వు, యష్టిమధుకం, ప్రేంకణం, ఆరెపువ్వున్నూ.

మూత్రవిరేచనీయవర్గం – బదనిక, పల్లేరు, అవిసి, పొద్దుతిరుగుడుచెట్టు, కొండపిండి వేళ్ళు, దర్భ, కుశ, రెల్లు, కిక్కిసగడ్డి, కామంచికసవున్నూ.

మూత్రసంగ్రహణీయవర్గం – నేరేడు, మామిడి, జువ్వి, మర్రి, కొండమామిడి, మేడి, రావి – వీటి పట్టలు, జీడిగింజలు, చంద్ర, ఆరెపువ్వున్నూ.

మూత్రాష్టకం – ఎనిమిదిరకాల మూత్రాలు. ఆవు, మేక, గొర్రె, మహిషం, గుర్రం, గాడిద, లొట్టిపిట్ట, ఏనుగు – వీటిమూత్రాలు.

మూర్ఛ – సకలవిధాలా జ్ఞానం నశించడం.

మూర్ఛనం – రససంస్కారాలలో వొకటి.

మూర్తి – శరీరం.

మూర్ధకర్ణి – గొడుగు.

మూర్ధపుష్పం – దిరిసెనచెట్టు.

మూర్ధవేష్టనం – తలపాగా.

మూలత్వక్సారాలు – వేరుపట్ట వాడవలసిన ద్రవ్యాలు. తెగడ, రాస్న. చిత్రమూలం, నీల.

మూలప్రకృతి – దీనికే అవ్యక్తం అని పేరు. ఇది సర్వభూతోత్పత్తిక కారణం. దీనికి మాత్రం కారణం లేదు. సత్వరజస్తమోగుణాత్మకం. 1. అవ్యక్తం, 2. మహత్తు, 3. అహంకారం, 4. పృథివి, 5. అప్పు, 6. తేజస్సు, 7. వాయువు, 8. ఆకాశం అని యివి యెనిమిది విధాలు. స్థావరజంగమాత్మక సకల ప్రపంచోత్పత్తికిన్నీ ఇది హేతువు.

మూలవిరేచనం – విరేచనకరాలైన తెగడ మొదలైనవాటి వేళ్ళు. ఇవి – సప్తల, శంఖిని, దంతి, ద్రవంతి, గిరికర్ణిక, తెగడ, శ్యామ, ఉదకర్యా, ప్రకర్య, క్షీరిణి, ఛగలాండి, గవాక్షి మసూరవిదల.

మూలవిషం – స్థావరవిషాశ్రయాలైన కరవీరం మొదలైనవి.

మూలసారాలు – ములక, చిన్నములక, ముయ్యాకుపొన్న, కోలపొన్న, బల, అతిబల, నాగబల, మహాబల, రాజబల, వాయింట, చిర్రి, నీరుగొబ్బి, ఉప్పి, తెల్లగలిజేరు, ఎర్రగలిజేరు, సదాప, కురువేరు, వట్టివేరు, దూలగొండి, ఆదొండ, పొద్దుతిరుగుడు, చిరుబొద్ది, గోరింట, తెగడ – వీటి వేళ్ళే వాడాలి.

మూలిని – మూలాలు (వేళ్ళు) వాడవలసినది మూలిని. వీటిలో యీ కింద చెప్పేవి మిక్కిలీ ప్రశస్తాలు. కొండాముదపుచెట్టు, వస, నల్లతెగడ, తెల్లతెగడ, వృద్ధదారు, సంబరేణు, తెల్లదింటెన, నల్లదింటెన, చేదుపుచ్చ, మాల్కంగిని, దొండ, శణపుష్పి, విషాణిక (పిన్నపాల), వాయింట, ద్రవంతి (ఎలుకచెవి ఆకు), పాలచెట్టున్నూ. వీటిలో శణపుష్పి, దొండ, వస – ఇవి వమనకర్మకు ప్రశస్తాలు. తెల్లతెగడ, మాల్కంగిని – ఇవి శిరోవిరేచనకరాలు. తక్కిన పదకొండున్నూ విరేచనకర్మకు మిక్కిలీ ప్రశస్తాలు.

**మూషి** – లోహాలు కరిగించడానికుపయోగించే పాత్ర. శరావసంపుటమున్న.

**మూషకద్వయం** – హ్రస్వదీర్ఘమూషాకర్ణీ ద్వయం.

**మృగఘర్మజం** – జవ్వాజి.

**మృగాలు** – హరిణం (ఇర్రి), ఏణం (నల్లనియిర్రి), కురంగం (లేడి), ఋక్షం (ఎలుగుగొడ్డు), గోకర్ణం (కణుసు), మృగమాతృకం (జింక), శశం (కుందేలు), శంబరం (ఎర్రజింక), చారుష్కం, శరభం, కాలపుచ్ఛం, పొడలయిర్రి మొదలైనవి.

**మృగదంశకం** – కుక్క.

**మృగధూర్తకం** – నక్క.

**మృగనాభి** – కస్తూరి.

మృగయువు – నక్క.

**మృగాంకం** – పచ్చకర్పూరం.

**మృగాంతకం** – చిరుతపులి.

**మృగారాతి** – కుక్క.

**మృగేంద్రకుటిలోద్భూతం** – సింహం కాటులో వున్న విషం.

**మృతకాంతకం/మృతమత్తం** – నక్క.

**మృతవత్స** – బిడ్డలు బతకని తల్లి.

**మృత్కాంస్యం** – మూకుడు.

**మృత్యు** – పెద్దపులి.

**మృత్యునాశకం** – పాదరసం.

**మృత్యుభృత్యం** – రోగం.

**మృత్యువు** – ప్రాణికి 101 మృత్యువులు ఎల్లప్పుడూ సన్నిహితాలై వుంటాయి. వాటిలో వొకటే కాలమృత్యువు. ఇది తప్పించడం ఎవరికీ సాధ్యం కాదు. తక్కినవి అకాలమృత్యువులు. ఇవి ఔషధాదులవల్ల తొలగిపోతాయి. సమర్థుడైన వైద్యుడు లభించాలి – అంతే.

**మృదంగఫలం** – మద్దెలవంటి పళ్ళు గలది. పనసచెట్టు

**మృదుకర్మ** – గట్టిదానిని మెత్తబరచడం.

**మృదుకోష్ఠం** – స్వల్ప ఔషధంతో విరేచనం అయ్యే మలబంధవ్యాధి.

**మృదుగమన** – ఏనుగు.

**మృదుపుష్పం** – దిరిసెనచెట్టు.

**మృదులోమకం** – కుందేలు.

**మృష్టం** – ఆస్వాదించతగ్గది.

**మేఘకఫం** – వడగళ్ళు.

**మేఘనాదానులాసకం** – ఉరుము విని నృత్యం చేసే నెమలి.

**మేఘప్రసవం** – నీరు.

**మేఘభూతి** – వజ్రం.

**మేఘాస్థి** – వడగళ్ళు.

**మేచకాంజనం** – కృష్ణాంజనం.

**మేదస్సారం** – మేదస్సు ఎక్కువగా గలవారికి ఐశ్వర్యమూ సుఖోపభోగాలూ అధికంగా వుంటాయి.

**మేదస్సు** – శరీరంలో వుండే చతుర్థధాతువు. ఇదే మాంససారం.

**మేదాద్వయం** – మేద, మహామేద.

**మేధ** – ధారణశక్తి.

**మేధావి** – మద్యం.

**మేధ్యం** – మేధస్సు (మేధాశక్తి) వృద్ధిచేసేది.

**మేరుపాదజం** – వెండి.

**మేహఘ్ని** – పసుపు.

**మైత్రం** – మలమూత్రాలు విడిచిపెట్టడం.

**మైత్రకర్మ** – మలమూత్రనిరోధం పోగొట్టే చికిత్స.

**మైత్రి** – మిత్రత. సకలప్రాణులయెడలా ఆత్మవద్భావం.

**మైరేయం** – ఇదొక మద్యం. ఆరెపువ్వు, బెల్లం, బియ్యం మొదలైనవాటితో తయారుచేసేది.

**మోదం** – సువాసన.

**మోహం** – విపరీతజ్ఞానం.

**మౌహూర్తికుడు** – జ్యోతిశ్శాస్త్రవేత్త.

**మ్రక్షణం** – నూనె, నెయ్యి – వీటితో తలంటుకోడం.

**మ్లేచ్ఛముఖం** – రాగి.

## య

**యజ్ఞపశువు** – గుర్రం.

**యజ్ఞభూషణం** – తెల్లదర్భ.

**యజ్ఞసూత్రం** – యజ్ఞోపవీతం.

**యతి** – అవిసెచెట్టు.

**యథేష్టచారి** – స్వేచ్ఛాసంచారి. నీతినియమాలు లేనివాడు.

**యంత్రం** – శల్యాలు తీయడానికి ఉపయోగించే స్వస్తికాదికం. ఇది నూటొక్కరకాలు.

యమం – ఇంద్రియ నిగ్రహం.

యమకం – యుగ్మం. నెయ్యి, నూనె.

యమకస్నేహం – నెయ్యి. మజ్జ (మూలుగు), వస (కొవ్వు) తైలం – ఈ చమురు దినుసులలో ఏ రెండయినా కలిస్తే యమక స్నేహం అనిపించుకుంటుంది.

యమచించ – మిక్కిలీ పులుపుగల చింతపండు.

యమదూతకం – కాకి.

యమదూతిక – చింతచెట్టు.

యమానీద్వయం – వాము, అడవివామున్ను.

యవనప్రియం/యవనభోజనం – మిరియాలు.

యవమండం – యవలతో చేసిన మండం. వాట్యమండం అనిన్నీ దీనికిపేరు.

యవాగువు – చాలా మెతుకులతో వున్న గంజి.

యశోదం – పాదరసం.

యష్టికాభ్రామణం – నీరు చల్లపరిచే ఉపాయం.

యక్షకర్దమం – ఇది ఒక సుగంధానులేపనం. సమభాగాలుగా పచ్చకర్పూరం, అగురు, కస్తూరి, కక్కోలం – వీటితో తయారుచేసేది. దీనికి మహాసుగంధం అనిన్నీ పేరు.

యక్షావాసం – మర్రిచెట్టు.

యక్ష్మఘ్ని – ద్రాక్షపండు.

యాతన – అతితీవ్రమైన వేదన.

యాతయాముడు – వృద్ధుడు.

యాపనవస్తి – నిరూహవస్తిభేదం. తేనె, నెయ్యి, పాలు, నూనె – ఇవి ఒక్కొక్కటి రెండేసి పలాలు. బోడతరం, సైంధవలవణం – ఇవి ఒక్కొక్కటి ఒక్కొక్క కర్షం. వీటితో చేసేది యిది. ఇది ఉత్తర వస్తికి సంబంధించినది. దీపనవస్తి అనిన్నీ దీనికి పేరు.

యాప్యం – కష్టసాధ్యవ్యాధి. ప్రాణహాని చెయ్యదు. కాని బతికివుండినంతకాలమూ పీడిస్తూనే వుంటుంది.

యాభం – మైథునం.

యామం – దినంలో ఎనిమిదోవంతు కాలం.

యామఘోషం/యామనాది – కోడి.

యామ్యం – చందనం.

యామ్య – రాత్రి.

యుక్తరథం – నిరూహవస్తిభేదం – ఆముదపు వేళ్ళ కషాయంలో తేనె, నెయ్యి, సైంధవ లవణం, వస, పిప్పళ్ళు సమభాగాలుగా గ్రహించి చూర్ణించి కలిపి వస్తిప్రయోగం చేసేది.

యుక్తి – అనేకాలైన ఉపపత్తులతో ఊహించేది యుక్తిప్రమాణం. దుక్కి, నీరు, విత్తనం, ఋతువు – ఇవి చక్కగా సమకూరితే సస్యం పుట్టి ఫలిస్తుంది అనే దీని కుదాహరణం.

యుక్తికృతబలం – త్రివిధబలాలలో యిదొకటి. వ్యాయామం మొదలైన శరీరచేష్టలకూ, నెయ్యీ, మాంసమూ మొదలైన మంచి ఆహారపదార్థాలకూ కలిగే సమ్యగ్యోగంవల్ల సిద్ధించే బలం యిది. అంటే ఆహార విహారాదులవల్ల యుక్తిగా సంపాదించుకునేది.

యుక్తివ్యపాశ్రయం – త్రివిధౌషధాలలో ఇదొకటి. ఆహారవిహారాలు, ఔషధాలు – ఇవి లెస్సగా ఉపయోగించుకోడం.

యుగ్మాంజనం – అంజనద్వయం. స్రోతోంజనం, సౌవీరాంజనమున్ను.

యతం – నాలుగు హస్తాలు.

యుద్ధసారం – అశ్వం.

యువతి – రజస్వల అయిన స్త్రీ.

యువకుడు – 16–25 ఏళ్ళ వయస్సుగల పురుషుడు. బాల్యావస్థ దాటినవాడు.

యువానపిడక – యౌవనం మూలంగా మొగాన అంకురించే మొటిమలు.

యువావస్థ – యౌవనం.

యూషం – ముద్గాదుల రసం.

యోగం – ఔషధం.

యోగవస్తి – వస్తికర్మలలో ఇదొకరకం. మొత్తం యెనిమిది మాట్లు మొదట ఒక స్నేహవస్తి, తరవాత మూడు నిరూహవస్తులు, వాటి తరవాత మూడు స్నేహవస్తులు, చివరికి ఒక స్నేహవస్తి. ఈ యెనిమిదీ కలిపి చేసిన చికిత్సకు యోగవస్తి అని పేరు.

యోగవాహి – ప్రతీ ద్రవ్యానికీ ఏవో కొన్ని గుణాలున్నాయి. అయితే తేనె, అశ్వగంధ మొదలైన కొన్ని ద్రవ్యాలు ఏ వస్తువులతో కలుస్తాయో ఆ వస్తువుల గుణాలున్నూ చేస్తాయి. యోగవాహిత్వం అంటే యిది.

యౌవనం – 16 ఏళ్ళదాకా కైశోరం. ఆపైని యౌవనం.

# ర

**రంగ్క్షారం** – టంకణం (వెలిగారం).

**రంజకం** – ఇదొక పిత్తం. అంటే జఠరాగ్ని. ఇది యకృత్తుకూ ప్లీహకు మధ్యగా వుంటుంది. ఇదే తెల్లని ఆహార రసాన్ని ఎర్రగా మార్చి రక్తంగా చేస్తుంది.

**రంజనగణం** – రంజనద్రవ్య సముదాయం – అంటే, రంగుకలిగించే వస్తువులు. అవి – పసుపు, మానుపసుపు, కవిరి, రక్తచందనం, నీలిని, కుసుంభపుష్పం, మంజిష్ఠ, లక్క, మోదుగుపువ్వున్ను.

**రంధనం** – వంట.

**రక్తం** – శరీరంలోవుండే రెండో ధాతువు.

**రక్తగ్రీవం** – పావురం.

**రక్తజిహ్వ** – సింహం.

**రక్తపల్లవం** – అశోకవృక్షం.

**రక్తపాయి** – నల్లి.

**రక్తపాయిని** – జలగ.

**రక్తపారదం** – ఇంగిలీకం.

**రక్తపాషాణం** – గిరిమృత్తిక.

**రక్తఫలం** – మర్రిచెట్టు.

**రక్తబభ్రువు** – ప్రాణాలుతీసే ఎర్రతేలు – ఇది చాలా పెద్దది.

**రక్తమోక్షణం** – శరీరంలో రక్తం యెక్కువగా వుంటే అనేక రోగాలు పుడతాయి. అంచేత జెలగలు మొదలైన సాధనాలతో రక్తం తీస్తారు. అది యిది.

**రక్తవర్గం** – ఎర్రనివస్తువులు. దానిమ్మపువ్వు, మోదుగుపువ్వు, లక్క, పసుపు, మానుపసుపు, కుసుంభపువ్వు, మంజిష్ఠ, మునుకెనపువ్వున్ను.

**రక్తవాలుకం** – సిందూరం.

**రక్తసువు** – శరీరంలో వుండే రసధాతువు.

**రక్తాధారం** – చర్మం.

**రక్తావసేచనం** – రక్తమోక్షణం.

**రక్తి** – మానపరిభాష. ఎనిమిది ఆవాల యెత్తు.

**రజనీజలం** – మంచు.

**రజనీద్వయం** – పసుపు, మానుపసుపు.

**రజస్సారథి** – వాయువు.

**రజస్వలానియమాలు** – ఋతుమతి అయిన స్త్రీ ఆ మూడు దినాలూ దర్భశయ్యమీద పరుండాలి. దోసిటితోనో, మూకుటితోనో, ఆకులోనో నెయ్యి, పాలు – వీటితో అన్నం తినాలి. ఆ మూడు దినాలూ భర్తను చూడగూడదు.

**రతిచర్య** – స్త్రీసేవ.

**రతిరథం** – గోరు.

**రత్నజాతి** – రత్నాలలో నాలుగు జాతులున్నాయి. అవి బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రజాతులు. తెల్లనివి బ్రాహ్మణజాతివి. ఎర్రనివి క్షత్రియజాతివి. నల్లనివి వైశ్యజాతివి. పచ్చనివి శూద్రజాతివి.

**రదాయుధం** – పంది.

**రభసం** – పౌర్వాపర్యవిచారం.

**రవినామకం** – రాగి.

**రసం** – అన్నరసం.

**రసం** – మధురాదిరసా లారింటియందున్నూ వ్యాపించివుండి, నాలుకతో మాత్రం గ్రహించతగ్గ రుచివిశేషం రసం.

**రసకృత్యాలు** – మధురామ్లలవణరసాలు, వాతం తగ్గిస్తాయి. కటుతిక్త కషాయ రసాలు వాతం పెంచుతాయి. కషాయమధురతిక్త రసాలు పిత్తం తగ్గిస్తాయి. అమ్లలవణకటురసాలు పిత్తం పెంచుతాయి. కషాయకటుతిక్తరసాలు శ్లేష్మం తగ్గిస్తాయి. అమ్లలవణ మధుర రసాలు శ్లేష్మం పెంచుతాయి.

**రసక్రియ** – కషాయాలు మళ్ళీ కాచి గట్టిపరచడం. లేహ్యమున్ను.

**రసగుణాలు** – శిశువులకు రసగుణాలు కొన్ని సంక్రమిస్తాయి. అవి – బలం, వృద్ధి, కాంతి, అస్థిహాని ఇత్యాదులు.

**రసఘ్నం** – టంకణం.

**రసచాతుర్విధ్యం** – రసం నాలుగు విధాలని ఒక మతం. అవి – 1. హితకరమైన స్వాదువు. 2. అహితకరమైన స్వాదువు. 3. హితకరమైన అస్వాదువు. 4. అహితకరమైన అస్వాదువు అని. ఇది కౌశికగోత్రోద్భవుడైన హిరణ్యాక్షుని మతం.

**రసజ్ఞ** – నాలుక.

**రసజ్యేష్ఠం** – మధురరసం.

**రసతేజం** – రక్తం.

**రసత్రైవిధ్యం** – మౌద్గల్యుని మతంలో రసం మూడు విధాలు. అవి: 1. ఛేదనీయం. 2. ఉపశమనీయం. 3. సాధారణమున్ను.

**రసద్వైవిధ్యం** – శాకుంతేయుని మతంలో భేదనీయం, ఉపశమనీయం అని రసం రెండు విధాలు. భేదనం శరీరానికి కార్శ్యం కలిగిస్తుంది. అంచేత, దానికి అపతర్పణీయం అనిన్నీ పేరు. ఉపశమనీయం శరీరానికి బలమూ, పుష్టీ కలిగిస్తుంది. అంచేత, దానికి, బృంహణీయం అనిన్నీ పేరు.

**రసనాపదం** – నితంబం.

**రసనేంద్రియం** – జిహ్వ (నాలుక).

**రసపంచవిధత్వం** – 1. భౌమం, 2. ఔదకం. 3. ఆగ్నేయం, 4. వాయవీయం, 5. ఆంతరిక్షం అని రసం అయిదు విధాలు. ఇది భరద్వాజుని మతం. ఇతనికి కుమారశిరుడని మారుపేరు.

**రసఫలం** – కొబ్బరిచెట్టు.

**రసభవం** – రక్తం.

**రసమైత్రి** – మధురామ్లం, లవణామ్లం, కటుతిక్తకం, కటులవణం, తిక్తలవణమున్ను.

**రసలలన** – జిహ్వ.

**రసవతి** – పాకశాల.

**రసవిరోధం** – తిక్తమధురాలు, లవణమధురాలు, కటుమధురాలు ఇత్యాదిగా ఊహించుకునేది.

**రసశోణితసంభవం** – మాంసం.

**రసషడ్విధత్వం** – 1. గురువు, 2. లఘువు, 3. శీతలం, 4. ఉష్ణం, 5. స్నిగ్ధం, 6. రూక్షం అని ఆరు విధాలు. ఇది రాజర్షి అయిన వార్యోవిదుని మతం.

**రససంరక్షణం** – పాదరసానికి – శోధన, మూర్ఛన, బంధన, మారణ రూపమైన కర్మచతుష్టయం.

**రససప్తవిధత్వం** – 1. మధురం (తీపి), 2. అమ్లం (పులుపు), 3. లవణం (ఉప్పు), 4. కటు (కారం), 5. తిక్తం (చేదు), 6. కషాయం (వగరు), 7. క్షారం (ఘాటుగా తీవ్రంగా వుండేది) అని రసం ఏడు విధాలు. ఇది విదేహ దేశాధిపతి అయిన నిమి మతం.

**రసాంజనం** – నాలుగు రకాల అంజనాలలోనూ వొకటి.

**రసాదానం** – రసశోషణం.

**రసాధికం** – టంకణక్షారం (వెలిగారం).

**రసానురసాలు** – ద్రవ్యం పచ్చిగా వున్నా, ఎండివున్నా, చప్పరించినా, నమలినా ఏ రుచి స్ఫుటంగా కనబడుతుందో అది రసం, అంత స్ఫుటంగా కనబడక కార్యంవల్ల తెలుసుకోవలసి వుండేది అనురసం.

**రసాయనం** – ముసలితనమూ వ్యాధులూ రాకుండా చేసి ఆయుర్దాయం పెంచే ఔషధం రసాయనం. ఇది లేహ్యం, గుటిక, చూర్ణం, రసౌషధాలు ఇత్యాది అనేక రూపాలుగా వుంటుంది.

**రసాయనవరం** – వెల్లుల్లి.

**రసాయనశ్రేష్ఠం** – పాదరసం.

**రసాలోల** – జిహ్వ.

**రసాష్టకం** – మహారసాలు ఎనిమిది. అవి – పాదరసం, ఇంగిలీకం, అభ్రకం, కాంతలోహం, విమలం, మాక్షికం, వైక్రాంతం, శంఖమున్ను.

**రసాష్టవిధత్వం** – ధామార్గవుడనే ఋషి రసాలు ఎనిమిది అని చెప్పారు. అవి – మధురం, అమ్లం, లవణం, కటు, తిక్తం, కషాయం, క్షారం, అవ్యక్తమున్ను.

**రసాసంఖ్యేయత్వం** – ఆశ్రయం, గుణం, కర్మ, సంస్వాదవిశేషం – ఇవి లెక్కలేనన్ని విధాలు కనక, రసాలు అసంఖ్యాకాలని బాహ్లీక దేశీయవైద్యుడు కాంకాయనుడు చెప్పారు.

**రసైకవిధత్వం** – రసం వొక్కటే అనీ, అది ఉదకమే అనీ భద్రకాప్యుడు చెప్పారు.

**రసోదరం** – ఇంగిలీకం.

**రసోపలం** – ముత్యం.

**రస్యం** – మాంసధాతువు.

**రాక** – రజస్వల అయిన కన్య.

**రాక** – పౌర్ణమి.

**రాగషాడబం** – ఇదొక ఖాద్యద్రవ్యం. పచ్చి మామిడికాయ పెచ్చుతీసి, ముక్కలు చేసి, నేతిలో దోరవేయించి, పంచదార పాకంలో మిరియాలు, ఏలకులు, పచ్చకర్పూరం చూర్ణించి కలిపి, వేపిన మామిడికాయముక్కలతో కలిపి నేతితో మాగిన కుండలో భద్రపరుచుకునేది. ఇది పుష్టికరం. బల్యం. పిత్తం, వాతరక్తం, అరుచి పోగొడుతుంది.

**రాగషాడవం** – పెసరకట్టులో దానిమ్మరసం, ద్రాక్షపళ్ళు చేర్చినది.

**రాజపత్ని** – ఇత్తడి.

**రాజపూజ్యం** – బంగారం.

**రాజభోగ్యం** – జాపత్రి.

**రాజయోగ్యం** – చందనం.

**రాజలక్ష్మి** – అరటిచెట్టు.
**రాజవల్లి** – కాకర.
**రాజవాహం** – గుర్రం.
**రాజవైద్యుడు** – రోగకారణమూ, రోగలక్షణమూ బాగాతెలిసి రోగాలు తగ్గించడంలోనూ, రోగాలు మళ్ళీ రాకుండా చెయ్యడంలోనూ మిక్కిలి సమర్థుడైన చికిత్సకుడు.
**రాజసగుణాలు** – దుఃఖించడం, సంచరించే స్వభావం, అధైర్యం, అహంకారం, అబద్ధమాడడం, నిర్దయ, దంభం, అభిమానం, అహర్షం, కామం, క్రోధమున్నూ రాజసగుణాలు.
**రాజసారసం** – నెమలి.
**రాజస్కంధం** – గుర్రం.
**రాజార్హం** – అగురుచెక్క.
**రాత్రి** – ఇది నిద్రించవలసిన సమయం. ఊర్ధ్వజత్రువ్యాధులుండినా, లేఖనౌషధాలూ, బృంహణౌషధాలూ, పాచనౌషధాలూ, శమనౌషధాలూ పుచ్చుకోవలసివుండినా ఇది అందుకు మంచిసమయం.
**రాత్రిజాగరదం** – దోమ.
**రాత్రిపుష్పం** – కలువ.
**రాత్రిహాసం** – తెల్లకలువ.
**రామావక్షోజోపమం** – చక్రవాకం.
**రామావామాంఘ్రిఘాతకం** – అశోకవృక్షం.
**రాశి** – మానపరిభాష. ఒక ద్రోణం.
**రాహుచ్ఛత్రం** – అల్లం.
**రాహూచ్ఛిష్టం** – వెల్లుల్లి.
**రాక్షసభోజనం** – మాంసం.
**రుక్క** – సురావిశేషం.
**రుచ్యం** – రుచికరం.
**రుజాకరమర్మలు** – శరీరంలో మర్మలలో ఇదొకరకం. అవి – గుల్ఫాలు, మణిబంధాలు, కూర్పశిరస్సులున్నూ. వీటిమీద దెబ్బలు తగిలితే అనేక విధాల వ్యాధులు సంభవిస్తాయి.
**రుద్రరేతస్సు** – పాదరసం.
**రుధిరం** – కుంకుమ.
**రుధిరాశయం** – యకృత్తు.
**రుమాభవం** – రుమానదిలోపుట్టిన ఉప్పు. ఇదే శాంభరలవణం.
**రూషణం** – రజోగుణం.
**రేకం** – విరేచనం.
**రేచనీయం** – విరేచనకారి.
**రేచనౌషధం** – పక్వంగావున్నా అపక్వంగావున్నా మలాదులన్నింటికీ ద్రవరూపం కలిగించి బయటికి వెడలించేది రేచనం. తెగడ మొదలైనవి ఈ పని చేస్తాయి.
**రోగఘ్నం** – ఔషధం
**రోగజ్ఞుడు** – వైద్యుడు.
**రోగద్వైవిధ్యం** – నిజరోగాలు, ఆగంతుకరోగాలు అని రోగాలు రెండు రకాలు.
**రోగపతి** – జ్వరం.
**రోగభూమి** – శరీరం.
**రోగభేదాలు** – రోగం సాధ్యం, అసాధ్యం అని రెండు విధాలు. వీటిలో సాధ్యం – సుసాధ్యం (సులువుగా తగ్గిపోయేది), కృచ్ఛ్రసాధ్యం (కష్టసాధ్యం – దీర్ఘవ్యాధిన్ని) అని రెండు విధాలు. అసాధ్యంకూడా యాప్యం, అనుపక్రమం అని రెండు విధాలు.
**రోగమార్గం** – శాఖలు, మర్మాస్థిసంధులు, కోష్ఠం – అని మూడు విధాలు.
**రోగలక్షణం** – రోగం తెలిపే గుర్తు.
**రోగవిజ్ఞానం** – అంటే రోగనిర్ణయపద్ధతి. ఇది దర్శన స్పర్శన ప్రశ్నలు అని మూడు ఉపాయాలతో తెలుసుకోవచ్చును. దర్శనం అంటే ఇహ్వా, మూత్రం ఇత్యాదులు చూడడం. స్పర్శనం అంటే నాడీ పరీక్ష ప్రశ్న అంటే రకరకాలుగా అడిగి కష్టసుఖాలు వాటి వివరాలూ తెలుసుకోవడం.
**రోగశాంతకుడు** – చికిత్సకుడు.
**రోగహం** – ఔషధం.
**రోగహరద్రవ్యం** – మధురాదిరోగనాశక ద్రవ్యం.
**రోగహారి** – వైద్యుడు.
**రోగహేతువు** – రోగకారణం.
**రోగాధిష్ఠానం** – శరీరం, మనస్సు అని రోగాధిష్ఠానం రెండు విధాలు.
**రోగి** – వ్యాధిగ్రస్తుడు. ఇతనికి నాలుగు లక్షణాలుండాలి. అవి – ఆఢ్యత, భిషగ్వశ్యత, జ్ఞాపకత్వం, సత్వమున్నూ.
**రోగోదకం** – మలినంగానూ, దుర్గంధంగానూ వుండి రోగాలు పుట్టడానికి కారణం అయిన నీరు.
**రోచకద్వయం** – అంటే లవణద్వయం. బిడాలవణం, సైంధవలవణమున్నూ.

**రోచనం** – రుచికరం.

**రోపణం** – (వ్రణాలు, గాయాలు) మాన్పేది.

**రోపణగండూషం** – మధుర కటు రసాలూ, ఉష్ణాలూ అయిన కషాయాదులు పుక్కిలించడం. ఇది వ్రణరోపణం చేస్తుంది.

**రోమకర్ణం** – కుందేలు.

**రోమకేసరం** – చామరం.

**రోమగుచ్ఛం** – చామరం.

**రోమత్వక్షరి** – అరోమస్త్రీ.

**రోమద్వీపం** – కృమి.

**రోమభూమి** – చర్మం.

**రోమవికారం** – రోమాంచం. గగుర్పాటు.

**రోహణం** – శుక్రం.

**రౌద్రం** – ఎండ.

**రౌక్షం** – రూక్షత.

**రౌక్ష్యం** – వాయుగుణభూయిష్ఠత్వం, స్నేహ రాహిత్యమున్ను.

## ల

**లంఘనం** – లఘుభోజనం – అంటే కొద్దిగా భుజించడం. ఉపవాసం, పస్తు.

**లంబనం** – కఫం.

**లఘువు** – తేలిక అయినది. సులభంగా జీర్ణం అయేది.

**లఘుకామం** – మేక.

**లఘుత్రిఫలాలు** – పెగ్గుమ్మడు, ఖర్జూరపు పండు, చిట్టీతపండున్ను.

**లఘుపంచమూలం** – శాలిపర్ణి, పృశ్నిపర్ణి, పెద్దములక, వాకుడు, పల్లేరున్ను. ఇదే స్వల్ప పంచమూలం.

**లఘుపుటం** – ఇదే కపోతపుటం.

**లఘుహస్తుడు** – త్వరగా పని చేసేవాడు.

**లతాజిహ్వం** – పాము.

**లతాతరువు** – తాడిచెట్టు.

**లతామణి** – పగడం.

**లలజ్జిహ్వం** – లొట్టిపిట్ట.

**లలాటరేఖ** – ఇది దీర్ఘజీవితసూచకం. నొసట వుంటుంది.

**లవణం** – క్షారరసంగల ద్రవ్యం. ఇది అయిదు రకాలనీ, ఆరు రకాలనీ, తొమ్మిది రకాలనీ, మూడు పక్షాలున్నాయి. అయిదు రకాలు – సౌవర్చలం, సైంధవం, బిడాలవణం, ఉద్భిదల వణం, సాముద్రలవణమున్ను. తొమ్మిది రకాలు – సైంధవలవణం, సౌవర్చలవణం, కాచలవణం, బిడాలవణం, గాఢలవణం, సాముద్రలవణం, ద్రోణేయు లవణం, ఊషరలవణం, రోమకలవ ణమున్ను. ఆరు రకాలు – సాముద్రలవణం, సైంధవలవణం, బిడాలవణం, రోమకలవణం, సౌవర్చలవణం, చుల్లికాలవణమున్ను. వీటిలో సైంధవలవణం ఎరుపు తెలుపు రంగులతో రెండు రకాలు. గాఢలవణం శాంభరదేశ ప్రసిద్ధం.

**లవణత్రయం** – బిడాలవణం, సైంధవలవణం, రుచకలవణమున్ను.

**లవణద్వయం** – సౌవర్చలవణం, సైంధవలవణ మున్ను.

**లవణనిత్యుడు** – ఎప్పుడూ లవణరసం ఎక్కువగా ఆస్వాదించే స్వభావం కలవాడు.

**లవణయంత్రం** – ఔషధాలు వండే యంత్రాలలో ఇదొకటి. సికతాయంత్రంలో యిసుకపోసేటట్టు దీన్లో ఉప్పుపోస్తారు.

**లవణవర్గం** – అంటే లవణాల సమూహం, సాముద్రలవణం, సైంధవలవణం, బిడాలవణం, సౌవర్చలవణం, రోమకలవణమున్ను.

**లవణోత్తమం** – సైంధవలవణం.

**లక్ష్మిగృహం** – ఎర్రకలువ.

**లక్ష్మిపుత్రం** – గుర్రం.

**లాఘవం** – లఘుత్వం, ఆరోగ్యమున్ను.

**లాజతర్పణం** – పేలాలపిండితో తృప్తికలిగించడం.

**లాజపేయ** – పేలాలతో చేసిన పేయ.

**లాజభక్తం** – పేలపిండితో చేసిన భోజ్యం.

**లాజమండం** – పేలాల మండం.

**లాలస** – గర్భిణీదోహదం.

**లాల** – చొంగ.

**లాక్షాదివర్గం** – లక్క, రేవతకం, కొడిశ, కరవీర, కాయఫలం, పసుపు, మానుపసుపు, వేప, సప్తపర్ణి, మాలతి, కానుగ.

**లిప్తాస్యత** – ముఖానికి శ్లేష్మలిప్తత.

**లులాయకాంత** – గేదె.

**లుషభం** – మత్తేభం.

లేఖనం - లేఖనౌషధం. అగ్నివాయుగుణభూయిష్ఠం.

లేఖనవస్తి - వస్తికర్మలో యిదొకరకం. త్రిఫలా కషాయంలో గోమూత్రం, తేనె, యవక్షారం, ఊషకాదిగణచూర్ణమున్న కలిపి వస్తిప్రయోగం చేసేది.

లేఖనీయవర్గం - ముస్తలు, చెంగల్వకోష్టు, పసుపు, మానుపసుపు, వస, అతివస. కటుకరోహిణి, చిత్రమూలం, చిరిబిల్వం. హైమవతిన్ని.

మతాంతరం: తుంగగడ్డలు, చెంగల్వకోష్టు, పసుపు, మాను పసుపు, వస, అతివస, కటుకరోహిణి, చిత్రమూలం, తెల్లని వస.

లేఖనౌషధం - శరీరంలో దుష్టాలయివుండే వాతాదిదోషాలనూ, ధాతువులనూ, మలాదులనూ శుష్కింపజేసి శాంతిపరిచేది. తేనె, వేడినీరు, వస, ఇత్యాదులు ఈ పని చేస్తాయి.

లేపనం - చందనాదులు పూసుకోడం. ఇది దోషఘ్నం, విషఘ్నం, వర్ణ్యం అని మూడువిధాలు. ఆలేపం, ప్రదేహం అని మరో రెండు విధాలున్న.

లేలిహం - పురీషంలోపుట్టే క్రిమివిశేషం.

లేహనం - చప్పరించడం.

లేహ్యం - అష్టవిధాన్నాలలో వొకటి.

లోకతుషారం - పచ్చకర్పూరం.

లోచనహిత - కుళుత్థాంజనం.

లోఠనం - ఇటూ అటూ పొర్లడం.

లోభనం - మాంసం.

లోమకర్ణం - కుందేలు.

లోమహర్షణం - గగుర్పాటు.

లోల - జిహ్వ.

లోహద్రావి - టంకణక్షారం.

లోహనిర్యాసం - మాండూరం.

లోహపంచకం - స్వర్ణం, రౌప్యం, తామ్రం, వంగం, సీసమున్న.

లోహితాననం - ముంగిస.

## వ

వక్త్రఖురం - దంతం.

వక్త్రభేది - చేదురసం.

వచనం - సొంటి.

వచావర్గం - వస, తుంగముస్తలు, దేవదారు. సొంటి, అతివస.

వచోగ్రహం - శ్రవణేంద్రియం - చెవి.

వజ్రదంతం - పంది.

వజ్రమూష - ఊకబూడిద రెండు భాగాలు, పుట్టమన్ను ఒక భాగం, మాండూరం ఒక భాగం, తెల్లరాతిచూర్ణం ఒక భాగం, వరకేశాలు ఒక భాగం - ఇవన్నీ కలిపి మేక పాలతో ఉడికించి రెండు జాములు నూరి గుండ్రంగా - గోస్తనాకారంగా - పొడుగ్గా - రెండు మూకుళ్ళు చేసి ఎండించి ఒకదాన్లో రసం పోసి రెండోమూకుడు బోర్లించి చీల యిచ్చేది. ఇదీ వజ్రమూష.

వజ్రరదం - పంది.

వజ్రాభ్రకం - ఇది కాటుకలాగ మిక్కిలీ నల్లగా వుంటుంది. నిప్పులో వేస్తే వికృతి పొందుతుంది.

వత్సరాంతకం - ఫాల్గునమాసం.

వధూటశయనం - వాతాయనం. కిటికీ.

వనపుష్పోత్సవం - మామిడిచెట్టు.

వనభూషణ - కోకిల.

వనరాట్టు - మర్రిచెట్టు.

వనలక్ష్మి - అరటిచెట్టు.

వనశోభనం - తామరపువ్వు.

వనస్పతి - పూత లేకుండా కాసే మేడి, పనస మొదలైన వృక్షాలు.

వపుర్వీర్యం - శుక్రధాతువు.

వమనవ్యాపత్తు - సరిగా వాంతి కాకపోతే తటస్థించే ఆధ్మానం మొదలైన వికారాలు.

వమనోపగవర్గం - తేనె, యష్టిమధుకం, తెల్లపువ్వుల దేవకాంచనం, ఎర్రపువ్వుల దేవకాంచనం, కడిమి, నీటిప్రబ్బలి, దొండ, జనుము, జిల్లేడు, ఉత్తరేణిన్ని.

వమనౌషధం - పక్వం కాకుండా వుండే పిత్తమూ, కఫమూ హృదయస్థానంలో అడ్డగించి, వాటిని ద్రవరూపంగా బలత్కారంగా నోటి నుంచి బయలువెడలించేది. మ్రంగకాయ మొదలైనవి ఈ పని చేస్తాయి.

వయస్సంస్థాపని - సరస్వతీ తీగ.

వయస్కాయనీక్షీరం - దూడపెరిగిన ఆవుపాలు.

వయస్థాపనవర్గం - తిప్పతీగ, కరక్కాయలు,

ఉసిరిక, సన్నరాస్న, దుంపరాస్న, పాలకూర, పిల్లిపీచర, సరస్వతీఆకు, ముయ్యాకుపొన్న, గలిజేరున్ను.

**వరటీవాంతం** – తేనె.

**వరండ** – గోరువంక.

**వరఫలం** – కొబ్బరిచెట్టు.

**వర్ణార్థకం** – కుంకుమపువ్వు, చందనం, కురువేరు సమభాగాలుగా కలిపితే పదార్థకం అని పేరు.

**వరాహపుటం** – ఘనమూరగోతిలో పుటం పెట్టడమే వరాహ పుట్టం.

**వరుణాదిగణం** – ఉలిమిరి. నీలిగోరింట, పచ్చగోరింట, పిల్లితేగలు, చిత్రమూలం, మోరటం, మారేడు, బుషభకం, వాకుడు, పెద్దములక, కానుగు, జయాద్వయం, మునగ, దర్భ, హింతాళమున్ను.

**వరూథం** – చర్మం.

**వరేణ్యం** – కుంకుమ.

**వర్చోభేది** – విరేచనకారి.

**వర్ణమాతృక** – వాగ్దేవత.

**వర్ణవిలాసిని** – పసుపు.

**వర్ణ్యవర్గం** – చందనం, సురపొన్న, పద్మకం, వట్టివేరు, అతిమధురం, మంజిష్ఠ, సుగంధిపాల, క్షీరకాకోళి, తెల్లగరుక, పచ్చగరుక.

**వర్షకేతువు** – ఎర్రగలిజేరు.

**వర్షవరుడు** – నపుంసకుడు.

**వర్షాఘోషం** – పెద్దకప్ప.

**వర్షామదం** – నెమలి.

**వర్షాంభఃపారణవ్రతం** – చక్రవాకం.

**వర్షావసానం** – శరత్కాలం.

**వల్లం** – మానపరిభాష. మూడు రక్తుల యెత్తు.

**వల్లి** – చెట్లమీద పాకి గాలికి కదలే ద్రాక్షతీగ మొదలైనవి.

**వల్లీపంచమూలం** – తిప్పతీగ, మేషశృంగి, సుగంధి, నేలగుమ్ముడు, పసుపున్ను. ఇదే లతాపంచమూలం.

**వళిత్రయం** – మలద్వారానవుండే మూడు వళులు. వీటికి ప్రవాహిని, సంవరణి, విసర్జని అని పేరు.

**వశీకరణం** – మణిమంత్రౌషధాలతో వశ్యంచేసుకోడం.

**వశ్యాత్మ** – ఇంద్రియాలను వశ్యంచేసుకున్నవాడు.

**వసంతఘోషి** – కోకిల.

**వసంతదూత** – మామిడిచెట్టు.

**వసంతమండనం** – సిందూరం.

**వస్కయనీక్షీరం** – దూడ బాగా పెరిగిన తరవాత ఆవు ఇచ్చే పాలు.

**వస్కరాటిక** – తేలు.

**వస్తి** – వస్తి అంటే మూత్రాశయం. ఇది శరీరాంతర్భాగం. ఇదిగాక – వస్తి అంటే తోలుతిత్తి. దానితో చేస్తారుకనక దీనికి వస్తి అని పేరు. ఇది వస్తికర్మ కుపయోగించే సాధనం. అనువాసన వస్తి, నిరూహావస్తి అని వస్తికర్మ రెండు విధాలు. వీటిలో – చమురులతో చేసేది అనువాసనవస్తి. దీనికే మాత్రావస్తి అనిన్నీ పేరు. కషాయాలు, పాలు, తైలాలు – వీటితో చేసేది నిరూహావస్తి. ఇదే ఆస్థాపనవస్తి. దోషాలను స్వస్థానంలో చేర్చేదికనక దీనికి ఆస్థాపనం అని పేరు. అనేక కారణాలవల్ల నిరూహావస్తి అనేకరకాలు. రకరకాల ద్రవ్య సంయోగంవల్ల ఈ వస్తికర్మ సంగ్రహం, శోధనం, శమనం చేస్తుంది. శుక్రం క్షీణించినవారికి వీర్యవృద్ధి కలిగిస్తుంది. చిక్కిపోయిన వారికి పుష్టి కలిగిస్తుంది. స్థూలదేహాలను చిక్కిస్తుంది. నేత్రాలకు ప్రీణనం కలిగిస్తుంది. వలీఫలితాలు పోగొడుతుంది. వయస్సు నిలుపుతుంది. శరీరానికి రంగు, వర్చస్సు, బలం, ఆరోగ్యం కలిగిస్తుంది. ఆయుర్వృద్ధిన్ని కలిగిస్తుంది.

**వస్తికర్మ** – వస్తిప్రయోగం. వస్తి అంటే మూత్రపుతిత్తి. మేక, గొర్రె, బర్రె మొదలైన జంతువుల మూత్రాశయాలతో గుదమార్గాన కషాయాదులు ఎక్కించే కర్మకనక దీనికి వస్తికర్మ అని పేరు. ఇదే యిప్పుడు పింగాణీ గొట్టాలతో చేస్తున్నారు.

**వస్తిద్రవ్యాలు** – పాదిరి, కూరనెల్లి, మారేడు, నక్కతోక పొన్న, కోలపొన్న, వాకుడు, చిట్టాముట్టి, పల్లేరు, మునక, ఆముదపుచెట్టు, గలిజేరు, యవలు, ఉలవలు, రేగుపళ్లు, తిప్పతీగ, మ్రంగకాయ, మోదుగు, కామంచికసువు, స్నేహద్రవ్యాలు, లవణాలు – ఇవన్నీ ఆస్థాపన (నిరూహ) వస్తికర్మ కుపయోగించదగ్గవి.

**వహ్నిభోగ్యం** – నెయ్యి.

**వహ్నిమారకం** – నీరు.

**వక్షోజోపమం** – చక్రవాకం.

వాక్యదోషం – న్యూనార్థకం, అధికార్థకం, అపార్థకం, విరుద్ధార్థకం – ఇత్యాదులు.

వాగ్దలం – పెదవులు.

వాగ్విలాసి – పావురం.

వాజం – అన్నం, జలం, శుక్రమున్నూ.

వాజిలక్ష్మం – సెనగలు.

వాజీకరం – శుక్రవృద్ధి, సంభోగశక్తి కలిగించే క్రియ. గుర్రంలాగ సంభోగించేసే శక్తి పురుషులకు కలిగించేది వాజీకరం. పురుషుడు ఈ చికిత్స చాలా శ్రద్ధగా చేసుకోవాలి. అలా అయితేనే అతను ధర్మార్థకామాలూ, రతిసుఖమూ అనుభవించగలడు. దీనివల్లనే సత్పుత్రులు కలుగుతారు.

వాతం – పంచభూతాలలో నాలుగోది.

వాతకర్మ – అపానవాయువు విడిచిపెట్టడం.

వాతకేతువు – ధూళి.

వాతప్రమి – గుర్రం.

వాతమృగం – అతివడిగా పరుగెత్తే లేడి.

వాతలం – వాతకరం, సెనగలు.

వాతశీర్షం – పురుషులకు వస్తిస్థానమూ, స్త్రీలకు గర్భస్థానమున్నూ.

వాతసంగం – వాయురోధం.

వాతసారం – మారేడుచెట్టు.

వాతస్థానాలు – వస్తి (మూత్రాశయం), పక్వాశయం, కటి, తొడలు, పాదాలు, ఎముకలు – ఇవి వాతస్థానాలు. వీటిలో పక్వాశయం వాతానికి ముఖ్యస్థానం. ప్రాణాపానవ్యానాదివాతాలకు వేర్వేరు స్థానాలున్నాయి.

వాతాతపికం – రసాయనసేవన విధులలో ఇదొకటి. రెండోది కుటీప్రావేశికం.

వాతానులోమనం – వాతానికి అనులోమగతి కలిగించేది.

వాతామోద – కస్తూరి.

వాతాయునం – గుర్రం.

వాతాయువు – లేడి.

వాతికషండుడు – వాతవికారాలవల్ల వృషణాలు లేకుండా పుట్టినవాడు.

వాత్సీపుత్రుడు – నాపితుడు.

వాదం – శాస్త్రీయంగా చర్చ చెయ్యడం. ఇది జల్పం అనీ, వితండం అని రెండు విధాలు. ఒక పక్షం అనుసరించి చేసేది జల్పం. జల్పానికి వ్యతిరేకం వితండం.

వాదమర్యాద – వాదం చేసేటప్పుడు చూసుకోవలసిన హద్దులు. ఇది వాచ్యం, ఇది అవాచ్యం, ఇది ఓటమి – ఇత్యాదులు.

వాదరం – నూలుబట్ట.

వానస్పత్యాలు – ముందు పూసి, తరవాత కాసి ఫలించే మామిడిచెట్టు మొదలైనవి.

వాపం – ముండనం.

వాపి – సరోవరం. రాళ్ళతోనైనా, ఇటుకలతోనైనా మాయిలాగ గోడలు కట్టినది. దీనికి మెట్లున్నా వుంటాయి. ఇందులోని జలమే వాప్యం.

వాప్యక్షీరం – సముద్రలవణం.

వామదృక్కు – స్త్రీ.

వామస్కంధం – పంది.

వామాంఘ్రిఘాతనం – అశోకవృక్షం.

వాయువ్యద్రవ్యాలు – లఘు శీత రూక్ష ఖర విశద సూక్ష్మ స్పర్శగుణ బహుళాలైన ద్రవ్యాలు.

వాయసోలిక – కాకోళి.

వాయుగండం – అజీర్ణం.

వాయుపంచకం – ప్రాణం, ఉదానం, వ్యానం, సమానం, అపానమున్నూ.

వాయుఫలం – వడగళ్ళు.

వాయువాహం – పొగ.

వాయువ్యవస్థ – ఋతుభేదం అనుసరించి వాయువ్యవస్థ, వసంతంలో దక్షిణవాయువు, వర్షాకాలంలో పశ్చిమవాయువు, శరత్కాలంలో ఉత్తరవాయువు, హేమంతశిశిరాలలో తూర్పువాయువు.

వారం – మద్యపాత్ర.

వారణవల్లభ – అరటిచెట్టు.

వారాహపుటం – పుటాలలో ఇదొకటి.

వారాహపుటభావన – ఎనిమిది పలాల ద్రవద్రవ్యంతో చేసే భావన.

వారికఫం – సముద్రఫేనం.

వారికర్పూరం – చేపలలో ఇదొకరకం.

వారిక్రిమి – జలగ.

వారిచరవర్గం – జలచరపక్షుల సమూహం.

వారిచామరం – నాచు.

వారితరం – వట్టివేరు.

వారితరం — భస్మపరీక్షలలో ఇదొకటి. మెత్తని భస్మం నీటిమీద వేస్తే మునిగిపోగూడదు. అలా అయితే భస్మం సిద్ధం అయినట్టు.

వారిప్రసాదనం — ఇండుపుకాయ.

వారిమానం — కషాయాదులు కాచుకునేట ప్పుడు చేర్చుకోవలసిన జలపరిమాణం.

వారిశయాలు — అంటే నీటిలో నివసించే ప్రాణికోటి. చేపలు, రోహితాలు, పాఠీనం (చాలా దంతాలుండే చేప) తాబేలు, కారు మొసలి, పీత, ముత్యపుచిప్ప, శంఖం, నీటిపిల్లి (నీటిముంగిస), కప్ప చిప్ప, శఫరి (ఎగిరేచేప), చంద్రిక (ఇది మరొకజాతి చేప), మొసలి, శింశుమారం, తిమింగలం, రాజీ, చిలిచిమం — ఇవన్నీ వారిశయాలు.

వారిసాత్మ్యం — పాలు.

వారుణి — మద్యం.

వారుణీయంత్రం — మద్యం తయారుచేసే యంత్రం.

వార్జం — తామరపువ్వు.

వార్తం — ఆరోగ్యం.

వార్దలం — దుర్దినం.

వార్షిల — వడగళ్ళు.

వార్షులిక — అనేక రంధ్రాలు గల మట్టికుండ. ఇది పరిషేకస్వేదకర్మ కుపయోగించేది.

వాలుకాయంత్రం — ఔషధాలు వండే యంత్రా లలో ఇదొకటి. ఇది తెలియనివారు లేరు. అయితే, ఇటీవలివారు పూర్ణచంద్రోదయం మొద లైనవి వంటచేసేటప్పుడు దాకలో యిసుకకు బదులు పెంకుముక్కలు పోస్తున్నారు.

వాలుకాస్వేదం — వేడి యిసుకతో చెమట పుట్టించడం.

వాసగృహం — గృహమధ్యం.

వాసయోగం — సున్నం.

వాసిష్ఠం — రక్తం.

వాహం — మానపరిభాష. ద్రోణి.

వికం — అప్పుడు ఈనిన ఆవుపాలు. ఇదే ముర్రుపాలు.

వికరం — రోగం.

వికారం — ధాతువైషమ్యం. అంటే, వాతపి త్తకఫాలు ఎచ్చుతక్కువలుగా వుండడం. రస రక్తాదులు, సత్వ రజ స్తమోగుణాలున్ను ఎచ్చుతక్కువలుగా వుండడం. ఇదే వ్యాధి.

వికాలం — సాయంత్రం.

వికాశి — తద్గుణ విశిష్ట ద్రవ్యం. సంధిబంధాలు శిథిలంచేసేది వికాశి. అంటే, శరీరంలోని కీళ్లు సడలించి ధాతువులవల్ల ఓజస్సు వృద్ధి పొందించేది.

వికూణిక — ముక్కు.

వికృతి — వికారం, రోగం.

వికృష్టకాలం — చాలా దూరపు కాలం.

విక్రియ — వికారం.

విఘనం — భోజనం.

విఘ్నప్రియం — యవలతో చేసిన యవాగువు.

విచేష్టనం — విరుద్ధచేష్ట.

విచ్ఛర్దిక — వమనం.

విచ్ఛిత్తి — కషాయం.

విదారిగంధాదిగణం — శాలివర్ణి, నేలగుమ్ముడు, సహదేవ, నాగబల, పల్లేరు, పృశ్నిపర్ణి, పిల్లి తేగలు, పాలసుగంధి, నల్లసుగంధి, జీవకం, ఋషభకం, మహాసహ, క్షుద్రసహ, గోరింట, వాకుడు, పెద్దములక, గలిజేరు, ఆముదపువేరు, హంసపాది, దూలగొండిన్ని.

విదారీద్వయం — గుమ్ముడు, నేలగుమ్ముడు.

విదాహి — అతిదాహజనకవస్తువు.

విద్యాధరయంత్రం — ఔషధాలు వంటచేసే యంత్రాలలో యిదొకటి. ముఖ్యంగా యిది రస సంస్కారాని కుపయోగిస్తుంది. ఒక కుండలో పాదరసం పోసి, దానిమీద మరొకుండ ఊర్ధ్వ ముఖంగా వుంచి, పైదాని అడుగూ కింది దాని మూతీ కలిసినచోట చీలయిచ్చి పైకుండలో చల్లని నీరు పోసి, కిందకుండ పొయ్యిమీద ఉంచి అయిదు ఝాములు కింద మంటబెట్టి సాంగశీతలం అయిన తరవాత తీసుకునేది.

విద్యుత్ప్రియం — కంచు.

విధాత — మద్యం.

విధానం — వ్యవస్థ.

వినమనం — వంచడం.

వినసుడు — ముక్కిడి.

వినాశోన్ముఖం — పక్వం.

వినిపాతం — దైవాదివ్యసనం.

విపర్యయం — వ్యతిక్రమం.

విపాకం — భక్షించిన ద్రవ్యం జీర్ణం అయేట ప్పుడు పొందే పరిణామం. ఇది మధురవిపాకం. అమ్లవిపాకం, కటువిపాకం అని మూడువిధాలు.

**విపులరసం** – చెరకు.

**విపులస్రవ** – కలబంద.

**విప్రకృష్టం** – దూరం.

**విప్రతిపత్తి** – ప్రాతికూల్యం.

**విప్రత్యయం** – కార్యాకార్యాల్లోనూ, హితాహితాల్లోనూ, శుభాశుభాల్లోనూ విపరీతమైన అభినివేశం.

**విఫల** – మొగిలిచెట్టు.

**విభావరి** – పసుపు.

**విభావరీయుగం** – పసుపు, మానుపసుపు.

**విమానం** – సుగ్రం.

**విరజ** – విగతార్తవ.

**విరుద్ధం** – దేశకాల ప్రకృతిసంయోగ విపరీతం.

**విరుద్ధాశనం** – విరుద్ధవస్తువులు ఏకకాలంలో భుజించడం.

**విరుద్ధద్రవ్యాలు** – కొన్ని ద్రవ్యాలు కలిపి భుజిస్తే రసరక్తాది ధాతువులను చెరిచి ఆరోగ్యం భంగపరుస్తాయి. అవి గుణవిరుద్ధాలు, సంయోగ విరుద్ధాలు, సంస్కారవిరుద్ధాలు, దేశవిరుద్ధాలు, కాలవిరుద్ధాలు, మాత్రవిరుద్ధాలు, స్వభావవిరుద్ధాలు. అవి అనేక రకాలు.

**విరేచనం** – విరేచన ద్రవ్యాలన్నీ భూజాల గుణభూయిష్ఠాలు. భూజలాలు గురుత్వంవల్ల కిందికి వెళ్ళేవి. తెగడ, నేపాళం – ఇత్యాదులు విరేచవకరాలు. విరేచనౌషధం పాలు, రసం, కల్కం, కషాయం, శృతశీతం, చూర్ణం – అవి ఆరు రకాలు. ఇవి ఉత్తరోత్తరాలు లఘువులు.

**విరేచనద్రవ్యాలు** – తెగడ, కరకతాడి ఉసిరికలు, నేపాళపు గింజలు. నీలి, కానుగు, వస, కంపిల్లకం, వెర్రిపుచ్చ, చిన్నపాల, తీగకానుగు, గోగు, రేల, ద్రాక్ష, కొండాముదం, నీటి ప్రబ్బలి – ఇవన్నీ విరేచన ద్రవ్యాలు. వీటిలో తెగడ శ్రేష్ఠం.

**విరేచనాశ్రయాలు** – విరేచనకర ద్రవ్యాల పాలు, పట్ట, వేరు, ఆకు, పువ్వు, కాయలున్ను.

**విరేచనోపగవర్గం** – ద్రాక్షపండు, పెగ్గుమ్మడు, చిట్టీత, కరక, ఉసిరిక, తాడికాయ, పెద్దరేగు, పిన్నరేగు, కోలరేగు, రేగు, గోగున్ను.

**విలాసిని** – పసుపు.

**విలేపి** – యవాగువులలో ఒకరకం. కొంచెం మెతుకులుండి గంజి యెక్కువగా వుండేది.

**విలోడితం** – నాలుగోవంతు నీరుచేర్చి మథించిన తక్రం.

**వివర్ధనం** – నెయ్యి.

**వివాహకాలం** – పురుషునకు వివాహవయస్సు 25 సంవత్సరాలు. స్త్రీకి 12 ఈ లోపున వివాహం చెయ్యగూడదు.

**వివిధాయువులు** – 1. సుఖాయువు, 2. అసుఖాయువు, 3. హితాయువు, 4. అహితాయువు – అని ఆయువు నాలుగు విధాలు.

**విశల్యఘ్నమర్మలు** – ఉత్క్షేపాలు రెండు, స్థపని ఒకటి – ఈ మూడూ విశల్యఘ్నమర్మలు. వీటిమీద దెబ్బతగిలితే శల్యాలకు అపాయం.

**విశేషగుణాలు** – ఆకాశమూ, వాయువూ, అగ్నీ, జలమూ, పృథివీ – వరసగా యీ అయిదు భూతాలనూ ప్రధానంగా ఆశ్రయించి వుండే శబ్దమూ, స్పర్శమూ, రూపము, రసమూ, గంధమూ – ఇవి విశేషగుణాలు.

**విశేషరసాలు** – రసం అంటే నాలుకతో గ్రహించతగ్గ రుచి. అందులో భేదాలున్నాయి. అవి మధురం (తీపి) అమ్లం (పులుపు), లవణం (ఉప్పు), కటు (కారం), తిక్తం (చేదు), కషాయం (వగరు) అని ఆరు విధాలు.

**విశోధనీబీజం** – నేపాళాలు.

**విశ్రామం** – విశ్రమించడం, అలసట తీర్చుకోడం.

**విశ్వకద్రువు** – వేటలో నేర్పుగల కుక్క.

**విశ్వగ్వాయువు** – సుడిగాలి.

**విశ్వామిత్రప్రియం** – కొబ్బరిచెట్టు.

**విషఘ్నవర్గం** – పసుపు, మంజిష్ఠ, సన్నరాష్ఠ, చిన్న ఏలకులు, వల్ల తెగడ, చందనం, చిల్లగింజలు, దిరిసెన, వావిలి, విరిగిచెట్టున్ను.

**విషదంశం** – పిల్లి.

**విషమగ్రాహి** – ఏకదేశగ్రాహి.

**విషమభోజనం** – ఎచ్చుతక్కువలుగా భుజించడం.

**విషమవేగం** – న్యూనాధికవేగం.

**విషమాగ్ని** – సమంగా లేని జఠరాగ్ని.

**విషమాశనం** – అకాలంలో ఎక్కువగా అయినా, తక్కువగా అయినా భుజించడం.

**విష్కలనం** – భోజనం.

**విష్కిరాలు** – లావుకపిట్ట. వర్తికపిట్ట, వార్తీకపిట్ట, రక్తవర్మకం, కుక్కుభపక్షి కపింజలం,

ఉపచక్రం, చకోరం, కురుబాహువు, తీతువుపిట్ట, కృకరం, నెమలి, కోడి, వాలుకొంగ, బెగ్గురుపక్షి గిరివర్తికం, శారపదం, ఇంద్రాభం, ఆడహంసలు – ఇవి వికిరపక్షులు. వికిరం అంటే మట్టి, పెంటలూ గోళ్ళతో చిమ్మి, వాటిలో వుండే పురుగులను భక్షించడం.

విష్ణుపదం – ఆకాశం.

విష్ణుప్రియ/విష్ణువల్లభ – తులసిచెట్టు.

విసర్గకాలం – అనగా దక్షిణాయనం. ఈ కాలంలో సూర్యుడు బలహీనుడూ, చంద్రుడు, బలవంతుడూ అయి వుంటారు. అందువల్ల, ప్రాణికోటికి దినదినమూ బలం యెక్కువ అవుతుంది. ఇది విసర్గకాలం.

విస్రావణం – వ్రణవేదన తగ్గడానికీ, ఆ వ్రణం పెరిగి చితకడానికీ చేసే చికిత్సావిశేషం.

వీరుత్తు – చెట్లమీద పాకి గాలికి కదిలే ద్రాక్ష మొదలైన తీగలు.

వీర్యం – ఇది ఉష్ణం, శీతం అని రెండు విధాలు. ద్రవ్యాలలో శీత వీర్యాలు కొన్ని, ఉష్ణవీర్యాలు కొన్నిన్ని.

వృథార్తవ – గొడ్రాలు.

వృద్ధ – 50 యేళ్ళు దాటిన స్త్రీ. వృద్ధ సురతోత్సవవర్జిత. సంభోగం విషయమై బాల ప్రాణధాత్రి. తరుణి ప్రాణధారిణి. ప్రౌఢ ముసలితనం కలిగిస్తుంది. వృద్ధ మరణమే కలిగిస్తుంది.

వృషస్యంతి – అతికాముకురాలు.

వృష్యం – మనస్సునకు హర్షమూ, ఆరోగ్యవంతునకు ఓజస్సూ కలిగించేది. వీర్యవృద్ధికరం అన్నమాట.

వృక్షాయుర్వేదం – చెట్లు నాటడం, పెంచడం ఇత్యాదులు వివరించే శాస్త్రం. వాటికి కలిగే రోగాలు నివారించే ప్రక్రియలు కలదిన్ని. ఇది అగ్నిపురాణాంతర్గతం.

వేగధారణం/వేగనిరోధం – మలం, మూత్రం, అపానవాతం, తుమ్ము, దగ్గు, నిద్ర, ఆకలి, ఆవులింత, వాంతి, రేతస్సు – ఇత్యాదుల వేగం అడ్డగించడం. ఇది మంచిదికాదు. వీటిలో ఒక్కొక్కటి నిగ్రహిస్తే ఒక్కొక్క వ్యాధి అంకురిస్తుంది.

వేగోదీరణం – బలవంతాన మలమూత్రాదులు విడవడం. వాంతి చేసుకోడం. ఇత్యాదులు. ఇదిన్నీ ఆరోగ్యభంగకరమే .

వేతసపత్రికం – వ్యధనార్థమైన శస్త్రవిశేషం.

వేదనాస్థాపనవర్గం – ఏపిచెట్టు, కాయఫలం, కడిమిచెట్టు, తామరగడ్డ, కలవపువ్వు, బూరుగుబంక, దిరిసెనపట్ట, నీటిప్రబ్బలి, కూతురు బుడమ, అశోకమున్ను.

వేదిని – చర్మం. ఇది అయిదోపొర. వ్రీహిలో అయిదోవంతు దళసరిగా ఉంటుంది. కుష్ఠు, విసర్పి – ఇత్యాది వ్యాధులకు స్థానం.

వేసవారం – సొంటి, మిరియాలు, పిప్పళ్ళు, ధనియాలు, జీలకర్ర, దానిమ్మ, మోడి – ఇవన్నీ చేరి వేసవారం.

వేసవారగణం – జీలకర్ర, మిరియాలు, సొంటి, గ్రంధికం, ధనియాలు, పసుపు, పిప్పళ్ళు, దానిమ్మ చెరకున్ను.

వైకల్యకరమర్మలు – లోహితాక్షాలు, జానువులు, ఊరువులు, కూర్చాలు, విటపాలు, కూర్పరాలు, కుకుందరాలు, కక్షధరాలు, విధురాలు, కృకాటికలు, అంసాలు, అంసఫలకాలు అవి యివి నలభై నాలుగు. వీటిమీద దెబ్బతగిలితే అంగవైకల్యం ఏర్పడుతుంది.

వైకారికం – త్రివిధ అహంకారాలలో ఇదొకటి. ఇది సాత్వికం.

వైతంసికుడు – మాంసం అమ్మేవాడు.

వైతరణవస్తి – నిరూహవస్తులలో ఇదొకటి.

వైదలవర్గం – పప్పు ధాన్యాలు. పెసలు, అడవి పెసలు, బటాణీలు, మసుర, సెనగలు, మినుములు, కందులు మొదలైనవి.

వైద్యకం – అష్టాంగ చికిత్సా శాస్త్రం. వైద్యుని వృత్తిన్ని.

వైద్యుడు – ఆయుర్వేదం క్షుణ్ణంగా తెలుసుకుని, చికిత్సా నైపుణ్యం అలవరచుకొన్నవాడు. వైద్యుడు వేదవేదాంగాలు, ధర్మశాస్త్రాలున్నూ కూడా చదువుకోవాలి.

వైద్యకవృత్తులు – అంటే వైద్యున కుండవలసిన ముఖ్య లక్షణాలు. ఇవి నాలుగు. 1. మైత్రి. 2. కారుణ్యం. 3. ప్రీతి. 4. ఉపేక్ష. మైత్రి అంటే రోగి యెడల మిత్రభావం. కారుణ్యం అంటే రోగాలతో బాధపడుతున్న రోగులకు సుఖం కలిగించాలన్న దయ. ప్రీతి అంటే సాధ్యవ్యాధులకు చికిత్స చెయ్యాలనే ఇచ్ఛ. ఉపేక్ష అంటే అసాధ్యవ్యాధులు విడిచిపెట్టడం.

వైద్యప్రశ్నలు – ఒక వైద్యుడు మరో వైద్యుణ్ణి కలుసుకున్నప్పుడు అతని శక్తిసామర్థ్యాలు తెలు

సుకోవాలంటే వెంటనే అడగవలసిన ప్రశ్నలు. అవి ఎనిమిది. 1. తంత్రం అంటే యేమిటి? 2. తంత్రార్థం యెట్టిది? 3. స్థానాలేమిటి? 4. స్థానార్థాలెలాంటివి? 5. అధ్యాయాలే మిటి? 6. అధ్యాయార్థాలెలాంటివి? 7. ప్రశ్న లేమిటి? 8. ప్రశ్నార్థాలెలాంటివి? అవి.

**వైద్యమాని** – ఏమీ తెలియకపోయినా తాను వైద్యుడ నమకుంటూ గర్వించి తిరిగేవాడు.

**వైద్యవృత్తులు** – వైద్యక వృత్తులు.

**వ్యజనం** – వీవన.

**వ్యంజనం** – పప్పు, కూరలు మొదలైనవి.

**వ్యతిక్రమం** – క్రమవిపర్యయం.

**వ్యవసాయం** – నిశ్చయబుద్ధి.

**వ్యవాయం** – స్త్రీసేవ. సంభోగం.

**వ్యవాయి** – వ్యాపించే స్వభావం గలది.

**వ్యవాయ్యౌషధం** – ముందు శరీరం అంతా వ్యాపించి, తరవాత పక్వం అవుతుంది. ఇది వ్యవాయి. గంజాయి, నల్లమందు మొదలైనవి యీ పని చేస్తాయి.

**వ్యాఖ్యానం** – గూఢార్థాలు స్పష్టం చెయ్యడం.

**వ్యాఘ్రీయుగం** – వాకుడు, పెద్దములక.

**వ్యాధి** – జబ్బు. ఇది శారీర, ఆగంతు, మానస, స్వాభావిక భేదంతో నాలుగు విధాలు. అభిఘాత జన్యాలు ఆగంతుకాలు. అన్నపాన మూలాలు శారీరికాలు. ఇవి వాతాది వైషమ్య మూలాలున్నూ. క్రోధం, ఇచ్ఛ, ద్వేషం ఇత్యాదుల వల్ల వచ్చేవి మానసికాలు. క్షుత్పిపాసాదికాలు స్వాభావికాలు. ఈ వ్యాధులు ఏడు. 1. ఆదిబల ప్రవృత్తాలు, 2. జన్మబలప్రవృత్తాలు, 3. దోషబల ప్రవృత్తాలు, 4. సంఘాతబల ప్రవృత్తాలు, 5. కాలబల ప్రవృత్తాలు, 6. దైవ బల ప్రవృత్తాలు, 7. స్వభావబల ప్రవృత్తాలున్నూ. హేతువు, సంప్రాప్తి, పూర్వరూపం, లక్షణం, ఉపశయం అనే అయిదు ఉపాయాలతో రోగం తెలుసుకోవచ్చు.

**వ్యానవాయువు** – శరీరంలో వుండే పంచవాయువులలోను ఒకటి. ఇది శరీరం అంతటా చరిస్తూ వుంటుంది.

**వ్యాపాదం** – ద్రోహచింత.

**వ్యామం** – చేతులు అడ్డంగా చాపితే – వాటిమధ్య ఉండే అంతరం వ్యామం.

**వ్యాయామం** – వేగకృద్వ్యాపారం.

**వ్రణలక్షణం** – ఇవి అయిదు. గంధం, వర్ణం, స్రావం, వేదనం, ఆకృతి అని.

**వ్రణస్థానం** – అంటే కురుపులు బయలుదేరే స్థానాలు. ఇవి – చర్మం, మాంసం, శిరలు, స్నాయువులు, ఎముకలు, కీళ్ళు, కోష్ఠం, మర్మస్థానమున్నూ.

**వ్రణస్రావం** – కురుపులు చితికి స్రవించే ద్రవద్రవ్యం. ఇది పధ్నాలుగు రకాలు. లసీక, జలం, చీము, రక్తం ఇత్యాదులు.

**వ్రణోపక్రమం** – వ్రణచికిత్స, అపతర్పణం, ఆలేపం, పరిషేకం, అభ్యంగం, స్వేదం, ఉపనాహం, పాచనం, విస్రావనం, స్నేహం, వమనం, విరేచనం, ఛేదనం, భేదనం, దారణం, లేఖనం, ఏషణం, అహరణం, వ్యధనం, సీవనం, సంధానం, పీడనం, శోణితాస్థాపనం, నిర్వాహణం, ఉత్కారిక, కషాయం, వర్తి, కల్కం, ఘృతం, తైలం, రసక్రియ, అవచూర్ణనం, వ్రణధూపనం, ఉత్సాదనం, అవగాహనం, మృదుకర్మ, దారణకర్మ, క్షారకర్మ, అగ్నికర్మ, కృష్ణకర్మ, పాండుకర్మ, ప్రతిసారణం, రోమసంజననం, లోమాపహరణం, వస్తికర్మ, ఉత్తర వస్తికర్మ, బంధం, పత్రదానం, కృమిఘ్నం, బృంహణం, విషఘ్నం, శిరోవిరేచనం, నస్యం, కవలగ్రహం, ధారణం, ధూమం ఇత్యాదిగా ఇది అరవై విధాలు.

**వ్రతాదేశం** – ఉపనయనం.

## శ

**శంకరస్వేదం** – ఆమవాతహరమైన స్వేదవిశేషం.

**శంభోఃకంఠవిభూషణం** – విషం.

**శకునిప్రప** – పక్షులు నీరు తాగడానికి ఏర్పరచిన స్థలం. తొట్టి మొదలైనవి.

**శక్రమూర్ధ** – పుట్ట.

**శతపత్రిక** – నూరు రేకులుగల పువ్వు. చేమంతిపువ్వు.

**శతాయుష్కుడు** – మనుష్యుడు.

**శతావర్యాదిపంచమూలం** – పిల్లితేగలు, నేల గుమ్ముడు, జీవంతి, క్షీరకాకోళి, జీవకమున్నూ.

**శతాహ్వాద్వయం** – సోపు, పెద్దజీలకర్ర.

**శబ్దగ్రహం/శబ్దాధిష్ఠానం** – చెవి.

**శఘం** – మనస్థైర్యం.

**శమనం** – త్రిదోషాలకూ సమత్వం కలిగించేది. సంశమనం చూడు.

**శమనగండూషం** – మధురాలూ, శీతలాలూ అయిన కషాయాదులు పుక్కిలించడం. ఇది పిత్తం ప్రకోపించి వున్నప్పుడు చెయ్యతగ్గది.

**శమనవస్తి** – ప్రేంకణం, యష్టిమధుకం, తుంగ గడ్డలు, రసాంజనం – ఇవి సమభాగాలుగా గ్రహించి పాలతో మెత్తగా నూరి వస్తి ప్రయోగం చేసేది. ఇది దోషాలను శమింపచేస్తుంది కనక శమనవస్తి.

**శమనసప్తకం** – వాతాదిదోషాలను లోపలే వుంచి, సమంగా వుంటే ఏమీ చెయ్యక, ఎచ్చుతక్కువలుగా వుంటే అన్నిటినీ సమస్థితికి తేవడం శమనం. ఇది పాచనం, దీపనం, క్షున్నిగ్రహం, తృష్ణానిగ్రహం, వ్యాయామం, ఆతపం, మారుతం – అని యేడు విధాలు.

**శరజం** – వెన్న, అప్పుడు కాచిన నెయ్యిన్ని.

**శరదుదాశయం** – శరత్కాలిక సరోవరం.

**శరాదిపంచమూలం** – రెల్లు, చెరకు, దర్భ, కాశ, శాలిధాన్యం – వీటి వేళ్ళు.

**శరావం** – మాన పరిభాష. ఎనిమిది పలాలు.

**శరీరం** – దేహం. శిథిలం అయేది శరీరం. ఇది పంచభూత వికారాత్మకమూ, చేతనాధిష్ఠానమూ, ఆత్మకు భోగగృహమున్ను. శరీరస్థితి ననుసరించి ఎనిమిది రకాల పురుషులు నిందితులు. వారు 1. బాగా పొడగరి. 2. మిక్కిలీ పొట్టివాడు. 3. అతిలోముడు. 4. అలోముడు. 5. కారునలుపువాడు. 6. సున్నంపూసినట్టు చాలా తెల్లగా వుండేవాడు. 7. పొణకబుట్టలాగ చాలా లావుగా వుండేవాడు. 8. పూతికపుల్లలాగ మిక్కిలీ సన్నంగా వుండేవాడున్ను.

**శరీరదోషాలు** – వాతం, పిత్తం, కఫమున్ను.

**శరీరవిచయం** – శారీరవిజ్ఞానం.

**శరీరావరణం** – చర్మం.

**శరీరాస్థి** – కంకాళం.

**శరీరోపస్తంభం** – శరీరం ధరించే స్తంభం. ఇది ఆహారం, నిద్ర, బ్రహ్మచర్యం అని మూడు విధాలు.

**శర్కరోదకం** – చక్కెరతో పానకం చేసేది. అందులో యుక్తప్రమాణంగా ఏలకులు, లవంగాలు, మిరియాలు, పచ్చకర్పూరం – ఇవి చూర్ణించి కలిపేది. ఇది శర్కరోదకం. ఇది శుక్రలం, బల్యం, శీతలం, రుచ్యం, లఘువు, వాతపిత్త తృష్ణాశమనం, రక్తదోషహరమున్ను. వాంతి, మూర్ఛ, దాహం – ఇవి హరిస్తుంది.

**శర్వరీద్వయం** – పసుపు, మానుపసుపు.

**శలాక** – కళ్ళలో కాటుక పెట్టుకునే సాధనం.

**శశివర్ణ** – పొట్లతీగ.

**శశిరేఖ** – తిప్పతీగ.

**శస్త్రం** – దుష్టాంగాలు ఖండించడాని కుపయోగించే కత్తి. ఇది – మండలాగ్రం, కరపత్రం, వృద్ధిపత్రం, నఖశస్త్రం, ముద్రిక, ఉత్పల పత్రం, అర్ధధారం, సూచి, కుశపత్రం, శరారీముఖం, ఆటీముఖం, అంతర్ముఖం, త్రికూర్చకం, కురారిక, వ్రీహిముఖం, ఆరాముఖం, వేతసపత్రం, బడిశం, దంతశంకు, ఏషణి – అవి ఇరవై రకాలు. ఇవి ఛేదం మొదలైన ఎనిమిది రకాల కర్మ కుపయోగిస్తాయి. ఆ కర్మలు – ఛేదనం, లేఖనం, భేదనం, విస్రావణం, వ్యధనం, ఆహరణం, ఏషణం అనులోమ్యం అని యెనిమిది. సుగ్రహం, సులోహం, సుధారం, సురూపత – ఇవి శస్త్రగుణాలు. వక్రత, కుంఠత, ఖండత, ఖరధారత, అతిస్థూలత, అతిదీర్ఘత, అతిహ్రస్వత – ఇవి శస్త్రదోషాలు. మాసూరి, .అర్ధమాసూరి, కైశికి, అర్ధకైశికి – ఇవి నాలుగూ శస్త్రధార (పదును) భేదాలు. ఇవి నూరేరాళ్ళు మినుముల రంగుగల నల్లరాయి, శాల్మలీఫలకం అనేదిన్ని. ఇవి క్షారం, ఉదకం, తైలం – వీటితో నూరేది.

**శస్త్రకర్మ** – ఇది ఛేద్యం, భేద్యం, వేధ్యం, ఏష్యం, ఆహార్యం, విశ్రావ్యం, సీవ్యం, లేఖ్యం – అని యెనిమిది విధాలు.

**శస్త్రప్రణిధానం** – ప్రకారాంతర త్రివిధౌషధాలలో ఇదొకటి.

**శాకం** – కూర, పత్రం, పుష్పం, ఫలం, కాడ, దుంప, సంస్వేదజం అని యిది ఆరు విధాలు. పత్రం, పుష్పం, ఫలం, దుంప అని అత్రి నాలుగు విధాలన్నాడు.

**శాకటీనం** – మాన పరిభాష. 20 తులాలు. అంటే 2000 పలాలు. అంటే బండి బరువు.

**శాకయోగ్యం** – ధనియాలు.

**శాకాంగం** – మిరియాలు.

**శాణం** – మాన పరిభాష. నాలుగు మాషాల యెత్తు.

**శాతపత్రకం** – వెన్నెల.

**శాపటికం** – నెమలి.

**శాయిక** – నిద్ర.

**శారదికం** – శరత్కాలీనరోగం.

**శారిబాదిగణం** – సుగంధి, పట్టివేళ్ళు, పెగ్గు మ్పుడు, చందనం, రక్తచందనం, యష్టిమధుకం, ఖర్జూరమున్ను.

**శారిబాద్వయం** – శ్యామ, అనంత.

**శాలాక్యం** – ఆయుర్వేదీయతంత్రా లెనిమిదిం టిలో ఇదొకటి. ఊర్ధ్వజత్రురోగాలు – అంటే శిరోరోగాలు, నేత్రరోగాలు, కర్ణరోగాలు, భ్రూ, శంఖ, కంఠ, మధ్యలయందు పుట్టే వ్యాధులూ తగ్గించే నాసావర్తి; అంజనం, అభ్యంగం, ముఖగండూషం మొదలైన చికిత్సాప్రక్రియలు వివరించే అధ్యాయం.

**శికతావలంబనం** – నీరు చల్లబరిచే ఉపాయం.

**శిఖరిణి** – ఇదొక సంధానవిశేషం. పెరుగు 32 పలాలు, కలకండ 8 పలాలు, మిరియాలు, దాల్చిని, ఏలకులు – ఇవి అరపలం చొప్పున. తేనె, నెయ్యి – ఇవి పావుపలం చొప్పున. ద్రవ్యాలన్నీ చూర్ణించి, వస్త్రగాలితమున్ను చేసు కుని పెరుగు, తేనె, నెయ్యి – వీటిలో కలిపి, పచ్చకర్పూరంతో పరిమళింపచేసుకుని, కుండతో నీడలో ఉంచాలి. ఇది అనేక రకాలుగా వుంది.

**శిఖావృక్షం** – దీపపుశమ్మీ.

**శిఖిధ్వజం** – పొగ.

**శిరఃఫలం** – కొబ్బరిచెట్టు.

**శిరోవిరేచనం** – నశ్యద్రవ్యం.

**శిరోవిరేచనద్రవ్యాలు** – ఉత్తరేణిబియ్యం, పిప్పళ్లు, మిరియాలు, వాయువిడంగాలు, మున గవిత్తులు, ఆవాలు, తుమికివిత్తులు, జీలకర్ర, వాయింటవిత్తులు, వరగోగు గింజలు, ఏల కులు, రేణుకలు, నల్లజీలకర్ర, పిన్నయేలకులు, తులసివిత్తులు, తెల్లదింటెన, నల్లతులసి, అడవి తులసి, దిరిసెనగింజలు, ఉల్లిపాయలు, పసుపు, మానుపసుపు, సైంధవలవణం, సముద్రలవణం, మాల్కంగిని, సొంటిన్ని.

**శిరోవిరేచనధూమం** – తెల్లదింటెన, మాల్కం గిని, హరిదళం, మణిశిల, అగరు, లవంగపత్రి మొదలైన సుగంధద్రవ్యాలతో చేసిన ధూమ వర్తి. ఇది ధూమయంత్రంలో వుంచి నిప్పు ముట్టించి పొగ పీల్చేది.

**శిరోవిరేచననశ్యం** – శిరస్సున వుండే దోషాలు బయటికి వెడలిస్తుంది. కనక శిరోవిరేచననశ్యం అనిపేరు. సొంటి మొదలైన తీక్ష్ణ ద్రవ్యాలు. కల్కమూ కషాయమూ చేసి, వాటితో చేసే నశ్యకర్మ యిది. ఇదే అవపీడన నశ్యం.

**శిరోవిరేచనీయవర్గం** – మాల్కంగిని, క్షవకం, మిరియాలు, పిప్పళ్ళు, వాయువిడంగాలు, మునగ, ఆవాలు, ఉత్తరేణిబియ్యం, తెల్లదిం టెన, నల్లదింటెన.

**శిలాపట్టం** – సన్నికల్లు.

**శివతేజం** – పాదరసం.

**శివద్రుమం** – మారేడుచెట్టు.

**శివద్విష్ట** – మొగలిచెట్టు.

**శివధూపం** – మహిషాక్షి గుగ్గులు.

**శివశితం** – కఫం.

**శివాప్రియం** – మేక.

**శివాలయం** – ఎర్రతులసిచెట్టు.

**శిశిరద్వయం** – చందనం, రక్తచందనమున్ను.

**శిశుప్రియం** – బెల్లం.

**శీతకషాయం** – రాత్రి ఆరు పలాల జలంలో ఒక పలం చూర్ణం కలిపి ఉంచితే తెల్లవారేటప్పటికి ఆ ద్రవ్యంలో వుండే శక్తి అంతా ఆ జలానికి సంక్రమిస్తుంది. అప్పుడు తేరిన నీరు తీసుకునేది. ఇదే శీతకషాయం.

**శీతకుంభం** – కరవీరవృక్షం.

**శీతగంధం** – శ్రీఖండచందనం.

**శీతచంపకం** – అద్దం.

**శీతప్రశమనవర్గం** – గ్రంధితగరం, అగురుచెక్క, ధనియాలు, సొంటి, వాము, వస, వాకుడు, కూరనెల్లి, దుందిలం, పిప్పళ్ళున్ను.

**శీతవీర్యం** – చలవచేసే ద్రవ్యం.

**శీతీకరణం** – ద్రవ్యద్రవ్యానికి మిక్కిలీ శీతలత్వం కలిగించే ఉపాయం. ఇది 1. ప్రవాతస్థాపనం, 2. ఉదక ప్రక్షేపణం, 3. యష్టికాభ్రామణం, 4. వ్యజనం, 5. వారుకాప్రక్షేపణం. 6. శిక్యావలంబనం అని అనేక విధాలు.

**శీతోత్తమం** – నీరు.

**శీధువు** – మద్యం.

**శుకవల్లభం** – దానిమ్మచెట్టు.

**శుక్రం** – పురుషుల వీర్యం. ఇది మజ్జాసారం. రసాదిధాతువులు పిత్తతాపంవల్ల పాచితాలై ఒక్క

నెల దినాలకు శుక్రత్వం పొందుతాయి. దీనిపని గర్భోత్పాదనం.

**శుక్రజనవర్గం** – జీవకం, ఋషభకం, కాకోళి, క్షీరకాకోళి, అడవి పెసర, కారుమినుము, మేద, పిల్లిపీచర, జటామాంసి, కర్కాటక, శృంగిన్ని.

**శుక్రభుక్కు** – నెమలి.

**శుక్రలం** – శుక్రవృద్ధిచేసే ద్రవ్యం.

**శుక్రదోషాలు** – ఇవి ఎనిమిది. 1. తను (స్వల్పంగా వుండడం), 2. శుష్కం (ఎండిపోడం), 3. ఫేనిలం (నురుగుతో వుండడం), 4. అశ్వేతం (తెల్లగా వుండకపోడం), 5. పూతి (దుర్వాసనగా వుండడం), 6. అతిపిచ్ఛిలం (మిక్కిలీ జిగటగా వుండడం), 7. అన్యధాతూపవాతం (ఇతర ధాతువులతో కలిసివుండడం), 8. అవసాది (నీటిలో మునిగిపోవడం).

**శుక్రశోధనవర్గం** – చెంగల్వకోష్టు, కూతురుబుడమ కాయఫలం, సముద్రపునురుగు, కడిమి బంక, చెరకు, గొలిమిడి, నీరుగొబ్బి, వకపుష్పం, వట్టివేళ్లున్ను.

**శుక్రవహస్రోతస్సు** – శుక్రనాడి. దీనిమూలం వృషణాలూ, మేఢ్రమున్ను

**శుక్రసంగం** – శుక్రావరోధం.

**శుక్లోపల** – చక్కెర.

**శుద్ధాంతపాలకుడు** – నపుంసకుడు.

**శుద్ధార్తవం** – ఆర్తవం అంటే స్త్రీల ఋతురక్తం. అది కుందేటి రక్తంలాగాని, లక్కలాగాని ఎర్రగావుండి, బట్టకు రంగు అంటకుండా వుంటే అది శుద్ధంగా వుందని తెలుసుకోవాలి.

**శుష్కార్ద్రం** – సొంటి.

**శూద్రప్రియం** – వెల్లుల్లి.

**శూర్పం** – మాన పరిభాష – రెండు ద్రోణాలు.

**శూలప్రశమనవర్గం** – పిప్పళ్ళు, పిప్పలిమోడి, చవ్యం, చిత్రమూలం, మిరియాలు, వాము, వాయింట, జీలకర్ర, సముద్రపు నురుగున్ను.

**శృంగయంత్రం** – రక్తమోక్షణం చేసే సాధనం. ఇది కొమ్ములతో చేస్తారు.

**శృతశీతజలం** – కాగి చల్లారిన నీరు.

**శైత్యం** – శీతలత్వం.

**శైలనిర్యాసం** – శిలాజిత్తు.

**శైవం** – ఉమ్మెత్తచెట్టు.

**శోణితసంభవం** – మాంసం.

**శోణితస్థాపనవర్గం** – తేనె, యష్టిమధుకం, కుంకుమపువ్వు, బూరుగుబంక, కుండపెంకు, లొద్దుగు, గైరికం, ప్రేంకణం, చక్కెర, వరిపేలాలున్ను.

**శోధనం** – సంశోధనౌషధం చూడు.

**శోధనగండూషం** – కట్వమ్లరసాలు కలవీ, ఉష్ణాలూ అయిన కషాయాదులు పుక్కిలించడం. ఇది కఫం ప్రకోపించినప్పుడు చెయ్యతగ్గది.

**శోధనపంచకం** – వాతాది దోషాలు బయటికి వెడలించడం శోధనం. ఇది నిరూహం, వమనం, కాయవిరేచనం, శిరోవిరేచనం, రక్తమోచనం అని అయిదు విధాలు.

**శోధనీబీజం** – నేపాళాలు.

**శోధనవస్తి** – తెగడ మొదలైన విరేచనకర ద్రవ్యాలు కషాయం కాచి, అందులో ఆ ద్రవ్యాల కల్కం, చమురు, సైంధవ లవణం కలుపుకుని కవ్వంతో చిలికి దానితో వస్తిప్రయోగం చేసేది. ఇది శోధనవస్తి.

**శోధనవృక్షాలు** – ఇవి ఆరు. వీటిలో జెముడు, జిల్లేడు, అశ్మంతకం – ఈ మూడున్నూ ఒక వర్గం. అశ్మంతకం వమనకర్మకూ, జెముడు పాలు విరేచనకర్మకూ, జిల్లేడుపాలు వమనవిరేచనకర్మలకూ ఉపయోగించతగ్గవి. నెమలియడుగుచెట్టు, మునగచెట్టు, లొద్దుగుచెట్టు – ఈ మూడున్నూ మరొక వర్గం. వీటిలో, నెమలియడుగు (కామగు) లొద్దుగు పట్టలు విరేచనకర్మ కుపయోగించ తగ్గవి. మునగపట్ట విసర్పం, శోధ, అర్శస్సు, కుష్ఠు, విద్రధి, గండమాల, అలజి – వీటికి ఉపయోగించతగ్గది. మొత్తం యీ ఆరూ శోధనవృక్షాలు.

**శౌచవిధి** – మూత్రపురీషోత్సర్గాదికం. దినచర్యకు సంబంధించినది.

**శ్మశ్రు** – పురుషుని మొగాన ఉండే మీసాలు. ఇవి తీసివేసుకోడం పౌష్టికం, బల్యం, ఆయుష్యం, శౌచం, రూపవైభవమున్ను.

**శ్మశ్రుముఖి** – మీసాలుగల ఆడది.

**శ్మశ్రుశేఖరం** – కొబ్బరిచెట్టు.

**శ్యామ** – నడివయస్సులోఉన్న స్త్రీ.

**శ్యామకంఠం** – నెమలి.

**శ్యామాదివర్గం** – శ్యామ, మహాశ్యామ, తెగడ, నేపాళాలు, శంఖిని, తిల్వకం, కంపిల్లం, కరంభకం,

క్రముకం, పుత్రశ్రేణి, గవాక్షి కరంజద్వయం, రాజవృక్షం, గుడూచి, సప్తల, ఛాగలాంత్రి, సుర, సువర్ణక్షీరిన్ని, ఈ వర్గం గుల్మం, ఆనాహం, ఉదావర్తం – ఇవి పోగొడుతుంది.

**శ్రమహరవర్గం** – ద్రాక్షపండు, ఖర్జూరం, చారపప్పు, రేగుపండు, దానిమ్మపండు, బ్రహ్మమేడి, చిట్టీతపండు, చెరుకు, యవలు, షష్టికధాన్యమున్ను.

**శ్రవణవిభ్రమం** – ఒకటి మరొకటిగా వినడం.

**శ్రావణీద్వయం** – బోడతరం, పెద్దబోడతరమున్ను.

**శ్రీఘనం** – పెరుగు.

**శ్రీపుత్రం** – గుర్రం.

**శ్రీపుష్పం** – లవంగాలు.

**శ్రీభ్రాత** – గుర్రం.

**శ్రీవృక్షం** – అశ్వత్థవృక్షం.

**శ్రేష్మం** – ఆవుపాలు.

**శ్లక్ష్ణం** – మెత్తనిది.

**శ్లేష్మం** – శరీరంలో వుండే త్రిదోషాలలో వొకటి. ఇది మాధుర్య, గౌరవ, శైత్య, పైచ్ఛిల్య గుణయుక్తం. దీనికి సమానయోని మధురరసం. దీనికి స్థానం ఆమాశయం.

**శ్లేష్మపంచకం** – ఆలంబకం, క్లేదకం, బోధకం, తర్పకం, శ్లేషకం అని కఫం అయిదు రకాలు.

**శ్లేష్మలం** – శ్లేష్మకారి.

**శ్లేష్మస్థానాలు** – వక్షస్థలం, శిరస్సు, కంఠం, కీళ్ళు, ఆమాశయం, మేదస్సు – ఇవి కఫస్థానాలు. వీటిలో రొమ్ము ప్రధానస్థానం.

**శ్వధూర్తం** – నక్క.

**శ్వనకం** – కుక్క.

**శ్వయథుహరవర్గం** – పాదిరి, కూరవెల్లి, దుందిలం, మారేడు, నేల గుమ్ముడు, వాకుడు, ములక, కోలపొన్న, మయ్యూకుపొన్న, పల్లేరున్ను.

**శ్వాసహరవర్గం** – కచ్చూరాలు, పుష్కరమూలం, అమ్లవేతసం, ఏలకలు, ఇంగువ, అగురు, తులసి, నేలవుసిరిక, పాలకూర, చంద్ర చెట్టున్ను.

**శ్వాసహారి** – నిద్ర.

**శ్వేతటంకణం** – పటిక.

## ష

**షట్కం (కటుషట్కం)** – సొంటి, పిప్పలి, మిరియాలు, చవ్యం, చిత్రమూలం, పిప్పలిమూలమున్ను.

**షడంగాలు** – మొత్తం శరీరం అంతా ఆరు భాగాలు. ఆ భాగాలే అంగాలు. అవి – రెండు చేతులూ, రెండుకాళ్ళూ, మధ్యమూ, శిరస్సున్ను.

**షడూషణం** – మిరియాలు, పిప్పళ్ళు, పిప్పలిమోడి, చవ్యం, చిత్రమూలం, సొంటిన్ని.

**షడ్రసాలు** – తీపి, పులుపు, ఉప్పు, చేదు, కారం, వగరున్ను, (మధురామ్ల లవణ కటుతిక్త కషాయాలు).

**షళ్ళవణం** – ఆరు లవణాలు. కాచ లవణం, సైంధవ లవణం, సాముద్ర లవణం, బిడాలవణం, సౌవర్చలవణం, మృల్లవణమున్ను.

**షాడవం** – మధురామ్ల రససంయోగవిశేషం.

**షోడశావర్తం** – శంఖం.

**షోడశిక** – మాన పరిభాష. ఒక పలం. 8 తులాలు.

## స

**సంకరస్వేదం** – స్వేదకర్మలలో ఇదొకటి. పిండస్వేదంలో చెప్పిన ఔషధం మద్దవస్త్రంలో వుంచిఅయినా, ప్రత్యేకంగా అయినా, రోగికి దానితో కాపడం పెట్టి చెమట పట్టించడం. ఇదే సంకరస్వేదం.

**సంక్రామికరోగం** – అంటురోగం. కుష్ఠ, జ్వరం, శోష, నేత్రాభిష్యందం, ఔపసర్గిక రోగాలు అంటురోగాలు. ఈ రోగాలు కలవారితో మాట్లాడినా శరీరస్పర్శ తగిలినా, నిట్టూర్పు తగిలినా, కలిసి భోజనం చేసినా, కలిసిపడుకున్నా, కలిసి కూచున్నా, వారి బట్టలు కట్టుకున్నా, వారు ధరించిన పూలమాలలు ధరించినా, వారు పూసుకున్న అనులేపనాలు పూసుకున్నా యీ వ్యాధులంటుకుంటాయి.

**సంఘాతబలప్రవృత్తం** – అధిభౌతిక, ఆగంతుక రోగవిశేషాలు.

**సంచరం** – శరీరం.

**సంచారిక** – ఘ్రాణం.

**సంజీవనం** – పాలు.

**సంజ్ఞాస్థాపనవర్గం** – ఇంగువ, వైడర్యం, వల్లి తుమ్మ, వస, గడ్డిదవనం, వల్లారాకు, తెల్లగరిక, జటామాంసి, గుగ్గిలం, అశోకరోహిణిన్నీ.

**సంతర్పణం** – ద్రాక్షపండు, దానిమ్మగింజలు. ఖర్జూరపండు, అరటి పండు, చక్కెర, పేల పిండి, తేనె, నెయ్యి – ఇవి కలిపిన ముద్ద ఇది సంతర్పణం.

**సంతర్పణం** – బృంహణం.

**సందుష్టభోజనం** – సంయోగ విరుద్ధభోజనం.

**సంధానం** – మద్యం.

**సంధానీయవర్గం** – యష్టిమధుకం, తిప్పతీగ, కోలపొన్న, పాఠ, మణుగుదామర, బూరుగుజిగురు, ఆరెపువ్వు, లొద్దుగుచెక్క, ప్రేంకణం, కాయఫలమున్ను.

**సంధులు** – చేతులూ, కాళ్ళూ మొదలయిన అంగాలూ, వేళ్ళు మొదలైన ప్రత్యంగాలూ కలిసిన స్థలాలు సంధులు. కీళ్ళు అంటే యివే. వీటిలో కఫం చేరివుంటుంది. ఆముదం, గ్రీజు మొదలైన చమురు పదార్థాలవల్ల బండిచక్రాలలాగ, ఈ కఫంవల్లనే బాధ లేకుండా కీళ్ళు ఆడుతూ వుంటాయి.

**సంప్రయోగం** – మైథునం.

**సంప్రాప్తి** – రోగానికి సంబంధించిన సన్నికృష్టకారణం.

**సంభిన్నాలాపం** – అసంబద్ధంగా మాటలాడడం.

**సంయమనం** – నిరోధం.

**సంయోగవిరుద్ధం** – కలిస్తే విషమించే వస్తువులు. పాలు, మాంసం ఇత్యాది.

**సంలయం** – నిద్ర.

**సంవహనం** – శరీరమర్దనం.

**సంవాహం** – చేతనం.

**సంవృతకోష్ఠం** – బద్ధకోష్ఠం.

**సంవేశం** – నిద్ర.

**సంవేశకుడు** – పక్కలు పరిచేవాడు.

**సంవేశనం** – అనియతశయనస్థానం.

**సంశమనం** – కుపితవాతపిత్తకఫాలు సమస్థాయికి తెచ్చేది.

**సంశమనౌషధం** – తిప్పతీగ – ఇత్యాదికం.

**సంశయశమహేతువు** – సంశయచ్ఛేదహేతువు.

**సంశోధనం** – శరీరంలో వుండే దోషాలు శోధించేది.

**సంశోధనౌషధం** – వాతాదులతో కలిపి స్వస్థానంలోవుండే మలసంచయం అంతా అక్కణ్ణుంచి కదిలించి నోటినుంచీ గుదస్థానంనుంచీ బయటికి వెడలించేది. దేవదాళీఫలం మొదలైనవి ఈ పనిచేస్తాయి.

**సంశ్యానం** – చలివల్ల ముదుచుకున్నది.

**సంవర్గం** – వ్యక్తీభూత, పూర్వరూపం.

**సంసర్గ రసభేదాలు** – రసాలు ఆరు. అవి మధురం, అమ్లం, లవణం, కట్టుకం తిక్తం, కషాయమున్ను. ఇలాగ విడిగాగాక యివి రెండేసి, మూడేసి, నాలుగేసి, అయిదేసి, ఆరున్నూ కలిసి వుంటాయి. మొత్తం 63 భేదాలు.

వీటివివరాలు:

ద్విరస సంయోగ భేదాలు: ఇవి 15

1. మధురామ్లం.
2. మధుర లవణం.
3. మధుర కటుకం.
4. మధురతిక్తం.
5. మధుర కషాయం.
6. అమ్ల లవణం.
7. అమ్లకటుకం.
8. అమ్లతిక్తం.
9. అమ్లకషాయం.
10. లవణకటుకం.
11. లవణతిక్తం.
12. లవణ కషాయం.
13. కటుతిక్తం.
14. కటుకషాయం.
15. తిక్తకషాయం.

త్రిరస సంసర్గభేదాలు: 20

16. మధురామ్లలవణం.
17. మధురామ్లకటుకం.
18. మధురామ్లతిక్తం.
19. మధురామ్లకషాయం.
20. మధురలవణ కటుకం.
21. మధురలవణ తిక్తం.
22. మధురలవణ కషాయం.
23. మధురకటు తిక్తం.
24. మధురకటు కషాయం.

25. మధురతిక్త కషాయం.
26. అమ్లలవణ కటుకం.
27. అమ్లలవణ తిక్తం.
28. అమ్లలవణ కషాయం.
29. అమ్లకటు తిక్తం.
30. అమ్లకటు కషాయం.
31. అమ్లతిక్త కషాయం.
32. లవణకటు తిక్తం.
33. లవణకటు కషాయం.
34. లవణతిక్త కషాయం.
35. కటుతిక్త కషాయం.

రసచతుష్క సంసర్గభేదాలు: 15

36. మధురామ్ల లవణకటుకం.
37. మధురామ్ల లవణతిక్తం.
38. మధురామ్ల లవణకషాయం.
39. మధురామ్ల కటుతిక్తం.
40. మధురామ్ల కటుకషాయం.
41. మధురామ్లతిక్త కషాయం.
42. మధురలవణ కటుతిక్తం.
43. మధురలవణ కటుకషాయం.
44. మధురలవణతిక్త కషాయం.
45. మధురకటుతిక్త కషాయం.
46. అమ్లలవణ కటుతిక్తం.
47. అమ్లలవణ కటుకషాయం.
48. అమ్లకటుతిక్త కషాయం.
49. అమ్లకటుతిక్త కషాయం.
50. లవణకటుతిక్త కషాయం.

పంచరస సంసర్గ భేదాలు: 6

51. అమ్లలవణ కటుతిక్తకషాయం.
52. మధురలవణ కటుతిక్తకషాయం.
53. మధురామ్ల కటుతిక్త కషాయం.
54. మధురామ్ల లవణతిక్తకషాయం.
55. మధురామ్ల లవణకటుకషాయం
56. మధురామ్ల లవణకటుతిక్తం.

ఏకరసభేదాలు: 6.

57. మధురం.
58. అమ్లం.
59. లవణం.
60. కటుకం.
61. తిక్తం.
62. కషాయం.

షడ్రస సంసర్గభేదం: 1

63. మధురామ్ల లవణ కటుతిక్త కషాయం.
పైని చెప్పినట్టు ద్విరసత్రిరసాదిభేదాలు యాభై యేడు విధాలు. ఔషధకల్పనం మాత్రం ఏకరసాలు ఆరూ చేరి అరవైమూడు విధాలు. ఇది స్వస్థ పరిపాలనకు, ఆతుర రక్షణకు హితమైన చికిత్సా ప్రయోగంకోసం ఋషులు నిర్ణయించినది.

**స్తంభనౌషధం** – రౌక్ష్యగుణం, శీతవీర్యం, కషాయరసం, లఘుపాకం – ఈ లక్షణాలుండి వాతంచేసే ఔషధాలు స్తంభనౌషధాలు. కొడిశపాల, దుండిగం మొదలైనవి ఈ పని చేస్తాయి.

**స్రంసనం** – విరేచనం.

**స్రంసనౌషధం** – భుజించిన ఆహారం పక్వం చెయ్యక, మల మూత్ర వాతాదులు తమ తమ స్థానాలలో చేరకుండా కిందిభాగానికి చేర్చి బయటికి వెడలించేది స్రంసనం. రేలగుజ్జు మొదలైనవి ఈ పని చేస్తాయి.

**సకృత్ప్రజ** – కాకి.

**సకృత్ఫల** – అరటిచెట్టు.

**సకృద్గర్భం** – కంచరగాడిద.

**సగ్ధి** – సహభోజనం.

**సత్వక్కులు** – పొట్టుతో వాడవలసినవి. పెసలు, కందులు మొదలైనవి. కట్టుచేసేటప్పుడివి పొట్టుతో కలిపే వాడాలి.

**సత్వావజయం** – త్రివిధౌషధాలలో వొకటి. మనస్సును లొంగదీసుకుని అహితాలైన ఆహారవిహారాదులు వర్జించడం.

**సత్వాదిస్థానం** – హృదయం.

**సత్యకర్మ** – మారేడుచెట్టు.

**సత్యవాక్కు** – కాకి.

**సదాగతి శత్రువు** – ఆముదపుచెట్టు.

**సదాపుష్పం** – కొబ్బరిచెట్టు.

**సద్యఃప్రాణకరం** – ఇవి ఆరు: 1. అప్పుడు చంపిన మృగాల మాంసం. 2. నవాన్నం. 3. బాలాసంగమం. 4. పాలతో భోజనం చెయ్యడం. 5. నెయ్యి 6. స్నానం.

**సద్యఃప్రాణహరం** – ఇవి ఆరు: 1. పాసి పోయిన మాంసం. 2. వృద్ధస్త్రీ సంగమం. 3. బాలార్క సేవ. 4. లేగడిపెరుగు. 5. ప్రాతఃకాల మైథునం. 6. ప్రాతఃకాలనిద్ర.

**సద్యఃప్రాణహరమర్మలు** – శృంగాటకాలు, అదిపతి, శంఖాలు, కంఠ సిరలు, గుదం, హృదయం, వస్తి, నాభి – అని యివి పందొమ్మిది. వీటిమీద దెబ్బతగిలితే వెంటనే ప్రాణం పోతుంది.

**సద్యఃప్రీణనం** – ఆహారం.

**సద్యోబలకరం** – పాలు. ముందు పాలు పుచ్చు కుని తరవాత సంభోగం చేయ్యాలి. సంభోగం చేసి మళ్ళీ వెంటనే పాలు పుచ్చుకోవాలి. ఏమంటే – పాలు సద్యోబలకరం. అంటే – కంఠం దిగేటప్పటికే బలం కలిగిస్తుంది.

**సద్యోబలహరం** – స్త్రీ. స్త్రీసంభోగం వల్ల వెంటనే బలం తగ్గిపోతుంది. కనక, సంభోగానంతరం వెంటనే పాలు పుచ్చుకోవాలి.

**సద్యోవ్రణం** – అంటే అప్పటికప్పుడు కలిగిన గాయం. రకరకాల ఆకారాలూ. రకరకాల వాదరలూ గల ఆయుధాలతో రకరకాల స్థలాలలో కలిగే గాయలు సద్యోవ్రణాలు. ఇవి – ఛిన్నం, భిన్నం, విద్ధం, క్షతం, పిచ్చితం, ఘృష్టం అని ఆరు విధాలు. మతాంతరంలో యీ సద్యోవ్రణం – ఘృష్టం, అవకృత్తం, విచ్ఛిన్నం, ప్రవిలంబితం, పాతితం, విద్ధం, భిన్నం, విదలితం అని యెనిమిది విధాలు.

**సద్యస్స్నేహాలు** – మాంసరసం, స్నేహపేయ, తిలచూర్ణం, కృసరం, క్షీరపేయ, సరం, పేయ – ఇవి సద్యస్స్నేహాలు, ఉప్పు కలిసిన నెయ్యి, నూనె, మజ్జ, వస – ఇవిన్నీ సద్యస్స్నేహాలే. ఇవి సేవించిన వెంటనే స్నిగ్ధత్వం కలిగిస్తాయి.

**సన్నికృష్టం** – దగ్గరది.

**సన్నిపాతం** – త్రిదోషాలూ ప్రకోపించిగాని, క్షీణించిగాని ఉండడం.

**సప్తధాతువు** – శరీరస్థరసాదిధాతువులు. ఇవి – రసం, రక్తం, మాంసం, మేదస్సు, అస్థి, మజ్జ, శుక్రం – అని యేడు.

**సప్తరక్తం** – శరీరం బయట గల ఎర్రని అవయ వాలు ఏడు. ఇవి – అపాంగం, జిహ్వ, ఓష్ఠం, గోళ్ళు, అరిచెయ్యి, దవడ, అరి పాదమున్నూ. ఇది సాముద్రికానికి సంబంధించిన సూత్రం.

**సప్తవిధత్వక్కులు** – మనుష్యుల శరీరచర్మం ఏడు విధాలు. అంటే – ఏడు పొరలుగా వుంటుంది. అవి – అవభాసిని, లోహిత, శ్వేత, తామ్ర, వేదిని, రోహిణి, మాంసధర – అని.

**సమక్వాథం** – ఎనిమిదో వంతు మిగిలేటట్టు కాచిన కషాయం.

**సమత్రయం/సమత్రితయం/సమత్రయి** – కరక్కాయ, సొంటి, బెల్లం – ఇవి సమ భాగాలుగా గ్రహించినది.

**సమదోషత్రయం** – వాతపిత్త కఫాల సమస్థితి.

**సమప్రకృతి** – వాతపిత్త కఫాలు సమస్థితిలో వున్న పురుషుడు. అతను మిశ్రవర్ణంగా వుంటాడు. దీప్తగాత్రుడూ, గంభీరుడూ, ధీరుడూ, అతివిదీర్ఘ రోముడూ, స్త్రీజనప్రియుడూ, భారవహుడూ, అతినిద్రుడూ, భోగపురుషుడున్నూ అయివుం టాడు.

**సమవాయం** – అపృథగ్భావం, అంటే కలిసి వుండడం.

**సమశనం** – హితాహిత ద్రవ్యాలు కలిపి, కొంచెం తక్కువగా తినడం.

**సమానం** – శరీరంలో వుండే పంచవా యువులలోనూ ఇదొకటి. దీని స్థానం పచ్యమానాహారాశయం.

**సమాలంభం** – కుంకుమాది లేపనం.

**సమాలంభనం** – కషాయం.

**సమీరణ** – ఇది స్త్రీల గర్భాశయంలో వుండే వొక నాడి. ఇది ప్రధానమైనదే. కాని దీని ముఖాన పడిన పురుష వీర్యం నిష్ఫలం అవుతుంది.

**సముత్థానం** – వ్యాధినిర్ణయం.

**సముద్గిరణం** – వమనం.

**సముద్రగృహం** – జలయంత్రం వుండే ఇల్లు.

**సముద్రనవనీతం** – అమృతం.

**సముద్రాంతం** – జాజికాయ.

**సమూహక్షారం** – సర్వక్షారాల సమూహం. ఇది మలశోధక క్షారద్రవ్యం.

**సమ్యక్షారం** – టంకణక్షారం.

**సరజం** – హైయంగవీనం. వెన్న.

**సర్గం** – మిక్కిలీ దుఃఖనివృత్తి రూపమైన సుఖం.

**సర్పదష్టకం** – పాముకాటు. ఇది నాలుగు విధాలు: 1. సర్పితం, 2. రదితం, 3. నిర్విషం, 4. సర్పాంగాభిహతం. వాగ్భటుడు ఇది తుండాహతం, వ్యాలీఢం, వ్యాలుప్తం,

దంష్ట్రకం, దష్టనిపీడితం అని అయిదుర కాలన్నారు. వీటిలో మొదటి రెండున్నూ నిర్విషాలు. దష్టనిపీడితం అసాధ్యం, వ్యాలుప్తం కృచ్ఛ్రసాధ్యం.

సర్పప్రియం – చందనవృక్షం.

సర్పభుక్కు – నెమలి.

సర్పిర్గర్భం – వెన్న.

సర్వగం – ఆత్మ.

సర్వగంధం – దాల్చినిచెక్క, ఏలకులు, ఆకుపత్రికం, నాగకేసరాలు, పచ్చకర్పూరం, కంకోలం, అగురుచెక్క, సిహ్లకం, లవంగాలు – వీటి సమవాయం.

సర్వగ్రహరూపమాత్ర – ఆహారమాత్రలో ఇదొక రకం. అన్నం, కూరలు, పచ్చళ్ళు, పులుసు, మజ్జిగ మొదలైన ఆహారపదార్థాలు షడ్రసయుక్తాలయి వుంటాయి. అవన్నీ కలసిన మొత్తం ఆహారం మోతాదు సర్వగ్రహరూపమాత్ర.

సర్వతోముఖం – జలం.

సర్వధాతుకం – రాగి.

సర్వపాచకం – టంకణక్షారం.

సర్వభక్ష్య –మేక.

సర్వమూల్యం – గవ్వ.

సర్వరసం – లవణం.

సర్వరసోత్తమం – లవణం.

సర్వలోహం – రాగి.

సర్వసాధనం – స్వర్ణం.

సర్వస్నేహం – నెయ్యి, మానె, వస, మజ్జ.

సర్వస్నేహోత్తమాలు – చమురులన్నిటిలోనూ నెయ్యి – మానె, వస, మజ్జ – ఇవి ఉత్తమాలు. వీటిలో మళ్ళీ నెయ్యి సర్వోత్తమం.

సర్వహితం – మిరియాలు.

సర్వక్షారం – సురేకారం.

సర్వాంగసారాలు – కలబంద, పొట్ల, పిప్పలి మూలం నేలమేము, కటుకరోహిణి, చవ్యం, చిట్టీత, గరుక, గొంతెమగోరు, పులిచింత, పాదిరి ఇత్యాదులు సర్వాంగసారాలు.

సర్వామ్లం – సకల ప్రశస్త అమ్లరసాలు. ఇవి – కాంజికం, సురసౌవీరకం, పెరుగుమీది తేట ఇత్యాదులు.

సర్వౌషధికం – చెంగల్వకోష్టు, జటామాంసి, పసుపు, మానుపసుపు, మరువకం, శిలాజిత్తు, సంపంగి, వస, పచ్చకర్పూరం, తుంగగడ్డలున్నూ.

సవర్ణకరణం – గాయాలూ కురుపులూ మానినచోట మచ్చ యేర్పడుతుంది. అది పోగొట్టి, ఆ స్థలం దేహవర్ణంతో సరిచేసే ప్రక్రియ.

ససత్వ – గర్భవతి.

సహచరద్వయం – వల్ల ములుగోరింట, పచ్చ ములుగోరింట.

సహజరసం – స్వరసం.

సహజబలం – త్రివిధబలాలలో ఇదొకటి. కొందరికి శరీర బలమూ, బుద్ధి బలమూ పుట్టింది మొదలు సహజంగానే వుంటాయి. ఇది సహజబలం.

సహస్రధౌతం – వెయ్యిమాట్లు కడిగిన నెయ్యి మొదలైనవి.

సహస్రవీర్యం – అనేక శక్తులు కలది.

సహాద్వయం – ముద్గపర్ణి, మాషపర్ణి.

సాంధ్యకుసుమం – త్రిసంధ్యలయందున్ను వికసించివుండే పువ్వు.

సాగరగామిని – చిన్న ఏలకులు.

సాగ్నికస్వేదకర్మలు – అగ్నిసంపర్కం లేకుండా స్వేదం కలిగించే ప్రక్రియలు. సంకరాది పదమూడు స్వేదకర్మలూ సాగ్నికస్వేదకర్మలే.

సాత్మ్యం – ఏ వస్తువు భుజిస్తే ఎవనికి సుఖం కలుగుతుందో అది వానికి సాత్మ్యం. ఈ సాత్మ్యం చేష్టాఖ్యం, ఆహారాఖ్యం అని రెండు విధాలు. చేష్టాఖ్యం కాయ వాఙ్మనోభేదాలతో మూడు విధాలు. ఆహారాఖ్యం షడ్రసాలమబట్టి ఆరువిధాలు. ఈ సాత్మ్యం ప్రవరం అవరం మధ్యమం అని మళ్ళీ మూడు విధాలు. సర్వరసం ప్రవరం. ఏకరసం అవరం. మధ్యం మధ్యమం.

సాత్మ్యగుణాలు – శిశువులకు కలిగే గుణాలలో కొన్ని సాత్మ్యంవల్ల కలుగుతాయి. అవి – బాహువీర్యం, ఆరోగ్యం, బలం, వర్ణం, మేధాశక్తి ఇత్యాదులు.

సాత్త్వికగుణాలు – క్రూరకర్మలు చెయ్యకపోవడం, సంవిభాగరుచిత, ఓర్పు, సత్యం, ధర్మం, ఆస్తిక్యం, జ్ఞానం, బుద్ధి, మేధ, స్మృతి, ధృతి, అనభిషంగమున్ను.

సాధకం – పిత్తాలలో ఇదొకటి. ఇది బుద్ధిధృతికరం. హృదయంలో వుండే అగ్నికిన్నీ సాధకం అని పేరుంది. దీనివల్లనే మనోభిలాషలు, అంటే – కోరిక లేర్పడుతూ వుంటాయి.

సాధారణదేశం – జాంగల, ఆనూప – ఉభయలక్షణాలున్నూ కల దేశం.

సాధారణమృగం – జాంగలదేశాలలోనూ, ఆనూపదేశాలలోనూ కూడా సంచరించే మృగాలు.

సాధువృత్తం – హితాహారవిహారరూపం.

సాధ్యరోగం – చికిత్సకు లొంగే వ్యాధి. ఇది సుసాధ్యం, కృచ్ఛ్రసాధ్యం. అని రెండు విధాలు. కొద్దికాలంలో సులువుగా తగ్గేది సుసాధ్యం. చాలాకాలానికి కష్టంమీద తగ్గేది కృచ్ఛ్రసాధ్యం.

సానుబాధనం – కాలాంతర ప్రాణహరం.

సాన్నాయ్యం – నెయ్యి.

సామత్రయం – కరక్కాయ, సొంటి, తిప్పతీగ.

సామాన్యగుణాలు – పృథివ్యాది పంచభూతాలకూ సామాన్యాలు కావడంవల్ల గురు లఘు శీత ఉష్ణ స్నిగ్ధ మంద తీక్ష్ణ స్థిర సర మృదు కఠిన విశద పిచ్ఛిల శ్లక్ష్ణ ఖర స్థూల సూక్ష్మ సాంద్ర విశద ఈ ఇవన్నీ సామాన్యగుణాలు.

సాముద్రోదకం – వెండిపాత్రలో మంచి బియ్యపు అన్నం వుంచి దాని మీద ఏ నీళ్ళు పోస్తే వివర్ణమై అది చెడిపోతుందో అది సాముద్రోదకం. ఈ నీరు ఒక్క ఆశ్వయుజమాసంలో తప్ప తక్కిన మాసాలతో పుచ్చుకోగూడదు.

సాయంత్రభోజనం – అంటే సాయంకాలం భోజనం చేసే సమయం. ఇది రెండో భోజనసమయం. ఉదానవాతం ప్రకోపించి ఉండి స్వరభంగాదికం కలిగిస్తే యీ సమయంలో చేసే భోజనంలో ముద్దముద్దకీ ఔషధం పుచ్చుకోవాలి. ప్రాణవాతం ప్రకోపించివుంటే భోజనం కాగానే మందు పుచ్చుకోవాలి.

సాయోద్భిదుర – సాయంకాలం వికసించే మల్లె మొదలైన పువ్వులు.

సారం – దేహాంతర్గతమైన స్థిరపదార్థం. త్వక్కు, రక్తం, మాంసం, మేదస్సు, అస్థి, మజ్జ, శుక్రం, సత్వం – అవి యెనిమిది విధాలు.

సారజం – నవనీతం.

సారణ – రససంస్కారాలలో నొకటి. రసశోధనకుపయోగించే ఒక యంత్రమున్నూ.

సారవర్గం – క్షీరవృక్షవర్గం.

సారసారాలు – ఇప్ప, చందనం, రక్తచందనం, నేరేడు, దేవదారు, చంద్ర, వేగిస, వేప – ఇత్యాదుల చేవ మాత్రమే వాడాలి.

సారసోదకం – నదిమంచి అయినా, పర్వతంమంచి అయినా నీరు ప్రవహించి, అది ఒక చోట నిలిచివుండి, కలవలు తామరపువ్వులు మొదలైనవాటితో నిండివుండేది సరస్సు. అందులోని జలం సారసోదకం.

సావర్ణ్యలక్ష్యం – చర్మం.

సావిత్రం – గర్భం.

సాహసం – బలవంతులను ఎదిరించడం ఇత్యాది.

సిందూరతిలక – స్త్రీ.

సింధులవణం – సముద్రలవణం.

సింధూపలం – సైంధవలవణం.

సింహవిక్రాంతం – గుర్రం.

సికతిలం – ఇసుక ఎక్కువగా వుండే ప్రదేశం.

సితరాగం – వెండి.

సితాగ్రం – ముల్లు.

సితాత్రయం – మూడు రకాల చక్కెర – 1. గుడోత్పన్న, 2. హిమోత్పన్న, 3. మధుర – అవి.

సితాసితం – తెలుపూ నలుపూ కలిసిన రంగు.

సితోదర – గవ్వలలో ఒకరకం.

సిద్ధధాతువు – పాదరసం.

సిద్ధసలిలం – కాంజికం.

సిద్ధవస్తి – మారేడు, దుందిలం, గుమ్ముడు, కూరవెల్లి, పాదిరి – వీటి కషాయంలో మానె, పిప్పలిచూర్ణం, తేనె, సైంధవలవణం, యష్టిమధుకం – ఇవి కలిపి ప్రయోగించేది.

సిద్ధాంతం – నిర్ణయం. పరీక్షకులు బహువిధాల పరీక్షించి హేతువాదంతో స్థిరపరిచినది. ఇది సర్వతంత్ర సిద్ధాంతం, ప్రతితంత్ర సిద్ధాంతం, అధికరణసిద్ధాంతం, అభ్యుపగమ సిద్ధాంతం అని నాలుగు విధాలు.

సిద్ధార్థ యుగ్మం – తెల్ల ఆవాలు, పచ్చ ఆవాలున్నూ.

సిద్ధోదకం – కాంజికం.

సిరలు – దోషాలకూ ధాతువులకూ మార్గాలయి, సంధులను బంధించి ఉంచేవి సిరలు.

సీద్యం – ఆలస్యం.

సీవనం – శస్త్రకర్మ చేసినచోట కుట్టడం. ఇది వెల్లితం, గోఫణిక, తున్న సీవని, ఋజుగ్రంధి అని నాలుగు రకాలు.

సుక్తం – ఇది కందాదులతో తయారుచేసిన సంధాన విశేషం.

సుఖాంబువు – వేడినీళ్ళు.

సుగంధత్రయం – చందనం, కురువేరు, నాగకేసరం.

సుగంధత్రిఫల – జాజికాయ, లవంగాలు, ఏలకులున్ను – మతాంతర సుగంధత్రిఫల – పోకచెక్క, జాజికాయ, లవంగాలున్ను. దీనికే మూడోత్రిఫలం అనిపేరు.

సుగంధపంచకం – కంకోలం, పోకకాయ, లవంగాలు, జాజికాయ, పచ్చకర్పూరమున్ను.

సుగంధషట్కాం – జాజికాయ, కంకోలం, లవంగం, కురువేరు, పోకచెక్క, పచ్చకర్పూరమున్ను.

సుగంధామలకగణం – ఉసిరిక పప్పు, దాల్చిని చెక్క, చెంగల్వకోష్టు, జటామాంసి, వస, పసుపు, శైలేయం, చందనం, మురామాంసి, పచ్చకర్పూరం, తుంగముస్తలున్ను.

సుదధి – వెలగపండు.

సుదంతిక – ఆవు.

సుధాంశురత్నం – ముత్యం.

సుధాపాణి – ధన్వంతరి.

సుధాసూల – పద్మం.

సుధోద్భవుడు – ధన్వంతరి.

సునంద – శిశువులను పీడించే ఒక గ్రహం. ఇది రెండోనాడు గాని, రెండోమాసానగాని, రెండోయేట గాని శిశువులను పట్టిపీడిస్తుంది. దాంతో జ్వరం, కళ్ళు తెరవకపోవడం, ఇత్యాది బాధలు సంభవిస్తాయి.

సునాదం – శంఖం.

సుప్తజనం – అర్ధరాత్రి.

సుప్తజ్ఞానం – స్వప్నం.

సుప్తి – నిద్ర, స్పర్శజ్ఞానం లేకపోవడం.

సుప్రతిభ – మద్యం.

సురదుందుభి – తులసిచెట్టు.

సురభిత్రిఫల – ఇదే సుగంధిత్రిఫల. జాజికాయ, ఏలకులు, లవంగాలున్ను.

సురభీజలం – గోమూత్రం.

సురసయుగ్మం – తెల్లతులసి, నల్లతులసిన్ని.

సురసాష్టం – వావిలి, తులసి, సరస్వతి, పెద్దములక, వాకుడు, గలిజేరున్ను.

సురాకరం – కొబ్బరిచెట్టు.

సులంఘనం – చక్కగా పూర్తి అయిన లంఘనం. పుష్టమారుత విణ్మూత్రత, క్షుత్పిపాసాసహత్వం, తేలికగా వుండడం, ప్రసన్నాత్మేంద్రియత్వం, చిక్కివుండడం – ఇవి లంఘనం పూర్తి అయి పథ్యంపుచ్చుకోవలసినవాడి లక్షణాలు.

సువర్ణం – హరిచందనం.

సువర్ణఘ్నం – తగరం.

సువర్ణమిత్రం – వెలిగారం.

సువర్ణవర్ణ – పసుపు.

సువాసిని – తండ్రి యింట వుండిన స్త్రీ.

సుశ్రుతుడు – ఇతను విశ్వామిత్రుని కొడుకు. ధన్వంతరి శిష్యుడు. సుశ్రుత సంహిత అని తన పేరిట వైద్యగ్రంథం రచించినవాడు. ఇది స్వతంత్రగ్రంథం.

సుప్రైత్పరిషత్తు – పరిషత్తులలో ఇదొకరకం. ఇష్టులతో నిండిన పరిషత్తిది.

సూచివదనం – దోమ.

సూచ్యాస్యం – ఎలుక.

సూతక – అప్పుడు ప్రసవించిన స్త్రీ.

సూతకాగృహం – పురిటిల్లు.

సూతిక – బాలింతరాలు.

సూతికావాసం – పురిటిల్లు.

సూతికాషష్ఠి – పురుడు వచ్చిన ఆరోనాడు పురిటింట్లో పూజించవలసిన దేవత. ఈ పూజ విష్ణుధర్మోత్తరంలో చెప్పబడివుంది.

సూతిమాసం – ప్రసవం అయే మాసం. తొమ్మిది లేక పదోది.

సూత్రం – శాస్త్రాదిసూచన గ్రంథం, వైద్యశాస్త్రంలో – ప్రతిసంస్కర్తృసూత్రం, ఐకీయసూత్రం, శిష్యసూత్రం, గురుసూత్రం అని నాలుగు విధాలు.

సూత్రాంగ – మంచిరకం కంచు.

సూత్రి – కాకి.

సూదశాల – పాకశాల.

సూపకారుడు – వంటలవాడు. ఇంగితాకారతత్వజ్ఞుడూ, బలవంతుడూ, చక్కగా వంటలు చెయ్యగలవాడూ, కరిమడూ, ఇవి సూపకార లక్షణాలు.

సూపధూపనం – ఇంగువ.

సూపశ్రేష్ఠ – పెసలు.

సూపాంగం – ఇంగువ.

సూామం – పాలు.

సూర్పం – మానపరిభాష. రెండు ద్రోణాల పరిమాణం.

సూర్పపర్ణి – ముద్గపర్ణి, మాషపర్ణిన్ని.

సూక్ష్మవస్త్రం – మెత్తనిబట్ట.

సూక్ష్మశరీరం – జ్ఞానేంద్రియా లయిదు. కర్మేంద్రియా లయిదు. వాయువులయిదు. బుద్ధి, మనస్సున్ను – ఇలాగ ఇది సప్తదశావయవాలు కలది.

సూక్ష్మశర్కర – ఇసుక.

సూక్ష్మౌషధం – శరీరంలో వుండే అతి సూక్ష్మాలైన రోమరంధ్రాలద్వారా లోపల ప్రవేశించి శరీరం అంతటా వ్యాపించేవి సూక్ష్మౌషధాలు. ఇవి తైలాదులు.

సేకం – స్నేహాదులతో నేత్రపరిషేకం.

సేవని – ఇది శరీరావయవ సంయోగవిశేషం. ఇవి ఏడు. శిరస్సున అయిదు. మేఢ్రంలో ఒకటి. నాలుకలో ఒకటి. ఇవి యెన్నడూ విడిపోవు.

సైరేయకద్వయం – పచ్చ ములుగోరింట, తెల్ల ములుగోరింట.

సోమజం – పాలు.

సౌఖ్యం – ఆరోగ్యం.

సౌధభూషణం – సున్నం.

సౌమ్యగిరి – హిమవత్పర్వతంసౌమ్యగిరి. దానిమీద పుట్టే ఓషధులు సౌమ్యగుణభూయిష్ఠాలయి వుంటాయి.

సౌవిదుడు – అంతఃపుర రక్షకుడు.

సౌహిత్యం – అతృప్తి. ఎంత ఆహారం భుజిస్తే కడుపులో పీడ కలగకుండా వుంటుందో అంతటి ఆహారం భుజించడం.

స్తిమితం – స్థిరం.

స్తేయం – దొంగతనం.

స్తైమిత్యం – శరీరంమీద తడిబట్ట కప్పినట్లుండడం.

స్థాపరవిషాశ్రయాలు – ఆకులు, కాయలు, వేళ్ళు, పట్ట, పువ్వులు, పాలు, చేప, బంక, దుంప, తాళకం, శంఖపాషాణం మొదలైనవి. ఇవి స్థాపరవిషం ఉండే స్థలాలు.

స్థావరస్నేహాశ్రయాలు – నువ్వులు, ఆముదపు గింజలు, కరకగింజలు, ఇప్పగింజలు, ఆవాలు, కుసుమగింజలు, అవిసెగింజలు, ఊడుగుగింజలు కానుగుగింజలు ఇత్యాది.

స్థిరాద్వయం – శాలిపర్ణి, పృశ్నిపర్ణి.

స్థూలపాదుడు – బోదకాలు గలవాడు.

స్త్రీరంజనం – తాంబూలం.

స్నాయువులు – శరీరంలో వున్న మాంసం, అస్థులు, మేదస్సు – వీటిని అన్యోన్యం బంధించివుంచే సన్నని వరాలకు స్నాయువులని పేరు.

స్నిగ్ధం – చమురుగలది.

స్నేహం – చమురు. ఇవి ఘృతం, తైలం, వస, మజ్జ అని నాలుగు విధాలు. మరిన్నీ, ఇది స్థావరం, జంగమం అనిన్నీ రెండు విధాలు. వీటిలో తైలం స్థావరం, ఘృతం జంగమం.

స్నేహచతుష్టయం – ఘృతం, తైలం, వస, మజ్జ.

స్నేహద్వితయం – స్థావరాలనీ జంగమాలనీ చమురులు రెండురకాలు. నువ్వులు, పిస్తా గింజలు, తాండ్రగింజలు, ఆముదపుగింజలు, ఇప్పగింజలు, ఆవాలు, కుసుమగింజలు, మారేడుగింజలు, ముల్లంగి గింజలు, అవిసె గింజలు, ఊడుగుగింజలు, కానుగుగింజలు, మునగ గింజలు – ఇవి స్థావరాలైన చెట్లవల్ల లభించేవి. కనక, వీటినుంచి పుట్టిన చమురులు స్థావరాలు. చేపలు, మృగాలు, పక్షులు ఇత్యాదులు జంగమాలు. వీటివల్ల లభించే చమురులు జంగమాలు. పెరుగు, పాలు, నెయ్యి, మాంసం, వస, మజ్జ – ఇవిన్నీ చమురులే.

స్నేహనం – ఇది బృంహణం కలిగించే ఒక ధూమపాన విశేషం.

స్నేహభువు – కఫం.

స్నేహయోనులు – అంటే చమురుగలవి. స్థావరాలు, జంగమాలున్ను.

స్నేహవర్గం – నెయ్యి, నూనె, వస, మజ్జ – ఇవి పాన వస్తి అభ్యంగ నశ్యకర్మలలో వాడవచ్చు.

స్నేహాశ్రయాలు – చమురులు గలవి. స్థావర జంగమాలు.

స్నేహోపగవర్గం – ద్రాక్షపండు, యష్టిమధుకం, తిప్పతీగ, మేద, నేల గుమ్ముడు, కాకోళి, క్షీర కాకోలి, జీవకం, పాలకూర, ముయ్యాకుపొన్న.

స్నైహికగండూషం – స్నిగ్ధాలూ, ఉష్ణాలూ అయిన కషాయాదులు పుక్కిలించడం. ఇది వాతవ్యాధులలో హితకరం.

స్నైహికధూమం – వస, నెయ్యి, మైనం మొదలైన స్నేహద్రవ్యాలతోనూ, జీవకల, ఋషభకం మొదలైన ఉత్తమ మూలికలతోనూ చేసిన ధూమవర్తి. ఇది ధూమ యంత్రంలో వుంచి నిప్పు ముట్టించి పొగపీల్చేది.

స్మరాసవం – తాటికల్లు.

స్మృతి – అనుభూతమైన సంగతి జ్ఞాపకం చేసుకోడం.

స్రోతస్సులు – చెవులు, కళ్ళు, నోరు, నాసికా రంధ్రాలు, గుదం, మేఢ్రం – ఈ తొమ్మిదీ పురుషులకు ఊర్ధ్వముఖ స్రోతస్సులు. ఇవికాక స్త్రీలకు మరోమూడు స్రోతస్సులున్నాయి. అవి రెండు స్తనాలూ రక్తవహనాడిన్నీ.

స్వపనం/స్వప్నం – నిద్ర.

స్వప్నదోషం – స్వప్నంలో రేతస్ఖలనం కావడం.

స్వరసం – పచ్చివస్తువు నూరి పిండిన రసం.

స్వాదుత్రిఫలాలు – ద్రాక్షపండు, ఖర్జూరపండు, పెద్దమ్మదుమ్ము. రెండోత్రిఫలాలనిన్నీ వీటికి పేరు.

స్వాపం – నిద్ర, స్పర్శజ్ఞానం లేకపోవడం.

స్వాపాశ్రయం – శయ్య.

స్వామ్యుపకారకం – గుర్రం.

స్వాస్థ్యం – ఆరోగ్యం.

స్వేదం – చెమట. ఇది తాపంవల్లా, ఉక్కవల్లా పుడుతుంది. ద్రవంతోనూ, ఉపనాహంతోనూ సాధించవచ్చు. ఈ స్వేదకర్మ పదమూడు పదాలు. అవి – 1. సంకర స్వేదం, 2. ప్రస్తర స్వేదం, 3. నాడీస్వేదం, 4. పరిషేకస్వేదం, 5. అవగాహస్వేదం, 6. జేంతాకస్వేదం, 7. అశ్మఘనస్వేదం, 8. కర్షూస్వేదం, 9. కుటీస్వేదం, 10. భూస్వేదం, 11. కుంభిస్వేదం, 12. కూపస్వేదం, 13. హోల స్వేదం అవి. ఇవన్నీ అగ్నిగుణ సంబంధంతో చేసేవి. ఇవికాక – వ్యాయామం, ఉష్ణసదనం, దట్టమైన కంబళ్ళు మొదలైనవి కప్పుకోడం, ఆకలి, మిక్కిలీ మద్యపానం చెయ్యడం, భయం, క్రోధం, ఉపనాహం, ఎండ, మల్లయుద్ధం – వీటివల్ల కూడా చెమట పుడుతుంది. ఇవి అగ్నిసంబంధంలేనివి.

స్వేదనం – రససంస్కారాలలో ఇదొకటి.

స్వేదనయంత్రం – రసస్వేదనయంత్రం.

స్వేదనాశం – గాలి.

స్వేదని – సుర తయారుచేసే ఒక విధమైన పాత్ర.

స్వేదమాత – శరీరంలో వుండే రసధాతువు.

స్వేదాప్రవర్తనం – చెమట పట్టకపోవడం.

స్వేదోపగవర్గం – మునగ, ఆముదపుచెట్టు, జిల్లేడు, తెల్లగలిజేరు, గలిజేరు, యవలు, నువ్వులు, ఉలవలు, మినుములు, రేగున్ను.

స్వేద్యద్రవ్యాలు – నువ్వులు, మినుములు, ఉలవలు – ఇవి పుల్లని గంజి, నెయ్యి, నూనె, మాంసం, అన్నం, పాయసం, కృసరం – వీటితో రుబ్బి ముద్దచేసి వాడుకునేది.

## హ

హంసపాకయంత్రం – ఔషధాలవంట కుపయోగించే ఒక యంత్రం.

హంసపాకాగ్ని – హంసపాకయంత్రంతో ఔషధాల వంట కుపయోగించే ఒకానొక అగ్ని.

హంసాభిముఖ్యం – వెండి.

హంసోదకం – అంశూదకం.

హరిద్రాదిగణం – పసుపు, మానుపసుపు, యష్టిమధుకం, పృశ్నిపర్ణి, కోడిశపాల విత్తులున్ను.

హరిద్రాద్వయం – పసుపు, మానుపసుపు.

హరిద్రాపంచకం – పసుపు, మానుపసుపు, ఆమ్రహరిద్ర, కచ్చూరాలు, మేడి.

హసంతిక – కుంపటి.

హస్తిదంతం – ముల్లంగి దుంప.

హితం – పథ్యమైనది.

హిమవిధి – అంటే శీతకషాయం చేసే విధి.

హీనయోగం – శ్రోత్రం మొదలైన యింద్రియాలకు, శబ్దం మొదలైన విషయాలకు స్వల్పసంబంధం వుంటే హీనయోగం.

హృద్యం – హృదయానికి మేలు చేసేది.

హృద్యవర్గం – మామిడి, కొండమామిడి, నిమ్మకాయ, వాకపండు, చింతపండు, అమ్లవేతసం, పెద్దరేగు, పిన్నరేగు, దానిమ్మ, మాదీఫలమున్ను.

హేమమిత్రం – పటిక.

హేమశోధిని – పటిక.

హైయంగవీనం – అప్పుడు కాచిన నెయ్యి.

హోలాకస్వేదం – స్వేదకర్మలలో ఇదొకరకం.

ఆవు, గుర్రం, ఏనుగు, గాడిద, లొట్టిపిట్ట – వీటి లద్దె ఎండబెట్టి, మంచమంత పొడుగువ పేర్చి, నిప్పుపెట్టి, మంట తగ్గిపోయిన తరవాత దానిమీద నులకమంచం వేసి, పక్కకూడా వేసి రోగిని వాతహర్ల తైలం పూసి, దానిమీద పడుకోబెట్టి, బట్టకప్పి వుంచితే చక్కగా చెమట పట్టుతుంది. ఇది హోలాకస్వేదం.

**ప్రాదం** – అంటే మడుగు. ఇది ఒకరు నిర్మించినది కాదు. సహజంగా ఏర్పడ్డది.

**హ్రస్వపంచమూలం** – లఘుపంచమూలం.

**హ్లాది** – ఆహ్లాదకరం.



**క్షారం** – మోదుగుపట్ట మొదలైనవి కాల్చి, ఆ బూడిదతో తయారుచేసే లవణవిశేషం. క్షారకల్పన చూసుకునేది.

**క్షారకర్మ** – క్షారంతో చేసే దాహక్రియ.

**క్షారకల్పన** – క్షారవృక్ష కర్రలు బాగా యెండబెట్టి కాల్చి బూడిద చెయ్యాలి. ఈ కాల్చడంలో ఇతర కర్రల సంబంధం వుండగూడదు. అంటే ఇతర బూడిద అందులో కలియగూడదు. ఆ బూడిద ఇనుప పాత్రలో వుంచి దానికి నాలుగురెట్లు నీళ్ళు పోసి బాగా కలిపి ఒక రాత్రి వుంచాలి. తెల్లవారిన తరవాత స్వచ్ఛంగా తేరివున్న జలం తీసుకోవాలి. మడ్డి యెంతమాత్రమూ కలవగూడదు. ఆ నీరు ఇగిరి పోయేవరకూ కాచాలి. అలా కాస్తే పాత్రలో ఉప్పు మిగులుతుంది. అదే క్షారం.

**క్షారత్రయం** – సర్జక్షారం, యవక్షారం, టంకణక్షారం.

**క్షారదశకం** – పది రకాల క్షారాలు. అవి – శిగ్రు, మునగ, ముల్లంగి, మోదుగు, చుక్రిక, చిత్రమూలం, అల్లం, వేప, చెరుకు, ఉత్తరేణి, 'అరటిదుంపలతో చేసినవి.

**క్షారద్వయం** – సర్జిక్షారం, యవక్షారం.

**క్షారపంచకం** – యవక్షారం, ముష్కక క్షారం, సర్జిక్షారం, పలాశ క్షారం,తిలనాళక్షారమున్ను.

**క్షారవర్గం** – సర్జిక్షారం, యవక్షారం, టంకణక్షారం.

**క్షారషట్కం** – నువ్వుక్షారం, మోదుగుక్షారం, ఉత్తరేణిక్షారం, వసక్షారం, కొడిశపాల క్షారం, మొక్కపుక్షారం.

**క్షారసప్తకం** – టంకణక్షారం, సర్జిక్షారం, యవక్షారం, మోదుగు క్షారం, ఉత్తరేణిక్షారం, మారేకారం, సౌవర్చల క్షారమున్ను.

**క్షారసారాలు** – తెగడ, చిత్రమూలం, జెముడు, కామగు, ఎర్ర గలిజేరు, తెల్లగలిజేరు, చవ్యం, అక్షపరం, దుండిగం, పాదిరి, వేము, నేపాళం, వాకుడు, ములుమోదుగు, మోదుగు, పాపర, గంటెన, అడవిపెసర, వావిలి, ఉప్పి, పసుపు, నీలి, మొగిలి, బోడతరం, ఉత్తరేణి, అడవి వాయింట, తెల్లజిల్లేడు, వాయింట, కుక్కవాయింట, నువ్వులు, నీరుగొబ్బి, నీరు ప్రబ్బలి, శింశుపావృక్షం, మద్ది, దేవదారు, మువగ, మొక్కపు చెట్టు, కామంచి – ఇవన్నీ క్షారసారాలు. అంటే ఇవి కాల్చి క్షారం చేసేది.

**క్షారాచ్ఛం** – సముద్రలవణం.

**క్షారాష్టకం** – మోదుగు, ఉత్తరేణి, ఇరుగుడు, నువ్వు, యవక్షారం, వేగిస, వెలిగారం, సర్జిక్షారమున్ను.

**క్షితితలవిధి** – పాతాళయంత్రం.

**క్షీరకోష్ఠం** – స్వేదకర్మలలో ఇదొకరకం. అవగాహన స్వేదంలో వాడే తొట్టె కషాయంతోకాక పాలతో నింపేది. ఇంతే భేదం.

**క్షీరజలం** – పాలు కలిసిన నీరు.

**క్షీరదోషాలు** – ఈ దోషాలు ఎనిమిది. 1. వైవర్ణ్యం (రంగు మారిపోవడం), 2. వైగంధ్యం (వాసన చెడడం), 3. వైరస్యం (రుచిచెడడం), 4. పైచ్ఛిల్యం (జిగటగా వుండడం), 5. ఫేనసంఘాతం (మరగతో గడ్డకట్టి వుండడం), 6. రౌక్ష్యం (జిడ్డు తగ్గిపోవడం), 7. గౌరవం (బరువుఎక్కడం), 8. అతిస్నేహం (మిక్కిలి జిడ్డుగా వుండడం).

**క్షీరవర్గం** – క్షారాష్టకం చూడు.

**క్షీరసారం** – వెన్న.

**క్షీరసారాలు** – పాలే సారంగాగల చెట్లు. త్రివిల్వం, జీడి, పెద్ద జెముడు, ఆకుజెముడు, పచ్చగన్నేరు, జిల్లేడు, రావి, మర్రి, అత్తి, జువ్వి ––– ఇవన్నీ పాలే సారమైనవి.

**క్షీరాబ్ధిజం** – సముద్ర లవణం.

**క్షీరాష్టకం** – గొర్రె, మేక, ఆవు, గేదె, లొట్టి, ఏనుగు, గుర్రం, మేక – వీటి పాలు.

**క్షీరివృక్షాలు** – పాలు కారేచెట్లు. ఇవి – మఱ్ఱి, మేడి, రావి, జువ్వి, కంజువ్విప్పి.

**క్షుతం** – అంటే తుమ్ము. హృదయంలో వుండే ప్రాణవాయువూ, కంఠంలోవుండే ఉదానవాయువూ ఏకమయి శిరస్సున ప్రవేశించి ముందు స్రోతోమార్గాలడ్డగిస్తాయి. క్షణకాలం అక్కడ స్థిరంగా వుంటాయి. తరవాత అతివడిగా ముక్కునుంచి బయటికి వస్తాయి. అప్పుడు పెద్ద ధ్వని అవుతుంది. అదే తుమ్ము.

**క్షుపం** – సన్నంగా పొట్టిగావుండే చెట్టు.

**క్షుద్రపంచకం** – స్వల్పపంచ మూలం.

**క్షైత్రియం** – అసాధ్యరోగం.

**క్షైత్రీకరణం** – రసాయనౌషధాలు వాడడానికి ముందు దేహానికి రసాయనయోగ్యత సిద్ధించడానికి పంచకర్మలు చెయ్యడం.

★ ★ ★